## వేదుల శకుంతల

# కృష్ణాతరంగిణి

(విభిన్న వ్యాస మాలిక)



జయంతి పబ్లికేషన్స్

దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్ - 60

# KRISHNAATARANGINI

(A Reproduction of Various Essays)

by

**VEDULA SHAKUNTALA**



**First Edition** November, 2002 **Cover Design** Sharat Siddoju

**For Copies**

SV **KrishnaJayanthi** 19 - 90, P & T Colony, Dilsukh Nagar, Hyderabad - 500 060.

Ph. (040) 4042446

**Distributers**

VISALANDHRA BOOK HOUSE, Hyderabad. and all its branches.

NAVAYUGA DISTRIBUTERS, Badi Choudi, Koti, Hyderabad.

NAVODAYA PUBLISHERS, Opp. Lane to Aryasamaj, Koti, Hyderabad.

**Price: Rs. 75 /-**



Laser Type setting, Printed and Published by

**JAYANTHI PUBLICATIONS**

19 - 90, P & T Colony, Dilsukh Nagar, Hyderabad - 500 060.

Ph. (040) 4042446

# అంకితం



మహిళల్లో చైతన్యం రావాలని
మనస్ఫూర్తిగా అభిలషించే
ప్రతి ఒక్కరికీ..!

- వేదుల శకుంతల

మంచి సాహిత్యానికి మారుపేరుగా నిలిచిన

మా

## జయంతి పబ్లికేషన్స్

ద్వారా

సీనియర్ రైటర్ **వేదుల శకుంతల** కలం నుంచి జాలువారిన

సాహితీ ఆణిముత్యాలు



# ఆర్తి

ఆర్ద్రత అంటే అర్థం తెలిసిన ప్రతి పాఠకుడూ,
స్పందించే హృదయమున్న ప్రతి ఒక్కరూ
తప్పక చదవాల్సిన నవల

వెల : రూ॥ 50/-

ప్రతులకు
**విశాలాంధ్ర బుక్‌హౌస్**
అన్ని బ్రాంచీలు

# స్పందన



ఆరోగ్యదాయకమైన మనుషుల కోసం,
మనసుల కోసం, రేపటి మంచిరోజుల కోసం
ఈ తరానికి 'ప్రిస్క్రయిబ్' చేయదగిన ఆలోచనా
ఔషధం ఈ పుస్తకం. జీవిత విలువలను
తెలియచెప్పి మనిషి సక్రమ మార్గంలో
నడవడానికి, తనకు ఎదురయ్యే
ఒడిదొడుకులను దాటుకుని సుఖసంతోషాలతో
జీవిత గమ్యం చేరడానికి పనికి వచ్చే మంచి
పుస్తకం. మానవ జీవిత సత్యాలను
ఆణిముత్యాల్లా పేర్చికూర్చిన విలువైన
గ్రంథం... ఈ 'స్పందన'

వెల : రూ॥ 100/-

# 'కృష్ణాతరంగం'

నలుగురు చేరిన చోట- కబుర్లూ, ముచ్చట్లూ చెప్పుకోవడం సహజం! పురుషులైనా, స్త్రీలైనా, పిల్లలైనా... ఒకరితో ఒకరు ఊసులాడుకోవడం అతి మామూలు విషయం! అలా చెప్పుకునే సంగతుల్లో ప్రాముఖ్యం ఉండవచ్చు, లేకపోవచ్చు. కానీ, సమాజంలోని పరిస్థితులు, మనుషుల స్వభావాలు, సంఘటనలే ఉంటాయి. కడలిలోని కెరటాల వలె ఉవ్వెత్తున లేచి పడుతూ ఒడ్డుకు ఢీకొని మళ్లీ వెనక్కి వెళ్లిపోతూ ఉంటాయి. ఈ సమాజం ఒక జీవనదిలా ప్రవహిస్తూవుండే కృష్ణాతరంగిణి! మనుషులంతా కలిసి ప్రయాణం చేస్తూ సహజీవనం సాగిస్తూనే అనేక సమస్యలు, చర్చలు, ఘర్షణలు, ప్రసంగాలతో ఒరుసుకుపోతూ ఉంటారు... అంతు ఉండదు! అయితే, ఆ విషయాల్లో కొన్ని అమూల్యమైనవి, మరికొన్ని చెత్తాచెదారం లాంటివి ఉంటాయి. అందులోనుంచి ' పనికివచ్చేవి ఏవి? పనికిరాని చెత్త ఏది? పరిష్కరించుకునేవి ఎన్ని? భద్రపరచుకునేవి ఏమిటి?'... అని మనం తెలుసుకోవటమే వివేకం! ఊరికే గాలిపోగులు, కబుర్లు కాకుండా నలుగురు ముచ్చటించుకునే ఊసులే అక్షర రూపంలో పెట్టి వ్యాస పరంపరగా అందించాలనే ఉద్దేశంతో- 'కృష్ణాపత్రిక'లో ఒక శీర్షిక ప్రారంభించటం జరిగింది... 1991 సం॥లో.

'కృష్ణాతరంగిణి' అనే ఆ శీర్షికలో కొన్ని వందల వ్యాసాలు ప్రచురించటం, అవి బహుళ జనాదరణ పొందటం విశేషం! ముఖ్యంగా... స్త్రీల సమస్యలు, ఇంటి బాధ్యతలు, ఉద్యోగినుల అవస్థలు, పిల్లల పెంపకం, ఇరుగుపొరుగు- బంధువుల తాకిడి, సాధకబాధకాలు, చట్టాలు, రోగాలు, జాగ్రత్తలు... ఇలా మనకి అడుగడుగునా ఎదురయ్యే అనేక సంగతులు, సంఘటనలు- ఈ 'కృష్ణాతరంగిణి'లో పొందుపరచడం జరిగింది. కొన్ని అనుభవాలు, మరికొన్ని సేకరించినవి, ఇంకా కొన్ని వినికిడి ద్వారా గ్రహించినవి కలబోసి కుదించి రాయటం జరిగింది.

నిన్న జరిగినవి, నేడు నడుస్తున్న చరిత్ర, రేపు రానున్నది... కిందా మీదా కలిపి- ఊదుకొని- పొల్లు ఎగరవేసి- గట్టిని జాగ్రత్త చేసుకునే అనేక సామాజిక విషయాలు ఈ వ్యాస తరంగిణిలో మీకు అందిస్తున్నానని భావిస్తున్నాను. విజ్ఞులు, వివేకవంతులు, సహృదయులు ఆదరించి ఆస్వాదించగలరని ఆశిస్తూ...

- మీ రచయిత్రి

**వేదుల శకుంతల**

# పబ్లిషర్స్ నోట్

కళాభిమానులు, సాహిత్యాభిమానులైన మీకందరికీ శుభస్వాగతం. ఈ 'కృష్ణాతరంగిణి'లో ఓలలాడబోయే ముందుగా స్వాగతగీతంలా ఓ చిన్నమాట.

ఎలక్ట్రానిక్ మీడియా విజృంభణతో 'సాహిత్యానికి కాలం చెల్లిపోయిం'దని అందరూ నిర్ధారించేసిన ఈరోజుల్లో 'ఉత్తమ సాహిత్యమెప్పుడూ అజ్ఞాతంగా ఉండిపోదనీ, మంచి రచనలకి పాఠకుల ఆదరణ ఎప్పుడూ ఉంటుం'దన్న ఆత్మవిశ్వాసంతో ప్రచురణ రంగంలోకి ప్రవేశించి దిగ్విజయంగా ముందుకు సాగుతున్న మా 'జయంతి పబ్లికేషన్స్' ద్వారా విడుదలవుతున్న మరో సాహితీ ముత్యమే... ఈ 'కృష్ణాతరంగిణి' విభిన్న వ్యాస మాలిక.

'ముంజేతి కంకణానికి అద్దమేల..? జగమెరిగిన బ్రాహ్మడికి జంధ్యమేల..?' అన్నట్లుగా ఈ 'కృష్ణాతరంగిణి' రచయిత్రి వేదుల శకుంతల గారి గురించి ప్రత్యేకంగా వివరించనక్కరలేదు. 1964లో రచనా వ్యాసంగానికి శ్రీకారం చుట్టి నాలుగు దశాబ్దాలుగా నిర్విరామంగా రచనలు చేస్తూ అటు ఆ తరం, ఇటు ఈ తరం పాఠకులకీ, సాహిత్యాభిలాషులకీ చిరపరిచితురాలైన రచయిత్రి... వేదుల శకుంతల! ప్రింట్ మీడియా మొదలు ఎలక్ట్రానిక్ మీడియా దాకా కథ, నవల, నాటకం, వ్యాసం మొదలైన విభిన్న ప్రక్రియల్లో తనదంటూ ఓ ప్రత్యేకమైన శైలినీ, గుర్తింపునూ, గౌరవాలనూ పొందిన రచయిత్రి... శ్రీమతి వేదుల శకుంతల గారు.

ఇక– ఈ 'కృష్ణాతరంగిణి' వ్యాస పరంపర... వేదుల శకుంతల గారి కలం ద్వారా ప్రముఖ దినపత్రిక 'కృష్ణా పత్రిక'లో 'కృష్ణాతరంగిణి' అన్న శీర్షికతోనే సంవత్సరకాలం పాటు ధారావాహికంగా ప్రచురితమై అటు పాఠకులచే, సాహితీప్రియులచే విశేషంగా ఆదరించబడి, ఇటు రచయిత(త్రు)లు, విమర్శకులచే ప్రశంసించబడిన వ్యాసాలలో మొదటి భాగంగా వెలువడుతున్న వ్యాసాల కూర్పు.

'రాశి' కన్నా 'వాసి' కే ఎక్కువ ప్రాముఖ్యాన్నిస్తూ సాహిత్యంలో ఆణిముత్యాలనదగ్గ రచనల్ని పాఠకులకి అందించాలన్న సదాశయంతో కొనసాగుతున్న మా 'జయంతి పబ్లికేషన్స్' సగర్వంగా సమర్పిస్తోన్న రచన... ఈ 'కృష్ణాతరంగిణి.' గత సంవత్సరం మా సంస్థ ద్వారా విడుదలయిన వేదుల శకుంతల గారి 'ఆర్తి' నవల, 'స్పందన' వ్యాస సంపుటి పట్ల పాఠకులు చూపిన ఆదరణ, ప్రోత్సాహాలే ఈ 'కృష్ణాతరంగిణి' ముద్రణకి స్ఫూర్తి. మా ఈ ప్రయత్నాన్ని కూడా పాఠకులు ఆదరిస్తారని మా ప్రగాఢ విశ్వాసం.

మీ అభిమానం, ఆదరణలతో మరిన్ని సాహితీ సుమాలు వసంతంలా మిమ్మల్ని అలరించడానికి మా సంస్థ నుండి వెలువడగలవని తెలియజేస్తూ...

ఈ పుస్తకంపై మీ అమూల్యమైన అభిప్రాయాలు తెలుపగలరని ఆశిస్తూ...

... ఎస్వీ కృష్ణజయంతి

**జయంతి పబ్లికేషన్స్**

# కృష్ణాతరంగిణి... క్రమం

# అటు నుంచి ఆలోచిస్తే...

మనవరాలి కొత్తకాపరం చూడాలని అమ్మమ్మ ముచ్చటపడి పట్నవాసం వెళ్లింది.

మనవరాలు తెగ సంబరపడిపోయి, "చూడు అమ్మమ్మా... ఈనాటి కాపురాలెలా వుంటాయో! ఈ అపార్టుమెంట్సులో ఉన్నవాళ్ళంతా ఎన్నెన్ని సౌకర్యాలు చేసుకున్నారనుకున్నావ్... చూడు- ఎలావుంది మా ఇల్లు?!" అనడిగింది.

అమ్మమ్మ అన్నీ చూసింది. గ్రైండర్- గీజర్- గ్యాస్ స్టౌవ్- కుక్కర్- ఫ్రిజ్- టి.వి.- ఎయిర్ కూలర్- ఫర్నిచర్- ఇక చిన్నచిన్నవి సరేసరి!

అన్నీ చూసేక, ఆవిడ నింపాదిగా అంది-

"మీకు ఓపికలు తక్కువే అమ్మాయ్- పైగా... ఉద్యోగాలు ఒకటి! మాకు తీరుబడి, ఓపిక బోలెడు! అందుకని స్వయంగా పనులు చేసుకునేవాళ్ళం. ఇక పొలాలు- తోటలు- నగలు, వెండి సామాన్లు కొంటే... అవి తరతరాలకీ ఉపయోగపడ్తాయి కదా! అలా ఆలోచించేవాళ్ళం... అవునా? కాదా?" అనడిగింది అమ్మమ్మ.

మనవరాలికి ఏదో అర్థమైనట్టే అనిపించింది. మౌనంగా తల ఆడించింది.

*   *   *

# ఆదిలోనే ఆపేయాలి!

మనలో చాలామందికి... అమ్మాయికి వివాహం చేసి అత్తవారింటికి పంపగానే- ఏం చేస్తోందో.., ఎలావుందో.., వాళ్ళు ఎలా చూస్తున్నారో... ఇత్యాది ప్రశ్నలు పరంపరంలుగా మొదలవుతాయి.

అమ్మాయి అత్తవారింటికి వెళ్లిందిగానీ అడవికి కాదుకదా! అత్తగారు, ఆడబిడ్డలు మనుషులే కానీ జంతువులు కారు కదా! ఇలా ఆత్రపడటంలో అర్థంలేదు.

దానికి తగ్గట్లే- అమ్మాయి నెల రోజులున్నాక పుట్టింటికి వస్తుంది. 'మా అత్తగారు ఇలాంటిది... ఆడపడుచులు అలాంటివారు... మామగారు చండశాసనుడు...' ఒక్క తన భర్తే ఆణిముత్యమైనప్పుడు- ముత్యపుచిప్పలోని వారంతా రాళ్లవుతారా?

అత్తవారిల్లు అనగానే- ఆజన్మ ఖైదులా భావించుకుని, ముందునుంచే అపోహలు పెంచుకుంటాం.

తల్లి పిల్లకి సఖ్యతని, సామరస్య భావాన్ని నేర్పాలి గానీ- నేరాలు చెప్పమనరాదు. ఆదిలోనే ఆపేయాలి.

* * *

# మోతాదు మించితే...

విద్యావతి అయిన కోడలు కొత్తగా కాపురానికి వచ్చి- వంటింటి దగ్గర్నుంచీ ఆఫీసు రూం వరకు అన్ని విషయాల్లో జాగ్రత్తలు, సూచనలు ఇస్తూ ఇంటిల్లిపాదిని కంగారు పెట్టేసింది.

ఉదయం లేవగానే బ్రష్ చేసుకునే విధానంతో మొదలవుతుంది. తర్వాత కూరలు తరగటం- వాటిలోని విటమిన్లు కోల్పోకుండా వండటం- కుక్కర్లో వంట చేసేటప్పుడు జాగ్రత్తలు- మధ్యాహ్నం నిద్రపోగానే ఆరోగ్యరీత్యా పాటించవలసిన నియమాలు- ఖచ్చితంగా చెప్పటం మొదలెట్టింది. ఇంతకీ... ఆమె హోంసైన్సు చదివి వచ్చింది.

అత్తగారు, మామగారు వారంరోజుల తర్వాత- యాత్రా స్పెషల్లో ఉత్తర భారతదేశ యాత్రలకి వెళ్లిపోయారు. ఆడపడుచు ఫ్రెండ్స్‌తో ఎక్స్‌కర్షన్‌కి వెళ్లింది. మరిదికి ఏంచేయాలో తోచక సందిగ్ధంలో పడి- 'అన్నయ్యా... నేను మాత్రం చదువుకున్న అమ్మాయిని పెళ్ళి చేసుకోను' అన్నాడు.

అర్థంగాక చూస్తున్న అన్నయ్యతో-

"అవును. ఇల్లు ఓ కాలేజీ లాగానో, ఆసుపత్రి లాగానో ఉంచేటట్టైతే చదువులు ఎందుకు?" అన్నాడు.

కోడలుకి తన 'అతి' తెల్సి తర్వాత నుంచి కాస్త మోతాదు తగ్గింది.

* * *

# నవ్వాలా.., ఏడ్వాలా..?

కొత్తగా ఎదురింట్లోకి వచ్చిన యువతికి- ఉద్యోగం చేసే వాళ్ళని చూస్తే ముచ్చటేస్తుంది. తనకీ ఒక ఉద్యోగం దొరికితే బాగుండునని ఆశపడ్తూ ఉండేది.

క్రమంగా ఆమెకి తెల్సింది- ఎదురింట్లో ఒక పెద్దావిడ పగలంతా ఊరికే వుండకుండా ఐదారుగురు చిన్నపిల్లల్ని ఆడిస్తూ ఉంటుందని!

'అబ్బో... పెద్దావిడైనా చక్కగా బేబీకేర్ సెంటర్ నడుపుతోందే! పోనీ, నేనూ ఆ పని చేస్తా' ననుకుని ఆమెను వివరాలు అడగటానికి వెళ్లింది.

ఆ పెద్ద ముత్తయిదువ నవ్వి- "కూర్చోమ్మా! ఈ పిల్లల్లో ఆ పెద్దవాళ్ళిద్దరూ పెద్దకోడలి పిల్లలు! అదుగో- ఆ ఇద్దరూ మా పెద్దమ్మాయి పిల్లలు! ఇక... ఉయ్యాల్లో వాడు మా చిన్నకోడలి కొడుకు! నా ఒళ్లోని వాడు- మా మూడోకోడలి పిల్ల! వీళ్ళమ్మలంతా ఉద్యోగాల్లో ఉన్నారు- అందుకని నేను..."

ఇక ఆ యువతి వినలేక లేచి వచ్చేసింది.

* * *

# అది నాడు! ఇది నేడు!

ఆడపిల్ల అనగానే జాగ్రత్తలు- నీతి సూత్రాలు- మర్యాదలు బోధ చేస్తూ... "చూడమ్మా, అలా కచ్చేరి సావిట్లోకి మగవాళ్ళు కూర్చున్నారు- వెళ్లకు. ఇంట్లో నుంచి గట్టిగా మాట్లాడకండి. మంచినీళ్లు, ఫలహారాలు అన్నీ నేను లోపలికి వచ్చి తీసుకెళతాను. తయారుచేసి ఉంచండి!" అని ఇంటిపెద్ద- ఆడపిల్లలకీ, భార్యకీ చెప్తూ ఉండేవారని ఇప్పటికీ పెద్దవాళ్ళు చెప్తూనే ఉంటారు. ఆనాడు ఆడవాళ్ళు ఇంట్లో గట్టిగా మాట్లాడటం, నవ్వటం... ఆంక్ష!

ఈనాడు- మహిళలు చదువుకుని ఉద్యోగాలు చేస్తూ ఇంటిని నడిపిస్తున్నా... ' "ఏమిటింత ఆలస్యం? ఆఫీసు వదిలి గంటపైన అయింది- అయినా ఆ బస్సుస్టాపులో నిల్చోకు... వందమంది మగాళ్ళుంటారు! బస్సులోనూ అంతే! రిక్షా మాట్లాడుకోమని చెప్పానుగదా! మా ఫ్రెండ్ వస్తానన్నాడు- టిఫిన్, కాఫీలు ఆ టేబుల్ మీద సర్దేసి- నువ్వు నీ పని చూసుకో... మేము తింటాంలే!" అని భర్తగారు భార్యకి పట్టిక చదివి వినిపిస్తాడు... ఈనాడు!

ఏ రాయి అయినా... పళ్లు ఊడగొట్టటానికే!!

* * *

# మాట ముందుకు - మనసు వెనక్కి!

"ఆగు! ఆవిడ వెళ్లిపోయాక వెళ్దాం!" అని వెనక్కి నిలుచున్న తల్లిని చూసి-

"అదేమిటమ్మా! సుగుణమ్మగారు వస్తే మనకేం?" అంది కూతురు బేబి.

"నీకు తెలియదులే... ఆగు!" అని ఐదు నిముషాలు సమయం గడిచాక- అప్పుడు జగదీశ్వరి కూతురితో బయటికి అడుగువేసింది.

సుగుణమ్మ చిన్న కంపెనీలో జాబు చేస్తోంది. భర్త ఆమెను వదిలి రెండేళ్లు గడిచింది. ఆర్నెల్లు ఎంతో వేదన చెందిన సుగుణమ్మ మనోధైర్యంతో కర్తవ్యం నిర్ణయించుకుని- ఇద్దరు పిల్లల కోసం జాబు సంపాదించింది. తనేమో.., తన ఉద్యోగమేమో... అంతే! లోకం ఆమెను అనేక రకాలుగా విమర్శించింది. భార్యాభర్తల మధ్య ఎన్నెన్నో కలహాలు సృష్టించి ఆమె మీద నేరం మోపింది. అయినా... సుగుణమ్మ వంచిన తల ఎత్తకుండా ఆమె పని ఆమె చేసుకుంటోంది.

చివరికి- ఆమె ఎదురుపడితే భరించలేక-
పక్కకి జరిగి నుంచునే స్థితిలో ఉన్నారు కొందరు.
ఆ కొందరిలో జగదంబ ఒకామె!
మళ్లీ వీళ్ళంతా ఆదర్శవాదులు!!

* * *

# పెళ్ళిళ్ల సీజన్ (సీక్రెట్)

ఈ ముహూర్తానికి ఎన్ని పెళ్ళిళ్లో తెలుసా? మా కాలనీలోనే నాలుగు పెళ్ళిళ్లు జరుగుతున్నాయి. అవతల వీధిలో మరొక రెండు, పై వీధిలో ఒకటి- సరే... సరే... పెళ్ళిళ్లకేం భాగ్యం! ముహూర్తాలకేం లోటు? చెప్పుకోవలసింది అదికాదు- ఈ వధూవరులంతా ఎంతెంత 'రేట్ల'కి కొలమానం పెట్టుకున్నారు? ఎన్ని బేరాలు- ఎన్ని బీరాలు జరిపారూ?... అని తెలుసుకోవాలి. ఒకవైపు ఆడపిల్లంటే హడలిపోతున్నామంటారు. మరి, పెళ్ళిళ్లేమో జోరుగా జరుగుతున్నాయి కదా! ఆ... అదే- అదే!! పెళ్ళిళ్లలో జరిగే సీక్రెట్స్ కావల్సినన్ని. కట్నం వద్దంటే- కారో, ఫ్లాటో కోరాడన్నమాట! కానుకలు వద్దంటే- ఉద్యోగం వేయించే పూచీ మామగారిదే! రెండూ వద్దన్నారంటే- ఫారిన్ పంపించి తీరాలన్నమాట!

ఒకవేళ ఇవేవీ కోరలేదంటే- భవిష్యత్తులో అమ్మాయి జీవితం మీద... దినం దినం- భయం భయం... అన్నట్టే!!

అయ్యో... ఇదీ పెళ్ళిళ్ల సీజన్ (సీక్రెట్) అంటే!

* * *

# సౌకర్యాల సోపానాలు!

తెల్లవారిందంటే... ఈనాడు ఎంత హడావిడో! ప్రతిరోజు ప్రతిఇంట్లో ఏదో పెళ్ళో, మరో శుభకార్యమో జరుగుతున్నంత కంగారు.., పరుగులు! నిజమే... అన్నీ టైం ప్రకారం గబగబా చేసుకుంటేగానీ ఆఫీసుకి అందుకోలేరు. భార్యాభర్తలు ఇద్దరూ ఉద్యోగులు కదా! ఇంట్లో పెద్దవాళ్ళు ఎవ్వరూ లేకపోతే- ఇక అన్నీ చేసుకోవాలంటే కష్టమే! అందుకే సదుపాయాలన్నీ సమకూర్చుకుంటున్నారు. అటు వెలుగురేఖలు వస్తుంటే ఇటు పనిమనిషి వచ్చేస్తుంది. అంట్లు తోమేసి- ఇళ్లు తుడిచేసి- బట్టలు మిషన్ (వాషింగ్ మిషన్)లో వేసి, ఉతికేసి- అమ్మగార్కి వంటలో కూడా సహాయం చేసి- గ్రైండర్‌లో మసాలాలు, చట్నీలు చేసేసి- పిల్లలకి స్నానాలు చేయించి, బట్టలు వేసి- అవసరమైతే ఇస్త్రీ చేసి మరీ వేస్తుంది. అమ్మగారూ, అయ్యగారూ తయారై సరిగ్గా టైంకి స్కూటర్ ఎక్కి పిల్లలతో సహా 'ఝూం' అంటూ వెళ్లిపోతారు... ఆఫీసులకి, స్కూళ్లకి!

'ఏమిటో... వెనకటి తరం వాళ్ళకి ఏమీ తెలియదు- పాపం! అన్నీ అవస్థపడి చేసుకునేవారు. సుఖపడటం తెలియదు...' అని ఓ వేదాంతపు చిరునవ్వు పారేసే వాళ్ళూ ఉన్నారు.

సరే! ఒకరోజు మామూలుగానే తెల్లవారింది. కానీ, ఆరోజు పనిమనిషి ఎందుకో రాలేదు. దానికితోడు- కరెంటు ఆఫ్! పైగా... స్కూటర్‌కి రిపేర్ వచ్చింది! ఇక... ఆరోజు అమ్మగారు చిందులు ఇన్నీ అన్నీ కావు. అలవాటు లేని పనులన్నీ చేసుకోలేక- కళ్ళ నీళ్ల పర్యంతం అయి- అమ్మకీ, అత్తకీ మనసులోనే మెచ్చుకోళ్లు చెప్తూ- 'ఎలా చేసుకునేవారో... అబ్బో!' అనుకుంటూ- అరగంట ఆలస్యంగా తయారై- ఇంటికి తాళం వేయబోతుండగా- 'గుప్'న వచ్చింది కరెంట్!

'సౌకర్యాలలో కూడా సాధక బాధకాలుంటాయి.'

* * *

# ఇదా ప్రగతి పథం..?

ఈమధ్య వర్ణాంతర వివాహాలని గురించి చెప్పుకుంటున్నాం! ప్రేమించి పెళ్ళి చేసుకోవటం అంది- వధూవరులిరువురికీ మంచిదే! ఇద్దరి మధ్య ప్రేమ ఎడతెగకుండా ఉన్నప్పుడు- ఆ సంసారం సారవంతమై.., ధన్యమవుతుంది.

కానీ, ప్రేమించుకోవటం అన్నదే- కాస్త ఎబ్బెట్టుగా ఉంటోంది. కట్నాల సమస్య కోసం ప్రేమవివాహాలు అనటం బాగాలేదు. ఇదేదో వ్యాపార సంబంధమైన చిట్కాలాగా ఉపయోగించటం- పైగా... కులాంతర, మతాంతర వివాహాలైతే- ఏదో 'శ్లేష' ధ్వనిస్తోంది! కట్నాలనేవి కులాన్ని బట్టా?! ప్రేమించటం అనేది కట్నం తప్పాలనా?!... ఈ బోధ బాగాలేదు. ఇక్కడ కట్నం సమస్య తీర్చలేక, లేదా పరిష్కరించుకోలేక- మరొక దారి తొక్కినట్టు కనబడుతుంది.

అలాగే... కులోద్ధరణ అనేది- మనస్ఫూర్తిగా కాక- లాభాన్ని ఆశించి, కులాన్ని కల్పుకున్నట్టు అర్థమవుతోంది! అసలు- కట్నాలు అన్నవి సమసిపోవాలి! అలాగే 'ప్రేమ' అన్న కారణంగాకుండా... పెద్దలంతా ఆమోదించిన కులాంతర వివాహాలు- అభ్యుదయ మనిపించుకుంటాయి.

ఆ రెండూ జరిగితే- ఆదర్శవాదుల కృషి ఫలించిందనుకోవాలి. కానీ, విద్యావంతులు అంతా ప్రేమ వివాహాలని ప్రోత్సహించాలనటం హాస్యాస్పదం! ప్రేమించటానికి విద్య అక్కర్లేదు. ప్రేమించటం యాదృచ్ఛికంగా మనస్సులో నాటుకునే 'బీజం'! అంతేకానీ- ఆకర్షణ, వ్యామోహాల లాభాలాభాలు చూసుకుని ప్రేమిస్తాననటం చాలా పొరపాటు! ఈనాటి మన సమాజంలో- ఒక సమస్యని సవ్యంగా పరిష్కరించుకోలేక- అనేక సమస్యలూ, నిరర్థక ప్రబోధలు చేస్తున్నారనిపిస్తుంది!... ఇది ప్రగతా?

* * *

# స్వాతంత్ర్యం అంటే...

దేశానికి స్వాతంత్ర్యం వచ్చి ఐదున్నర దశాబ్దాలు దాటిందని అందరికీ తెలుసు. కానీ, మనుషుల మాటేమిటీ? ముఖ్యంగా స్త్రీల సంగతి ఆలోచించండి! మైనారిటీ తీరేవరకు పెద్దల అండదండల్లో బ్రతికిన పిల్లలు... మేజర్లు కాగానే ఓటు హక్కు వస్తోంది తప్ప- వ్యక్తిగత స్వాతంత్ర్యం ఎంతవరకు ఉంటోంది?

కాలేజీలో చదవాలంటే... అన్నదమ్ములతోపాటు సమాన అర్హత ఉండటం లేదు. ఇక్కడ ఒక సంగతి గమనించాలి- ధనిక వర్గం ఎప్పుడూ ఆర్థిక ఇబ్బందులకు గురికాదు కనుక- మిగిలిన వర్గాలు- అంటే... మధ్యతరగతి, అంతకంటే కొంచెం క్రింద మెట్టువారు... అనుకుంటే- వారి స్థాయిని బట్టి మగపిల్లాణ్ణి పెద్ద చదువులు చదివించాలన్నంత తొందర, ఆడపిల్లల పట్ల ఉండదు. కారణం తెలుసు కదా!... చదువులకీ, ఆ తర్వాత కట్నాలకీ పెట్టలేక! ఆ అమ్మాయికి చదువుకోవాలని ఉన్నా... తెలివైనదైనా... ఆర్థిక ఇబ్బంది చేత మానేయాల్సి వస్తోంది. ఈరకంగా మేజర్ అయినా తన వ్యక్తిగతమైన కోరికకి విలువ లేక- (ఇవ్వకా) అస్వతంత్రురాలవుతోంది.

తర్వాత వివాహానంతరం- ఉమ్మడి కుటుంబమైతే... పెద్దల అనుమతితోనే ఏ పనైనా చేయాలి. ఒకవేళ- 'నాకిది ఇష్టం, ఇలా చేస్తాను...' అని చెప్పిందా??... అర్థం చేసుకునే సహృదయులైతే బాధలేదు. లేదూ- ఓ తీక్షణమైన చూపో.., తిట్లో.., పుట్టింటి వార్ని విమర్శించటమో... తప్పవు. అదే- 'అల్లుడు' అత్తవారింటికి వచ్చాడనుకోండి! అతని నోట్లో మాట బయటకి రాకమునుపే- కావల్సినవన్నీ అమర్చటం.., అతనికి ఇష్టం లేదని తెలిస్తే- ఇంట్లో అంతా మానేయటం... జరుగుతుంది. కొంతమంది- కాదు కాదు... చాలామంది ఇళ్లల్లో అల్లుడంటే దేవుడు!!

మరి.., కోడలంటే? కనీసం కూతుర్లాగానైనా చూస్తే బాగుంటుంది. కానీ, ఆమె అసలు అత్తమామల ఎదుట కూర్చున్నా, మాట్లాడినా తప్పే!

ఒకవేళ ఉద్యోగపు ఊర్లో ఉంటే.., అనుకూలుడైన భర్త అయితే చెప్పేదేమీ లేదు కానీ.., అతను కొంచెం అహంభావి అయితే ఇక అతను చెప్పిందే చేయాలిగానీ,

ఆమెకంటూ ప్రత్యేక అభిరుచులు, ఇష్టాలు వ్యక్తం చేయకూడదు. చేసినా లాభం ఉండదు. పైగా... కీచులాటలు, మనస్పర్థలు!!

ఉద్యోగినులైన స్త్రీలలో కూడా- అంటే... ఆర్థిక స్వాతంత్ర్యం అనికాదు- 'సంపాదనాపరురాలు' అని మాత్రమే అనాలి! ఎందుకంటే- సంపాదించే డబ్బు మీద ఆమెకు సంపూర్ణ స్వాతంత్ర్యం ఉండటం లేదు. చాలా కుటుంబాల్లో... భార్య సంపాదన మీద కూడా భర్తదే అధికారం కనిపిస్తోంది. ఇంకాపోతే... ఆమెకి పుట్టింటి ఆస్థి కానీ, నగలు కానీ, బ్యాంక్ బ్యాలెన్స్‌గానీ ఉన్నా... సంతకాలు పెట్టటం వరకే ఆమె స్వతంత్రురాలు. ఆ తర్వాత అంతా భర్తదే ఆజమాయిషీ!

అంచేత- ఆర్థిక లోపం లేకపోయినా- కొన్ని కుటుంబాల్లో మహిళకి స్వాతంత్ర్యం కరువుగానే ఉంది. ఏ చిన్న అవసరమైనా ఆమెకై ఆమె నిర్ణయించుకుని, చేసే అవకాశం రావటం లేదు. భర్త అనుజ్ఞ ప్రకారమే చేయాలి.

ఏదైనా పని మీద ఆమె బయటకి వెళ్తే- ఇంటికి రావటంలో ఆలస్యమైతే- ఇక ఇంట్లో యుద్ధం చేసేయటం... కొంతమంది అలవాటు. అలాంటి పరిస్థితుల్లో 'స్త్రీ అసలు బయటకి వెళ్ళకపోతేనే నయం...' అనుకునేవారు కూడా ఉన్నారు. ఇంకా కొంతమంది- తాము కొనుక్కునే చీరలు, చేయించుకునే నగలు, చూసే సినిమాల దగ్గర్నుంచీ... అన్నీ భర్తగారికి నచ్చకపోతే మానేయవలసిందే!

చేతికి డబ్బు అందిస్తాడు భర్త! కానీ... ఏది, ఎలాంటివి కొనాలో తానే చెప్తాడు. అంటే... ఆమెకు ప్రత్యేకమైన అభిప్రాయాలు ఏమీ ఉండకూడదు! ఇలాంటి కుటుంబాలు.., మనుషులు లేరంటారా... చెప్పండి?!

మరి.., కొంతమంది- ఆర్థికంగా ఇబ్బందిగా ఉన్నా... భార్య తనకు కావల్సినవన్నీ ధైర్యంగా చేస్తుంది. అవసరమనుకుంటే అప్పు కూడా చేస్తుంది. భర్తకి భయపడాల్సివుండదు. అతను ఆమెను అర్థంచేసుకుని సర్దుకుపోతాడు.., ఆమె అభిరుచులకీ, ప్రతిపాదనలకీ విలువ ఇస్తాడు.

అదీ వ్యక్తిగత స్వాతంత్ర్యమంటే..! ఆర్థిక స్వాతంత్ర్యం కూడా వ్యక్తిగత స్వాతంత్ర్యంలోని భాగమే!! కనుక- స్త్రీలు ముందు- తమ వ్యక్తిత్వం నిలుపుకోవాలి. అప్పుడు అన్నీ సాధించినట్టే!... అవునా?!



# గోరంత మానవత్వం

'అంతర్జాతీయ అక్షరాస్యతా సంవత్సరం' అనీ, 'అంతర్జాతీయ స్త్రీ, శిశు సంవత్సరం' అనీ ప్రకటిస్తూ ఉంటారు... మీకు తెలిసే ఉంటుంది! ఇదివరలో చెప్పుకున్నట్టు... జనాభాలో సగం స్త్రీలు ఉన్నారు. అందులో అధిక శాతం- గ్రామాల్లో ఉండి... నిరక్షరాస్యతా, అజ్ఞానం, మూఢనమ్మకాల వంటి చీకటితెరల్లో దాగివున్నారు. ఎన్ని బోధలు చేసినా, ప్రచారాలు సాగించినా... జనాభా పెరుగుదల ఆశించినంత మేరకు తగ్గటం లేదు. అంటే... జనం పెరిగినకొద్దీ- నిరక్షరాస్యత కూడా పెరుగుతోంది. అందువల్ల పల్లెల్లో ప్రజలు... ముఖ్యంగా స్త్రీలు- దేశాభివృద్ధి కార్యక్రమాల్ని త్వరగా అర్థంచేసుకోలేక ఎన్నో ఏళ్లుగా, తరతరాలుగా నమ్మిన నమ్మకాల్ని వదులుకోలేక.., ప్రభుత్వం చేపట్టిన అభివృద్ధి కార్యక్రమాలను జీర్ణించుకోలేకపోతున్నారు.

స్త్రీలు.., అభివృద్ధి పథకాలు- అనగానే చాలామంది పట్నవాసాల్నీ, నగరాల్నీ దృష్టిలో ఉంచుకుని- 'ఇంకా వెనకబడి ఉండటమేమిటీ... పురుషులతో సమానంగా చదువుకుంటున్నారు.., ఉద్యోగాలు చేస్తున్నారు.., ఉన్నత చదువులు నిర్వహిస్తున్నారు.., కళారంగాల్లో, దేశవిదేశాల్లో కూడా పేరుప్రఖ్యాతులు తెచ్చుకుంటున్నారు...' అని, 'ఇంకా ఏం తక్కువైంది?' అన్న ధోరణిలో విమర్శిస్తూ ఉంటారు.

కానీ- ఈ సంఖ్య ఎంత? అని ఒక్కసారి ఆలోచిస్తే.., ఒకసారి గ్రామాలవైపు దృష్టి సారిస్తే... 'నిజమే! స్త్రీ అభ్యుదయ కార్యక్రమాలు ఇంకాఇంకా ప్రచారం చేయాల్సిన అవసరం ఉందని అర్థం అవుతుంది.

ప్రత్యేకించి ఆంధ్రప్రదేశ్‌లోనే నిరక్షరాస్యులు, అందునా- స్త్రీల సంఖ్య ఎక్కువగా ఉంది. మహబూబ్‌నగర్, నల్గొండ, ఆదిలాబాద్, శ్రీకాకుళం... లాంటి జిల్లాల్లో స్త్రీల అక్షరాస్యత పురుషుల కంటే చాలా తక్కువ.

అన్ని అనర్థాలకీ మూలం- నిరక్షరాస్యతే! నిత్యజీవితంలో తెలుసుకోదగ్గ ఆరోగ్యసూత్రాలు, శిశు సంక్షేమం, ఆర్థిక లాభం... ఇవన్నీ ప్రతి గ్రామ మహిళ క్షుణ్ణంగా తెలుసుకోవాలి. ప్రభుత్వం వారు ఎన్నో కార్యక్రమాలు చేపట్టి ప్రచారం చేస్తున్నా.., టీవీల్లో, రేడియోల్లో బోధిస్తున్నా... ఆ అమాయకులు అంత త్వరగా అవగాహన చేసుకోలేరు.

ఈనాడు మనం పట్నాల్లో ఉండి అనేక సదుపాయాలు, సౌఖ్యాలు అనుభవించటం కాదు.., మనకి గ్రామాలు వెళ్లే అవకాశం కలిగినప్పుడల్లా మనకి తెలిసిన విషయాలు ఆ స్త్రీలకి చెప్పగలిగితే... 'దేశాభివృద్ధి' అనే బృహత్తర పథకంలో ఉడతాభక్తి చూపించిన వాళ్ళమవుతాం! స్వచ్ఛంధ సంస్థలు, మహిళా సంఘాలు మాత్రమే చేయాలనుకోనవసరం లేదు. దానికోసం ఫోటోలు, పత్రికలు, పూల దండలు ఉండక్కర్లేదు.

అలాగే... మన చుట్టూ ఉన్న ఆర్తులు, అజ్ఞానులకీ, ఓ అక్షరం వీలున్నప్పుడల్లా చెప్పగల్గితే... నీటి బిందువులన్నీ కలిసి అనంత సముద్రమవదా?

మన పిల్లల్ని కాన్వెంట్ స్కూళ్ళల్లో చదివించుకునేందుకు.., పెద్ద చదువులు, పదవుల కోసం తాపత్రయ పడిపోతాంగానీ.., చింకిగుడ్డలతో, శుభ్రమెరుగని మురికి శరీరంతో... అనారోగ్యాలతో... చాలీచాలని తిండి తిని.., పల్లెల్లో, మురికివాడల్లో, ఈసురోమంటూ ఉండే చిన్నారుల్ని మనం ఎందుకు చూడలేకపోతున్నాం..?!

వీళ్ళంతా ఎవరో కాదు.., మన దేశంలో మనతోపాటు పెరిగి పెద్దయి, సాటి పౌరులుగా రూపమెత్తే జనాభా! అసంతృప్తి, కసి, కోపంతో కొందరు నేరస్థులుగా మారితే.., నిర్జీవంగా, నిరుత్సాహంతో అధ్వాన్నపు చావులు చచ్చేవారు కొందరు... అనాథలెందరో?!

14 సంవత్సరాలలోపు ఉన్న బాలబాలికలు కూలిపనులు చేసి సంపాదిస్తున్నారు. భవిష్యత్తులో వెలుగు చూడలేని ఆ పాపలకీ, పెద్దలకీ... చట్టాల్ని గురించి కొంతైనా చెప్పగలిగితే బాగుంటుంది. శుష్కమైన ఉపన్యాసాలు కాదు.., ఆచరణయోగ్యమైన కార్యక్రమాలు చెప్పాలి.

దురదృష్టం ఏమిటంటే- చాలామందికి ప్రభుత్వ పథకాలు తెలియవు. గ్రాంటు చేసిన ధనం స్వార్థపరుల చేతుల్లో దుర్వినియోగం అవుతోంది. అట్టహాసంగా ప్రణాళికలు ప్రారంభించడం.., ఆర్నెల్లు తిరగకుండా ఆ కార్యాలయాన్ని మూసివేసి చేతులెత్తేయడం... చాలాచోట్ల జరుగుతోంది. మంజూరు అయిన డబ్బు?? అంతే సంగతులు!!

గోరంత మానవత్వం పెంచుకుని- ఒకరిద్దరికైనా మనం... విద్య, ఆరోగ్యం, న్యాయ సలహాలు లాంటివి చెప్పగల్గితే... కొండంత వెలుగు వాళ్ళ జీవితాల్లో ప్రసరిస్తుంది. రచనల ద్వారా చేతనైనంత శ్రమదానం చేయలేమా?... ప్రయత్నించండి!!



# ప్రమాద సూచనే... ప్రమోదం కాదు!

మార్చి 8వ తేదీకి ఓ ప్రత్యేకత ఉంది!

ఇది అంతర్జాతీయ మహిళా దినం! ఒక దశాబ్దం పాటు అంతర్జాతీయ మహిళా దశాబ్దంగా- స్త్రీల కోసం అనేక పథకాలు, ప్రణాళికలు రూపొందించి అనేక సమస్యల పరిష్కార మార్గాలు రూపొందించటం, ఎన్నో అభివృద్ధి కార్యక్రమాల ద్వారా కొంత ప్రగతి సాధించటం జరిగింది.

ప్రస్తుతం ఏ దేశాన్నైనా కలవరపరిచే విషయం... జనాభా పెరుగుదల! ఎన్నేసి ప్రచారాలు చేస్తున్నా- కుటుంబ సంక్షేమంలో మాత్రం ఇంకా అవసరం ఉంది. అయితే... ఆరోగ్యసూత్రాలు, ప్రసూతి విషయంలో సదుపాయాలు పెరగటం మాత్రం జరిగింది. అందువల్లనే కాబోలు- ప్రపంచ జనాభాలో ఒక శతాబ్ది అనంతరం జనాభా పెరుగుదల అరికట్టగల్గినా స్త్రీల సంఖ్య పురుషులకన్నా నూటడెబ్బై ఐదు మిలియన్లు ఎక్కువ ఉంటారని 'యునైటెడ్ నేషన్స్ ఫండ్ ఫర్ పాప్యులేషన్ యాక్టివిటీస్' ఒక నివేదికలో తెలియపరిచింది.

అంటే... ప్రపంచవ్యాప్తంగా మహిళలు వైద్య సదుపాయాలు బాగా అందుకోగలిగారన్నమాట!

మన దేశంలో స్త్రీలు మిగతా దేశాలతో పోల్చి చూసినప్పుడు- విద్యా, అజ్ఞానం, మూఢాచారాలు ఇంకా పేరుకొని, సరియైన వెలుగు చూడలేకపోతున్నారనిపిస్తోంది. ఇక సాంప్రదాయక విషయాలలో అయితే కొన్ని దేశాలలో మహిళలు స్వేచ్ఛగా బయటకి కూడా రాగలగటం లేదని తేలింది.

ప్రపంచ జనాభాలో- స్త్రీలలో 60 శాతం నిరక్షరాస్యులని మేధావుల సర్వేలో తెలియవచ్చింది. ఈ సంఖ్య పురుషుల కన్నా- అంటే... నిరక్షరాస్యులైన పురుషులకన్నా అమితవేగంతో పెరుగుతోందని కూడా వెల్లడైంది.

వీటన్నిటిని బట్టి స్త్రీలు- పురుషుల సంఖ్యలో సగం ఉన్నా నిరక్షరాస్యులుగా పదిశాతం ఎక్కువ ఉన్నారు. పైగా... భవిష్యత్తులో స్త్రీల జనాభా పెరిగి నిరక్షరాస్యులు కూడా పెరిగే అవకాశం ఉండొచ్చును. ఇది ప్రమాద సూచనే తప్ప- ప్రమోదభరితం కాదు.

కాబట్టి, ఈనాడు స్త్రీలు- ముఖ్యంగా గ్రామీణ స్త్రీలు అక్షరాస్యులుగా రూపొందటానికి చాలా తీవ్ర కృషి చేయాలి. ప్రతి అభివృద్ధి పథకం అక్షరాస్యత మీదే ఆధారపడి ఉంది. అనియత విద్యా, వయోజన విద్యా గ్రామీణప్రజల్లో బాగా ప్రచారం చేసి సత్ఫలితాలు సాధించటానికి ప్రతి మహిళా దీక్షాకంకణం కట్టుకోవాలి.

అనాదిగా వస్తున్న స్త్రీ బానిసత్వపు ధోరణి- రాబోయే తరాలకైనా రూపుమాసి, సమాన ప్రతిపత్తి- సమానత్వం సమాజంలో వర్ధిల్లాలి.

ఇక్కడ మరొక విషయం బాగా గుర్తుంచుకోవాలి. చాలామందికి ఈ 'సమానత్వం' అనేసరికి- అదేదో విప్లవంలాగా, పురుషజాతి మీద దండెత్తడం అనుకుంటున్నారు. ఈ ఉద్దేశం పురుషులకి కూడా ఉంది. అందుకే- కొంతమంది పురుషులు స్త్రీలని 'ఇంకా సమానత్వమేమిటీ?' అనే హేళన, చులకన భావన కలిగి బాధిస్తున్నారు. ఇది పొరపాటు! స్త్రీ,పురుషులిరువురు సమాజంలో సమానస్థాయిలో ఉన్నప్పుడే సమాజం సుభిక్షంగా ఉంటుంది. మొదట గృహవాతావరణం నుంచి ప్రారంభం కావాలి. భార్యాభర్తలిరువురు అన్నిటా సఖ్యత, సమాలోచన చేయగల్గి- కలహాలు, కీచులాటలు లేకుండా ఉంటే పిల్లల్ని మంచి మార్గంలో నడపగలుగుతారు. తద్వారా సంఘంలో, దేశంలో మంచి నీతి, విజ్ఞానం ధారాళంగా ఉంటాయి.

కుటుంబ విషయంలో- ప్రపంచంలోని మిగతా దేశ స్త్రీలు కూడా భార్యాభర్తల మధ్య అవగాహన, సహకారం, విశ్వాసం ఉంటేనే సాంఘిక ప్రగతి సాధ్యమని నమ్ముతున్నారు.

మరొక ముఖ్యవిషయం ఏమంటే- ప్రపంచంలోని పురుషులకన్నా స్త్రీలకే ఆయుఃప్రమాణం ఎక్కువగా ఉందని సర్వేలలో తేలింది. అంటే- ఈ ఇరువయ్యోకటవ శతాబ్ది నాటికి స్త్రీల ఆయుఃప్రమాణం 63 సం॥ ఉంటుందనీ, అది పురుషులతో పోల్చి చూస్తే ఎక్కువనీ కూడా నిర్ధారించారు.

ఏతావాతా- స్త్రీలు... పురుషుల కన్నా ఎక్కువ కాలం జీవించి, ఎక్కువ సంఖ్యలో నిరక్షరాస్యులుగా ఉంటే- దేశం ఏ రీతి బాగుపడుతుంది? కనుక అక్షరాస్యులై... ఆరోగ్యంతో, కుటుంబంలో సంతోషతరంగాలు వెదజల్లి సమాజాన్ని, దేశాన్ని సురక్షితం చేయాలి. అందుకే స్త్రీలు ముందుకు రావాలి.



# మనసు ఎదగాలి కానీ...

విద్య వలన విషయం, విజ్ఞానం, విచక్షణ వస్తాయనుకుంటాం కానీ... ఇది అంత నిజం కాదనిపిస్తుంది.

ప్రపంచ జ్ఞానం, వ్యవహార దక్షత కూడా చదువుకుంటే వచ్చి తీరాలని ఏమీలేదు.

వంశపారంపర్యంగా కొంత, సహవాస గుణం వల్ల కొంత నేర్చుకోగల్గితే ఆ తరువాత చదువుల వల్ల విషయ పరిజ్ఞానం పెంచుకుని మిగతా లక్షణాలు అలవరచుకోవచ్చును.

కొంతమంది పెద్దగా చదువుకోకపోయినా- ఎంతో తెలివిగా, వినయంగా కనిపిస్తారు. అదే మరొకళ్ళు- డిగ్రీలూ, పోస్టుగ్రాడ్యుయేట్లు అయినా కూడా- అమాయకంగానూ, తెలివితక్కువగానూ కనిపిస్తారు.

అయితే... ఇక్కడ చెప్పుకోవలసిన ముఖ్యవిషయం ఏమంటే- విద్యావతులైన మహిళలు... తెలివితేటల మాట ఎలావున్నా- ఏదో ఒక ఉద్యోగం మాత్రం చేస్తున్నారు. కానీ, చదువుల వల్ల సభ్యత, సంస్కారం అబ్బినట్టు లేదు.

ఇళ్లల్లో, వేడుకల్లో, వాళ్ళ ప్రవర్తన ఎంత ఎబ్బెట్టుగా, విడ్డూరంగా ఉంటుందో గమనిస్తే అర్థం అవుతుంది.

ఏ చదువూ సంధ్యలేని వాళ్ళు ఎంతో నమ్రతగా, హృదయ వైశాల్యంతో ఉండటమూ గమనిస్తూనే ఉంటాం.

విధివశాత్తు- ఎవరైనా భర్తృహీనులుగానీ, భర్తచే పరిత్యజింపబడిన వారుగానీ ఇంట్లో ఉంటే- ఎంతో చులకనగా, అదృష్టహీనులుగా తలుస్తూ- తృణీకార భావంతో మెలగుతూ ఉండటం కొన్ని కుటుంబాల్లో జరుగుతోంది. పోనీ... 'వారు విద్యావతులైనా ఛాందస భావాలున్నవారేమో... అందుకే వారి మనస్తత్వం అలా ఉంది' అనుకుందామంటే- మిగతా వేరే విషయాల్లో ఆ సనాతన భావం ఉండదు. మడీ, తడీ, అంట్లూ, ఎంగిళ్లూ- పూజా పునస్కారాల విషయంలో అన్నీ చీదరించుకుని ఏదీ పాటించని ఆధునాతన ధోరణిలో ఉంటారు.

ఏమిటీ ద్వంద్వం..? బాగా నిశితంగా ఆలోచిస్తే- ఒక విషయం స్పష్టమవుతుంది. అంతరాంతరాలలో సంస్కారం లేక, పాత అలవాట్లు పాదుకొని, వాటి ప్రభావం వల్ల

ఎదుటివారిని కించపరచేటట్లు ప్రవర్తిస్తుంటారు. ఇక పైపై అలంకరణ వ్యామోహాలన్నీ కాలేజీ చదువులు, ఆఫీసులో సహ ఉద్యోగుల వల్ల నేర్చుకుని అనుసరిస్తూ ఉంటారు. ఇలా అటొక కాలూ, ఇటొక కాలూ వేసి ప్రయాణించే ఈ జీవితాల వల్ల భవిష్యత్తులో వారు బాధపడటమే గాక, నిత్యం తమ చుట్టూ ఉన్నవారిని కూడా గాయపరుస్తూ ఉంటారు.

ఏ కారణం చేతనైనా భార్యాభర్తలు విడిపోతే- ఆ భర్త బాగానే ఉంటాడు. కానీ, భార్యని మాత్రం ఇంట్లో మిగిలిన సభ్యులు- అంటే... వదినలు, అక్కచెల్లెళ్ళు చిన్నచూపుతో తేలిగ్గా చూడటం జరుగుతోంది. భోజనాల వేళ... సరదాగా నలుగురూ కబుర్లు చెప్పుకునే సమయంలో... ఏదో ఒక విషయం మీద గబుక్కున ఆ పిల్లని- 'భర్త వొదిలేసిన'దానిగా అనేయటం! ఆ అమ్మాయికి మనసు ఎంత బాధపడుతుందో గ్రహించరు. అలాగే- పెళ్ళిళ్లు కాకుండా ఉండిపోతున్న పిల్లల పట్ల కూడా ఇలాగే అనేస్తారు. ఉద్యోగాలు చేసే వదినలు, అక్కచెల్లెళ్ళు కూడా తొందరపాటుగా వ్యవహరించటం మామూలుగా జరుగుతూనే ఉంటుంది.

సమాజంలో ఎన్నో మార్పులు వచ్చాయి. ఎన్నో రకాల చట్టాలూ వచ్చాయి. కొన్నిచోట్ల అవి సఫలమవుతున్నాయి. అయినా... మనుషుల్లో, వారి మనసుల్లో మంచితనం, సంస్కారం అలవడటం లేదు. ఇక- సాటివారు, ఇంట్లోవారే చులకన చేసి గౌరవించని పక్షంలో... ప్రగతి ఏమిటీ? ప్రణాళికలు ఏమిటీ..?

చెప్పటానికి చిన్న విషయంలా కన్పించినా... ప్రవర్తించినప్పుడు ఆ అసభ్యధోరణి, కుసంస్కారం ఎదుటి మనసు మీద ఎంత దెబ్బతీస్తాయో..! దాని ఫలితంగా వాళ్ళు (బాధపడేవారు) ఏమైనా అఘాయిత్యం చేస్తారేమో... అనే ఆలోచన రాదా??

అందుకే... మహిళలు- చదువులు, ఉద్యోగాల కన్నా ముఖ్యంగా అలవరచుకోవలసింది... మానవత, సంస్కారం, హృదయ నైర్మల్యం!!

మ్యాచింగ్ డ్రస్సులు, అల్ట్రా మోడర్న్ మేకప్పులు, పార్టీలు ముఖ్యం కాదు. ఇవి బాహ్యాడంబరాలు మాత్రమే!

మానసికంగా ఎదిగి, తోటివారిని అర్థంచేసుకుని ఓదార్పు సహకరింపు చేయగల్గితే... అదీ అసలైన అందం! మనోరంజితం!!! తద్వారా జనరంజకం!!!



# సగటు మహిళ!

సగటు మహిళ అంటే... ఎలా ఉంటుంది? అని ఒక్కసారి పరిశీలించుకుంటే..?!

ఈనాడు సమాజంలో ఇన్నేసి అత్యాచారాలు, చికాకులు, సమస్యలు ఎందుకు వస్తున్నాయో, అసలు ఇవి నిజంగా సమస్యలేనా? అని నిశితంగా విమర్శించి చూసుకుందాం.

ఉదయం లేవగానే మహిళ చికాకు పడేది- పంపు రాలేదనో, పనిమనిషి కోసమో మొదలవుతుంది. ఇది మధ్యతరగతి గృహిణి సమస్యల కేటలాగులో మొదటి చాప్టర్!

ఇక ఆర్థికంగా బాగున్న గృహిణి- ఉదయం లేచే అలవాటు ఆవిడకి ఉండదు. కనుక ఆవిడ లేచాక ప్రారంభించే మొదటి కార్యక్రమం... కాఫీతో! కాఫీ డికాక్షన్ బాగాలేదనీ, వంటావిడ- లేదా నాయర్ రాలేదనీ తెలియగానే 'అయ్యో... ఇవాళ నాకెన్ని పనులో! వంటమనిషి రాకపోతే ఇక ఎలాగా?' అని దిగులు పడిపోతుంది.

ఈ సమస్య సంపన్నురాలి మొదటి చాప్టర్!

ఇక వీరిద్దరి కన్నా తక్కువ మెట్టు మీదుండే పేద గృహిణికి కాఫీకి గానీ, పాలకి గానీ, పనివాళ్ళు- వంటవాళ్ళతో గానీ, కనీసం పంపుతోగానీ ఆమెకి సంబంధం లేదు. చీకట్లోనే బోరింగ్ దగ్గర నీళ్ళు తెచ్చుకుని, గిన్నెలు కడుక్కుని వంట మొదలెట్టుంది. అప్పుడు ప్రారంభమవుతుంది ఆమె సమస్యల జాబితాలోని మొదటి అధ్యాయం!

డబ్బాలో బియ్యం చాలవు! కూరలు ఉండవు!! సరుకులు సరిపోవు!!!

దిగాలు పడుతుంది. 'ఈ పూట గడవట మెలాగ?' అని తల్లడిల్లుతుంది. చంటిదానికి జ్వరం! ముసలి అత్తకి దగ్గు! అన్నిటికీ డబ్బు కావాలి! ఎక్కడ్నుంచి వస్తుందీ? ఇదీ సమస్య! నిజమైన సమస్య!!

మనిషి బ్రతికి ఉండటానికి కావాల్సిన తిండికీ, రోగం వస్తే మందు తీసుకుందుకూ డబ్బుల్లేని దీనావస్థని అనుభవిస్తూ- రోజంతా శ్రమపడితే గానీ డొక్క నిండని మనుషులు మన చుట్టూ ఉన్నారు. వాళ్ళవి... అసలైన సమస్యలు!

కొందరున్నారు- తన చీర మీదకి మ్యాచింగ్ బ్లౌజు పీసు దొరకలేదని చింతపడేవాళ్ళు గంటలు, గంటలు దుకాణాల్లో నచ్చిన రంగు కోసం బట్టలు వెతికే వాళ్ళూ.., ఎక్కడో చవకగా వస్తువులు అమ్ముతున్నారని రోజంతా బస్సుల మీద వెళ్లి ఆ వస్తువుల కోసం ఆరాటపడేవాళ్ళూ.., ఇక- నచ్చిన సినిమా చూడాలని.., రైలుకో, పెళ్ళికో వెళుతూ ఆత్రంగా పనులు ముగించి, జ్వరం వచ్చినంత అలసటతో బాధపడటం... ఇవన్నీ ఈనాటి సమాజంలో మహిళకి పరిపాటి అయిన కార్యక్రమాలు!

ఇవి సమస్యలా..?

పిల్లలకి కాన్వెంటులో సీటుకోసం ఆరాటంతో- పరీక్షలు మొదలైతే వాళ్ళకన్నా ఎక్కువ తల్లులే నిద్రపోకుండా కూర్చోటం- పిల్లల రిపోర్టుల కోసం పడిగాపులు పడటం... ఇవన్నీ నిత్యజీవిత పోరాటాలలోని భాగాలు!

ఎంతసేపు తనకి సంబంధించినంతవరకు చిన్నపాటి కష్టాన్ని కూడా భరించలేని సగటు మహిళ ఒక్కసారి తన చుట్టూ సమాజాన్ని పరిశీలించగలిగితే- అసలు సమస్య అంటే ఏమిటి? ఎందరు ఎన్నెసి సమస్యలతో కొట్టుమిట్టాడుతున్నారు?... అనేది తెలుసుకోగలుగుతుంది.

భుక్తి గడవక, రోగాలకి మందులు తాగలేక, ఆడపిల్లలకి పెళ్ళిళ్ళు చేయలేక, కొడుకులకి ఉద్యోగాలు దొరక్క ఎన్నో బాధలు పడుతున్నవారు, ప్రతిరోజూ ఓ గండంలా బ్రతికే బడుగుజాతి వారు ఉన్నారు.

వీళ్ళందరి ముందు- తన సమస్యలు ఒక లెక్కా? అని ఆలోచించే వివేకం సగటు మహిళ సంతరించుకుంటే- సమాజంలో మహిళాజాతి పేరు, విలువలు జ్యోతిగా ప్రకాశించి సాటివారికి మార్గం చూపగలుగుతుంది.

కనుక- 'మహిళా... ఓ సగటు మహిళా... మేలుకో! చిట్టి పొట్టి ఆశలూ, కోరికలూ, తాపత్రయాలకై వెంపర్లాడక అసలైన అభ్యుదయం వైపు, ప్రగతి పథం వైపు అడుగు వేయి!!'



# బ్రతకనేర్చిన ఇల్లాలు

గమనించారో, లేదో...

ఈరోజుల్లో ప్రతివాళ్ళూ పేద అరుపులు, బీద నిట్టూర్పులు విడుస్తున్నా- బ్రతుకులో మాత్రం నెరజాణత్వం చూపిస్తూనే ఉన్నారు.

విద్యార్థులంతా నినాదాలు, అరుపులతో గోల చేస్తూ రిజర్వేషన్లు కావాలనీ, అక్కర్లేదనీ జుట్లు పీక్కుని గొంతులు చించుకుంటూ చిందులు తొక్కుతున్నారు. భవిష్యత్తులో తామేదో చేయాలని, చేయలేకపోతామనీ... వాళ్ళ ఆవేదన!

వాళ్ళు ఏంచేస్తారో, చెయ్యరోగానీ వర్తమానంలో మాత్రం- ప్రళయాలు సృష్టిస్తున్నారు! విద్యాస్థాయి పెరిగాక మనుష్యుల్లో వివేకం, ఆలోచనా సరళి పెరగాల్సిందిపోయి నానాటికీ దిగజారిపోతోంది.

తాము చదివిన చదువుకు సార్థకత ఉండదని కొందరు,

చదువుకి తగిన ఉద్యోగం దొరకాలని మరికొందరు-

మొత్తానికి... విద్య, సంపాదన రెండూ తులాదండంతో బేరీజు వేసుకోవడంలోనే ఉంది.

వివాహం చేసుకుని గృహిణిగా స్థిరపడిన మహిళల్లో ఎంతమంది చదువుకున్నారో.., ఎంతమంది ప్రాథమిక విద్యాస్థాయిలోనే ఉండిపోయారో లెక్కలు చెప్పక్కర్లేదు కానీ- కొందరు ఉద్యోగాలు చేస్తున్నారు.., కొందరు ఖాళీగానే ఉన్నారు.

అయితే, ఖాళీగానే ఉన్నా- కొందరు సమయస్ఫూర్తితో తనకున్న పరిధిలో కుటీర పరిశ్రమలు చేస్తున్నారు. 'విద్య ఉంటేనే సంపాదనకి వీలు' అనే మాటల్ని వెనక్కి నెట్టి,

'తెలివి ఉంటే బ్రతకటం తేలిక'... అనే నినాదం ఇవ్వాలేమో- అనిపిస్తుంది... ఇలాంటి సందర్భాల్లో మహిళల్ని చూసినప్పుడు!

ఎప్పుడో చిన్ననాట ఏడో క్లాసు చదివి మానేసిందొకావిడ! ఈనాడు ముగ్గురు పిల్లల తల్లిగా, ఒక సామాన్య ఉద్యోగి భార్యగా సంసారాన్ని అతిజాగ్రత్తగా నడిపిస్తోంది.

చిన్నచిన్న మొత్తాలన్నీ చీటీల రూపంలోకి మార్చి- కొంత పెద్దమొత్తంగా రూపొందించి- ఆ ద్రవ్యంతో ఆవిడ కుటీర పరిశ్రమ ప్రారంభించింది. తనకి వచ్చిన వంటలన్నీ రకరకాలుగా చేసి పొడులు, అప్పడాలతో, చట్నీలతో సీసాలు నింపి మార్కెటుకి పంపేది.

ఆ పనిలేని సమయంలో పెద్ద దుకాణాల నుంచి కొద్ది చవకలో బట్టలు కొనితెచ్చి వాటిమీద అద్దకం ఎంబ్రాయిడరీ చేసి మళ్లీ పెద్ద దుకాణాలలో అమ్మేది. ఇంట్లో ఏ వస్తువూ వేస్టుగా పోనీయక జాగ్రత్తగా రకరకాల తోరణాలు, ఫ్లవర్‌వాజులు, పేపర్ వెయిట్లు లాంటి చిన్నచిన్న చేతిపనులు ఓపిగ్గా కొత్తరకంగా చేసి చిన్నషాపుల్లో అమ్మేది.

కొన్నాళ్ల తర్వాత ప్రయివేటుగా బియ్యేకి కట్టి ప్యాసయ్యింది.

ఆ విద్యావివేకంతో ఎల్.ఐ.సి. ఏజంటుగా చేరి, ఇటు ప్రజాసేవ- అటు ప్రభుత్వ సేవ చేయగలుగుతోంది.

ఇప్పుడు వాళ్ళ మూడు ఎక్కౌంట్లు(బ్యాంక్), ఒక స్వంత ఇల్లు కట్టుకుని, చీకుచింతా లేకుండా ఉన్నారంటే- చాలామందికి నమ్మబుద్ధి కాకపోవచ్చును. కొన్ని సత్యాలు అంతే!

కానీ... ఇక్కడ నమ్మకం, అపనమ్మకం కాదు. జీవితంలో బ్రతకటం ఎలాగో తెలియచేసే మహిళలు మనకి బోలెడుమంది కనబడుతున్నారు.

చదువుకోలేదని దిగులు అక్కర్లేదు..,

చదువుకున్నా ఉద్యోగం రావటంలేదన్న ఆవేదనా వద్దు.

విద్య జ్ఞానం కోసమే!

అనుకున్న ఉద్యోగం రాకపోయినా- ప్రభుత్వాన్ని నిందించక్కర్లేదు. బ్రతకనేర్చిన ఇల్లాళ్లని చూసి బ్రతుకు మీద నమ్మకాన్ని ఏర్పరచుకోవాలి. మనోధైర్యం ఉంటే- ఉద్యోగాల కన్నా మిన్నగా బ్రతకవచ్చును.



# అతివలు- ఆరాలు!

చాలామంది ఆడవాళ్ళలో ఓ గుణం కనిపిస్తుంది...

ఎదుటివాళ్ళని గురించి వివరాలు తెలుసుకోవాలనీ, వాళ్ళ గుట్టురట్టు కనుక్కోవాలనీ ఉత్సుకత చూపిస్తారు. ఇలా తెలుసుకోవటం రెండు రకాలు- డైరెక్టుగా వాళ్ళనైనా అడుగుతారు, లేదా ఇతరుల ద్వారానైనా తెలుసుకుంటారు.

'ఏమిటీ... మీ ఇంటికి ఎవరో వచ్చినట్టున్నారు? బంధువులా? అమ్మో... నెలాఖరు రోజుల్లో ఇలా బంధువులు వస్తే- ఇక అయినట్టే! ఎన్నాళ్లు ఉంటారేమిటీ? బాగా కావల్సినవాళ్ళా?...''

- అంటూ వాళ్ళకి కావల్సిన వివరాలన్నీ సేకరిస్తారు.

ఇక ఉద్యోగం విషయం అయితే- 'ఉద్యోగం వచ్చిందా? ఎక్కడ? ఎంత ఇస్తారు? గవర్నమెంటుదా? ప్రయివేటుదా? ఏమైనా పైరాబడి ఉంటుందా?' అని ఇంటర్వ్యూ కన్నా ఎక్కువ ఆరాలు తీస్తారు.

"అమ్మాయికి పెళ్ళి కుదిరినట్టే! ఇంకేం... ముహూర్తాలు ఎప్పుడు పెట్టుకున్నారు? కట్నం ఎంత? లాంఛనాలు ఎంత? అబ్బాయి ఏంచేస్తున్నాడు? ఎలా ఉంటాడు? వాళ్ళ కుటుంబం ఎలాంటిది? అబ్బాయికి ఏ ఉద్యోగం? బాధ్యతలు ఉన్నాయా? మీ శాఖేనా?"

- అంటూ 'పెళ్ళి కుదిరిపోయిందే...' అన్న దుగ్ధ లాంటిది మనసులో పెట్టుకుని, ఎక్కడైనా లోపాలున్నాయేమో... అని ఈకలు తోకలు లాగాలని చూస్తారు.

"ఈ చీర ఎక్కడ కొన్నారు? ఎంత? రంగు ఉంటుందా?" దగ్గర్నుంచీ-

"ఇవాళ ఏం కూర వండారూ? కిలో ఎలా ఇచ్చాడు? ఏ మార్కెట్‌లో కొన్నారు?"... లాంటి అతి మామూలు ప్రశ్నలు కూడా వేసి వాళ్ళ నైజం కనబరుచుకునే అతివలు మన మధ్య చాలామందే ఉన్నారు.

"ఇల్లు కట్టుకున్నార్ట వాళ్ళు! ఎక్కడ? లోను మీదా? స్వంత డబ్బా? అద్దెకిస్తారా? పూర్తిగా వాళ్ళే ఉంచుకుంటారా? ఎలావుందీ?"... లాంటి ప్రశ్నలు మధ్యవర్తుల ద్వారా వేసి సమాచారం రాబట్టుకుంటారు.

ఎవరికైనా ఓ మంచి జరిగితే- వీళ్ళు భరించలేరు. మధ్యవాళ్ళ ద్వారా అనేక ఆరాలు తీసి వాళ్ళకున్న కుళ్ళుని వెళ్ళగక్కుతారు.

ఈమధ్య ఒకావిడకి ఉద్యోగం వచ్చింది. ఆవిడకి ఆ కంపెనీలో ఎలా ఉద్యోగం వచ్చిందనీ- ఎవర్ని పట్టుకుందనీ- ఎంత లంచం ఇచ్చిందనీ- నానా ఆరాలు తీసి- 'ఆపాటి నాకెందుకివ్వరాదు...' అన్నట్లు తేల్చిందొక ఇల్లాలు! ఇక ఇళ్లలో ఏమైనా కొన్నా సరే! 'ఇదెప్పుడు కొన్నారు? ఎంతకి కొన్నారు? ఇన్‌స్టాల్‌మెంట్స్ మీదా? ఒకేసారి కొన్నారా?' అంటూ ఊదరగొట్టేస్తారు కొందరు.

ఇవన్నీ అలావుంచి- మధ్యాహ్నం పూట ఎవరైనా వస్తే- ఇక వాళ్ళ ప్రశ్నలకి అంతు ఉండదు. 'మీరు బట్టలు ఏ సబ్బుతో ఉతుకుతారండీ? కాఫీ పొడుం ఎన్నాళ్లు వస్తుందీ? మసాలా పొడి ఎక్కడ కొంటారు? మ్యాగజైన్లు ఏమేమి తెప్పిస్తారూ?' లాంటి ప్రతి చిన్నదానికీ ప్రశ్నలు వేసి మన సహనం పరీక్ష చేసేవారుంటారు.

ఇవన్నీ నిజంగా వాళ్ళు జనరల్ నాలెడ్జి కోసమే అడుగుతే- చక్కగా వీటి ఆధారంతో మంచి వ్యాసాలు వ్రాసి మిగతావారికి తెలియచెయ్యవచ్చును. కానీ.., ఎందుకూ పనికిరాని గాలి కబుర్లు- మరొకసారి చాడీలు చెప్పటానికి అయితే మనకెంత టైం వృథా అవుతుందో కదా?!

చదువుకున్నవారికీ, ఉద్యోగాలు చేసేవారికీ కూడా ఈ ఆరాలు తీసే గుణం ఉంటుంది. దీనివల్ల ఇతరులని బాధించటం తప్ప- మేలు ఏమీలేదు. విలువైన జీవితకాలం పాడుచేసుకోకుండా సమయాన్ని సద్వినియోగం చేసుకుంటే అతివలు ఎన్నైనా మంచిపనులు చేయగలరు.

'ఇవాళ నా పుట్టినరోజండి!'... అని ఎవరైనా చెప్పగానే- 'అలాగా... చాలా సంతోషం. మరిన్ని మంచి పుట్టినరోజులు గడుపుకోవాలని ఆకాంక్షిస్తున్నాను.' అంటే ఎంతో బాగుంటుంది. అలాకాక- 'పుట్టినరోజా? ఎన్నేళ్లు వస్తాయి? తారీఖుల లెక్కనా? తిథుల లెక్కనా? ఏం చీర కొనుక్కున్నారూ?' అంటూ మొదలుపెడ్తే- చెప్పినవాళ్ళకి ఎంత ఆశాభంగమో తెలుసుకోండి.

'అన్నివేళలా ఆరాలు తీయక- అతివలు మెలిగిన అతి మంచి జరుగును'... అవునా?!



# మగువల మనోబలహీనత!

కొన్ని తప్పులకి దండన ఉండదు.

అంటే... వేరే ఎవరో శిక్షించరు. అలాంటివే మనకి మనం చేజేతులా చేసుకున్న కర్మలు!

ఈనాడు చాలా కుటుంబాల్లో తెలియకుండా చాలా పొరపాట్లు చేస్తున్నారు.

జీవితంలో సాధించవలసిన ఘనకార్యం- అంటే... చదువుకోవడం, ఉద్యోగం, సంపాదన, అనుభవించడం... అనే తప్ప- వంశం, జాతి, దేశం, సంస్కృతి అనే విచక్షణా శక్తిని మరిచిపోతున్నారు.

వెనకటి తరం అనగానే 'పాత' అనుకోవడం, 'అభ్యుదయం' అనగానే ముందుకు దూసుకెళ్లటం అనే తప్ప- ఆచరించదగ్గవీ, వదిలేయాల్సినవీ అన్న ఆలోచన లేకుండా పోతోంది.

చదువులు ఈనాడే ఉన్నాయా??

ప్రతి తల్లీ- తన పిల్లల భవిష్యత్తు ఉజ్వలంగానే ఉండాలని కోరుతుంది. అయితే... మిగతా వారికంటే ఏదో గొప్పగా వీరవనితలో, వీరశూరులో కావాలనుకోవడం, అవుతారనుకోవడమే- బలహీనత!

కాలు నేల మీద ఆన్చకుండా- ఆడంబరాలకు పోవడమే- బలహీనత!

భారతీయ సంస్కృతి, మాతృభాష పట్ల చిన్నచూపు చూస్తూ- జాతి, సంస్కృతికి దూరమవుతున్నారు. సంప్రదాయమైన చీరకట్టూ, బొట్టూ తీరుని నిర్లక్ష్యంగా, హేళనగా చూసేవాళ్ళు తయారయ్యారు.

సమాజపు కట్టుబాట్లని తెంచుకుని బయట పడుతున్నారు... బాగానే ఉంది. తల్లిదండ్రులు కూడా పిల్లలు పార్టీలకెళ్ళినా, స్వేచ్ఛగా తిరిగినా సమర్థించుకుంటున్నారు.

కానీ, అదే పిల్లలు- ఇష్టపడినవాడితో... లేదా అమ్మాయితో పెళ్ళి చేసుకుంటే-కుంటే..?

సహించలేక గిలగిలలాడిపోతున్నారు. అక్కడ జాతి, మత కట్నకానుకల కోసం బాధపడుతున్నారు. వంశ ప్రతిష్ఠ కోసం ముఖం చాటుచేసుకుంటున్నారు. ఈ పరిణామాన్ని ముందే ఊహించలేదా?

స్వేచ్ఛ ఎప్పుడైతే ఇస్తున్నారో- దాని వెనక జరిగేదీ గ్రహించాలి.

అబ్బాయి కట్నం లేకుండా కోడల్ని తెచ్చినా.., అమ్మాయి అన్యమతస్తుణ్ణి చేసుకున్నా- భరించగల ధైర్యం, మంచితనం ఉన్నప్పుడే- మన వంశాచారాలనీ, నియమాలనీ, ఇంటి పేరుప్రతిష్టలనీ మరిచిపోయి వ్యక్తిగత స్వేచ్ఛ ముఖ్యమనుకుని, పిల్లల్ని వారి అభిమతాల మేరకు వదిలేయాలి.

కానీ.., ఈనాడు- కొన్ని కుటుంబాల స్థితి చూస్తే విచారమనిపిస్తుంది.

పిల్లలకీ ఆడా, మగా తేడా లేకుండా సమానమైన స్వాతంత్ర్యంతో పెంచి-చదువులు చెప్పించడం వరకు సంతోషమే! తరువాత వారు ఏదైనా ప్రేమవ్యవహారాల్లో చిక్కుకోవటమో- రిజిష్టర్ మ్యారేజ్ చేసుకుంటేనో... భరించలేక ఎంత మదనపడుతున్నారో! ముందుముందు ఆ వివాహాలు విజయవంతమవకపోతే- జరిగే పరిణామాలని ఎలా ఎదుర్కొంటారు?

... ఇదంతా చేతులు కాలాక ఆకులు పట్టుకోవటం లాంటిది! స్వయం కృతాపరాధం!!

స్వేచ్ఛ అంటే నిజమైన అర్ధం తెలుసుకోవాలి. వ్యక్తిత్వంలో పూర్ణత్వం సంతరించుకోవాలిగానీ- అర్థంలేని వ్యామోహాలు కాదు.

అవునా?! ... ఆలోచించండి!



# కలల్లో విహారం!
# ... ఇలలో ప్రమాదం!!

నేడు చాలామంది- చిన్నాపెద్దా కూడా అవాస్తవికమైన విషయాలకే, యదార్థం కాని వాటికే విలువనిచ్చి- నిజ జీవితం నుంచి నిస్పృహ, నిరాశలకి లోనవుతున్నారు.

భ్రమ అనేది- వాస్తవం కాదు.

కల్పన, ఊహ, నటన, మనిషికి కొంత వినోదం, ఉల్లాసం కలిగిస్తాయి తప్ప- జీవితంలోని సమస్యల్ని పరిష్కరించలేవు.

సినిమా చూస్తూ... నిజ జీవితంలో మహిళలు ఎందరో- ముఖ్యంగా యువత (మూడు గంటల వినోదం కోసం నిర్మించే చిత్రంలో వ్యాపారదృష్ట్యా ఎన్ని హంగులు అమర్చగలరో అన్నీ చూపించగలరు. బీదపిల్లని గొప్పింటికోడలుగానూ, నిరుద్యోగికి ఒక్కసారి లక్షలు కలిసివచ్చినట్టు చూపిస్తారు. ప్రేక్షకులు చూసి ఆనందించాలి. అంతేతప్ప-) మనకీ అలాంటి అవకాశం కలుగుతుందనీ, కలగాలనీ ఆశపడటం ఎంత తెలివి తక్కువ? విలువైన కాలం వ్యర్థం చేసుకున్నట్టే! జీవితం మళ్లీ వెనక్కి తిరగదు. సినిమారీలు కాదుగదా!

ఒక చిత్రాన్ని మనం ఎన్నిసార్లైనా చూడగలం.

కానీ, మనకి నిన్నటిరోజు మళ్లీ ఇవాళ రాదు.

యువతగానీ, మహిళగానీ ఇది దృఢంగా ఆలోచించక ఊహాగానాలు చేస్తూ తమ జీవితంలో అలాంటి అవకాశం రావాలనీ, వస్తుందనీ ఊపిరి నింపుకుంటూ ఉంటారు.

టీవీ సీరియల్స్‌లో- ఒక చదువురాని అమ్మాయి భర్తచేత అవమానించబడి ఇంట్లోనుంచి బయటికి గెంటబడుతుంది. ఆ తర్వాత పట్టుదలగా చదివి పరీక్షలు ప్యాసై ఉద్యోగస్తురాలవుతుంది.

- ఇంతవరకు ప్రబోధాత్మకంగా, మహిళలకి ఆదర్శంగా ఉంది కథ! అయితే- చదువుకున్న కాలం గబగబా రీలు తిరిగిపోవటం వల్ల- నిజజీవితంలో మహిళలు చదువుకోసం పడాల్సిన శ్రమనీ, పట్టుదలనీ పాటలో `పల్లవి`లాగ పక్కకివుంచి- చివరి దృశ్యంలో చూపిన `పేద్ద`బంగ్లా మీద దృష్టి నిలుపుకుంటారు.

ఆ మేడ ఒక జమీందారు బంగ్లా లాగా- కిందా, పైనా అట్టహాసంగా అలంకారాలతో ఉంటుందనుకోండి! 'ఓహో... చదువుకుని ఉద్యోగం చేసుకుని, అంత ఇల్లు కట్టుకోవచ్చు. కారు, నౌకర్లు, దర్జా... అబ్బో! ఎంత సుఖం!!` అనే ఊహలు సాగిపోతూ అవే ఊపిరిలాగా అయిపోతాయి.

అంతేకాని-

'అందులో యదార్థం ఎంతవుంది? ఎంతవరకు మన దృక్పథం సాగాలీ?'... అన్న ఆలోచన కలగదు.

'ఒక ఉద్యోగం' అనగానే- ఎలాంటిది? ఎంత రాబడి ఉంటుందీ? ఎంత హోదా ఉండవచ్చును? ఒకవేళ ఇల్లు కట్టుకున్నా ఉండడానికి ఎంత ఆస్కారం ఉంటుంది? నీతిగా, నిజాయితీగా ఉండే ఉద్యోగంలో ఎంత సంపాదించగలరు? (అలాంటి ఆదర్శమైన జీవితాలనే చూపిస్తారు గదా మరి!) ఈ రకమైన ఆలోచన చిత్రనిర్మాతలకి ఉండదు. ఎందుకంటే- సినిమా ఒక వ్యాపారం కనుక- ప్రజల్ని ఆకర్షించటం కోసమే- అని ఆలోచిస్తారు.

కానీ, నిజజీవితంలో ఇలాంటివి సాధ్యమా?... అన్నది మనం ఆలోచించాలి.

ఏది సాధించాలన్నా కర్తవ్యం, శ్రమ ముఖ్యం! అవి చేయకుండా ఊహలతో అన్నీ సాధించేయాలనుకోవటం వెర్రితనం!

మనం కష్టించినదాని మీద మనం అనుభవించబోయే ఫలితం ఉంటుంది తప్ప- ఊహాగానాలతో ఏదీకాదు. అవాస్తవమైనదీ, అసందర్భమైనవి చూసి, చదివి ఈనాటి మహిళలు, యువతరం ప్రలోభాలకి గురి అయితే- విచారించాల్సిందే!

వివేకం- విమర్శనాత్మక దృష్టి వైపు పయనించాలని మగువలూ, యువతా సంకల్పించాలి.

ఆ సంకల్పమే ప్రబోధగీతం అవుతుంది.



# అజ్ఞానపు ఊబిలో అభ్యుదయపు పునాది

ఇల్లు కట్టాలంటే మంచి నేల చూస్తాం.

రాయి, నీరూ లేని గట్టి ప్రదేశంలో పునాది వేస్తే ఇల్లు గట్టిగా నిలబడుతుంది.

మనుషులు సంస్కారం నేర్చుకుని సమాజవ్యవస్థని పటిష్టం చేసి జాతి చైతన్యానికి దోహదం కావాలంటే మానసికమైన బలం ఎంతైనా అవసరం! ఆ స్థైర్యం, దృఢత్వం పైనే సంస్కారం అలవడి, అభ్యుదయపు భవనం నిర్మించగలం.

కానీ- ఈనాటి పరిస్థితుల్లో అభ్యుదయం, ఆదర్శం... అని గోలే తప్ప- కార్యాచరణ కష్టంగా ఉంది.

నిరక్షరాస్యతను నిర్మూలించి, సంఘంలో ప్రగతిపూలు పూయించాలనుకున్న సంఘసంస్కర్తలు ఎన్ని పథకాలు రూపొందించినా అట్టడుగు వర్గాలలో తగినంత సంచలనం కనిపించటం లేదు. 'ఏమిటి కారణం?' అని ఒక్కసారి ఆలోచించండి.

ఎంతోకాలంగా అతి సాదాజీవితం, పేద బతుకుల్లో మగ్గిన శ్రామికజీతి సుఖాలని కోరటం సహజమే! అయితే- ఆ కోరికను వారు సక్రమమైన దారిలో తీర్చుకోలేకపోతున్నారు. అందుకు కారణం- సాటి పైస్థాయి మనుషులు!!

యవ్వనంలో ఉన్నవారికి శృంగారం పట్ల, పేదవాడికి డబ్బు మీద మోజు సహజం!

మనిషికి బలహీనత ఎక్కడుంటుందో దాని మీద దెబ్బకొట్టి లొంగదీసుకునే స్వార్థపరులు సమాజంలో అడుగడుగునా ఉన్నారు. ఈనాడు- టీవీలు, ఎయిర్‌కూలర్‌లు, ఫ్రిజ్‌లు, గ్రైండర్లు లాంటి అనేక యంత్రాలతోపాటు- ఆకర్షణీయమైన ఫర్నీచర్, బీరువాలు, డ్రస్సింగ్ టేబుళ్ళు, డైనింగ్ టేబుళ్ళు వరకు మనుషుల్ని ఆశపెట్టి వశపరచుకుంటున్నాయి. డబ్బున్నవాడు అన్నీ కొనుక్కుంటే- లేనివాడు 'ఎలా కొనాలా?'... అని ఏదో మార్గం ఆలోచిస్తున్నాడు.

'ఆడవాళ్ళకి మోజులెక్కువ'... అన్న వాక్యం ఈ విషయంలో అక్షరాలా సత్యం!

ఉన్నవాళ్ళు- కొత్తకొత్తవి కొనుక్కుంటూ, పాతవి ఎవరికైనా అంటగట్టాలని చూస్తున్నారు. ఆ వలయంలో తమ ఇంట్లో పనివాళ్ళనే బిగిస్తున్నారు.

కలర్ టీవీ తను కొనుక్కుని, పాత బ్లాక్ అండ్ వైట్ టీవీ పనిమనిషికిచ్చి, డబ్బు నెలజీతంలో లెక్కచూసుకుంటాననంటే- వెర్రిముఖం... డబ్బు ఇవ్వక్కర్లేకుండా ఇంటికి (పూరింటికి) టీవీ తెచ్చుకుంటున్నానని మురిసిపోతోంది తప్ప- 'నెల్లాళ్ళ కష్టం తిండికి చాలకుండా టీవీ బాకీ కింద జమకట్టున్నారు కదా!' అని యోచించలేకపోతోంది.

చిట్టీలు కట్టిన డబ్బు- విందులకీ, తాగడానికీ తగలేసుకుంటున్నారు తప్ప- బ్యాంకుల్లో దాచుకోవాలని తెలియటం లేదు.

అందరికన్నా ఎక్కువ కష్టపడుతున్న ఈ కూలీజనం- సంపాదనని సద్వినియోగం చేయలేకపోవటానికి సాటి పెద్దలే కారణం! వారి అమాయకత్వం, అజ్ఞానం, నిరక్షరాస్యతని అడ్డుపెట్టుకుని వెన్నుపోటు పొడుస్తున్నారు.

'వడ్డీలకీ, చిట్టీలకీ, వాయిదాలకీ సంపాదించుకున్న డబ్బంతా కట్టేస్తే- ఇంక తిండీ, గుడ్డా ఎలా?'... అన్న వివేకంలేని వారి అజ్ఞానం- రోజురోజుకీ ఊబిలా వారిని కిందకి నెట్టేస్తుంది. అటువంటి ఊబిలో- పునాదిరాయి ఎలా ఆగుతుంది?

కనుక- మొదట వారిని ఆ ప్రలోభాల నుంచి గట్టెక్కించే ఉపాయం చెప్పాలి. చదువుకుని, వృత్తి విద్యలు నేర్చుకుని, ఆదాయం పెంచుకుని, విజ్ఞానం ప్రోదిచేసుకుని, అప్పుడు స్వయంశక్తితో అన్ని లాభాలూ పొందవచ్చుననే విషయాలు వాళ్ళకి క్షుణ్ణంగా చెప్పి- దానికి తగిన పద్ధతుల్ని ప్రవేశపెట్టి- వారిని ఆ అజ్ఞానపు ఊబినుంచి బయటకి లాగిననాడు- ఏ అభ్యుదయం అయినా, ఆదర్శం అయినా ఫలితం ఇస్తుంది.



# తెలుసుకోలేని విలువలు

ఈనాడు కొన్ని రోగాలు సర్వసాధారణమైపోయాయి.

పదిమందిలో ఏడెనిమిది మందికి తలనొప్పి ఉంటుంది. ఆ తర్వాత కళ్ళు మంటలు, కడుపు నొప్పి, ఆయాసం, నీరసం, రక్తపోటు, మధుమేహం, ఒళ్ళు తిరగటం, కాళ్ళనొప్పులు, విరోచనబద్ధం, పళ్లపోట్లు... ఇత్యాది రోగాలు, బాధలు చాలామందికి ఉమ్మడిసొత్తులాగా పట్టుకొని ఉంటున్నాయి. బీదవాళ్ళు, గొప్పవాళ్ళు అన్న తేడా ఏమీలేదు.

కానీ, వాటి నివారణ విషయంలో మాత్రం- గొప్ప బీదా తేడా ఉంది.

ముఖ్యంగా మహిళల్లో మరీ ఉంది. కాస్తోకూస్తో వచ్చే చిన్నపాటి జబ్బులకి కూడా ధనికురాలైన స్త్రీ- వెంటనే డాక్టర్ దగ్గరకి పరిగెత్తి పరీక్ష చేయించుకుంటుంది. 'రెండురోజుల నుండి ఒకటే తలనొప్పి' అనీ, 'అసలు ముఖం ఎత్తి చూడలేకపోతున్నా'ననీ చెప్తుంది.

అంతే...

డాక్టరుగారు ఎక్స్‌రే తీయాలనీ, అవసరమైతే బ్లెడ్‌టెస్టు చేయాలనీ, ప్రస్తుతం కోర్సు ఇంజక్షన్లు తీసుకోమనీ, 'పూటకి రెండు చొప్పున మూడు పూటలా ఈ మాత్రలు (టాబ్లెట్లు) వేసుకో'మని... వైద్యం ప్రారంభిస్తాడు.

తలనొప్పే కాదు- కళ్ళమంటలకీ, చెవిపోటుకీ, వన్ను నలుపుకీ, కాళ్ల గుంజడానికీ... ప్రతి చిన్న తేడాకీ డాక్టర్ దగ్గరికి వెళ్లడం చాలామంది మహిళలకి అలవాటు.

ఇక చిన్నపిల్లల విషయంలో చెప్పక్కర్లేదు.

వాళ్ళు రెండుసార్లు విరోచనాలకి వెళ్లినా- పాలు కక్కుకున్నా- ఒళ్ళు వెచ్చగా ఉన్నా- జలుబు చేసినా... డాక్టర్ల దగ్గరికి పరుగెత్తుతారు.

ఇది జాగ్రత్త కోసం అనీ- ఆరోగ్యం కాపాడుకోవడం అనీ- అనుకోవడం కన్నా... డాక్టర్ అంటే ఇక దేవుడే అనుకోవడం, శరీరానికి ఇక ఏ తేడాలు చేయకూడదనుకోవడం ఎక్కువగా ఉంటుంది.

శరీరం అన్నాక- ఎప్పుడైనా సుస్తీ చేయడం తప్పదు.

అలా వచ్చినప్పుడు కాస్త సర్దుకోగలిగేవి ఉంటాయి. అయినదానికీ, కానిదానికీ మందుకోసం పరుగెత్తనవసరం లేదు.

ఒకవేళ మందు వేసుకోవాలన్నా- డాక్టర్ల దగ్గరికే వెళ్లాలనుకోవడం... అదొక రకం పిచ్చి! ఈనాడు విద్యావంతులైనవాళ్ళకి ఈ వెర్రితనం మరీ ఎక్కువగా ఉంటోంది.

మన పెద్దవాళ్ళు- ఇంటిలో ఎన్నో వైద్యాలు చేసేవారు. ఆయుర్వేదంలో ఎన్నో మందులు మనం ఇంట్లో తయారుచేసుకోవచ్చును.

జలుబు చేస్తే చిన్నపిల్లలకి- తమలపాకు పొట్ట మీద వేసికట్టి కాపడం వేస్తే- త్వరగా తగ్గిపోతుంది. పెద్దవాళ్ళకి కూడా తల భారంగా ఉంటే- 'ఆవిరి' పడ్తారు. మిరియాల కషాయం తాగుతారు.

కడుపు నొప్పిగా ఉంటే శొంఠిపొడుం అన్నంలో తిన్నా, అల్లపు రసం తాగినా- తగ్గుతుంది.

విరోచనాలు అవుతే- మిరియాలు, కరివేపాకు నూరి మాత్రలు వేసుకుంటే తగ్గుతాయి. దగ్గు పొడిగా వస్తే- పటిక బెల్లం రసం పీల్చినా, లవంగం కాల్చి తిన్నా, బెల్లం మిరియాలు బుగ్గన పెట్టుకుని రసం పీల్చినా తగ్గుతుంది.

ఇవన్నీ పెద్దలు అనుభవంతో నేర్పిన చిట్కావైద్యాలు. చిన్నపాటి రోగాలకీ, జబ్బులకీ మనంతట మనమే వైద్యం చేసుకోవచ్చును.

పెరట్లో ఉండే తలసి ఎంతో మేలు చేస్తుంది. గాయాల్ని- బర్నాల్ కన్నా ఎక్కువగా మాన్పుతుంది. ఆయాసం, దగ్గు తగ్గిస్తుంది. కాకర రసం ఒంటికి మంచిది. మధుమేహం ఉన్నవాళ్ళు తింటారు. కొత్తిమీర, కరివేపాకు, ఇంగువ, మెంతులు... ఇవన్నీ వైద్యానికి పనికివచ్చేవే!

ఇలాగ మనకి అందుబాటులో ఉన్న మందులు మనం తెలుసుకోలేక, విలువ నివ్వక- చీటికిమాటికీ డాక్టర్ల దగ్గరికి పరిగెత్తుతూ ఉంటాం. బిల్లులు చెల్లిస్తేనే కానీ- కొందరికి రోగం తగ్గినట్లు అనిపించదు. కానీ- నిజానికి సామాన్యమైన జబ్బులకి మనమే వైద్యం చేసుకోవచ్చుననీ, దానివల్ల తృప్తీ, ఆదా రెండూ ఉంటాయని మహిళలు గ్రహించగలిగితే ఎంతో మేలు!



# అలవాట్లలో పొరపాట్లు

"ఏమండోయ్... బాగున్నారా? నూతన సంవత్సర శుభాకాంక్షలు అందుకోండి!"

- అంటూ అల్లంత దూరంలో ఉన్న ఒక పరిచయస్తురాలికి కేకపెట్టి చెప్తూ గబగబా దగ్గరికి వెళ్లిందొక ముద్దరాలు!

ఆ శుభాకాంక్షలు అందుకున్న యువతి నవ్వలేక, ఏడ్వలేక ముఖం అదోలా పెట్టి నిలబడిపోయింది... ఆమె చేతిలో సంచులు అటుఇటు మార్చుకుంటూ!

"ఏమిటీ... అలా నిలబడిపోయారు? పదండి" అని నవ్వింది శుభాకాంక్షలు చెప్పిన మహిళ. "అవును. పదండి!" అన్నదే కానీ, ఆ యువతిలో ఉదాసీనం గూడుకట్టుకొని ఉంది.

"అదేమిటి... అలా ఉన్నారు? శుభాకాంక్షలు చెప్తే థాంక్స్ అన్నా చెప్పరేం?" అని రెట్టించింది మొదటి యువతి తన సహజ వాగ్ధోరణిలో.

ఆవిడ పేలవంగా నవ్వి-

"మనసు బాగోలేదండీ! మా నాన్నగారికి సీరియస్‌గా ఉందండీ! మా చెల్లెలికి పాప పుట్టి పోయిందండి. మా తమ్ముడు పరీక్ష తప్పాడండి. మావారికి ప్రమోషన్ ఆగిపోయిందండీ. అందుకని..." అని ఆ పేలవమైన నవ్వునే కంటిన్యూ చేసింది.

"ఆహా! అలాగా..! అవునులెండి. అన్నీ ఒక్కసారే చుట్టుకుంటే మనసెలా బాగుంటుంది?" అని, "సరే... నేను వస్తా!" అనేసి వెనక్కితగ్గి- మళ్లీ మరో దారిలో కలిసిన ఇంకో మిత్రురాలికి "హల్లో... హ్యాపీ న్యూ ఇయర్ అండీ!" అంటూ శుభాకాంక్షలు చెప్తోంది ఆవిడ.

కొంతమందికి కొన్ని అలవాట్లు ఎలా ఉంటాయంటే- వెనకాముందూ చూడకుండా తమ ధోరణిలో తాము పోవటమే తప్ప- సమయం, సందర్భం చూసుకోరు.

పండుగ గ్రీటింగ్స్ చెప్పటం మంచిదే కానీ- అలా చెప్పేటప్పుడు- వాళ్ళు ఆ శుభాకాంక్షలు సంతోషంగా స్వీకరించే స్థితిలో ఉన్నారా, లేదా?... అని చూడకుండా అలవాటుగా చెప్పుకుపోవటం మంచిది కాదు.

ఎంత పండుగైనా- ఇంకా నిద్ర మంచం దిగకుండానే హడావిడిగా ఫోను చేసి హ్యాపీ న్యూఇయర్ చెప్పడం, లేదా రాత్రి పన్నెండు దాటగానే- స్నేహితురాలికి "నా మొదటి శుభాకాంక్షలు మీకే!" అని ఫోనులో చెప్పాలనుకోవడం అంత మంచిది కాదు.

అలవాట్లనేవి సమయం, సందర్భానుసారాల ప్రకారం ఉంటే రాణిస్తాయిగానీ... ఉబలాటం కొద్దీ- ఎదుటివాళ్ళ కష్టసుఖాలు గమనించకుండా శుభాకాంక్షలు తెల్పితే- వేలంవెర్రిలా ఉంటుంది. నిజానికిది మన సంస్కృతి కాకపోయినా- ఆచరించటంలో ఆక్షేపణ లేదు. కానీ, అందుకోలేని వాళ్ళకీ- అందుకోగలిగిన వాళ్ళకి గ్రీటింగ్స్ చెప్పటం పిచ్చితనంగా ఉంటుంది.ఒక్క పండగ విషయంలోనే కాదు-

అనేక విషయాలలో కొందరికి కొన్ని అలవాట్లు ఉంటాయి.

మాటమాటకీ- నవ్వటం కొందరు మహిళలకి అలవాటు. తెలిసినవాళ్ళైనా, తెలియనివాళ్ళైనా సరే- బస్సుస్టాండుల్లో, సినిమా హాళ్లల్లో, బట్టల దుకాణాల్లో, కూరల మార్కెట్‌లో పక్కవాళ్ళని చూసి, "బాగున్నారా?" అని నవ్వుతారు. అదంతా కలుపుగోలుగా ఉండటమని వాళ్ళ అభిప్రాయం. కాని, ఎదుటివాళ్ళు ఎలా అనుకుంటారో అని గ్రహించరు. తెలియనివాళ్ళని చూసి నవ్వితే- (మందహాసం కాదు) "ఈవిడ పిచ్చిది కాబోలు!" అని చెవులు కొరుక్కుంటారు.

కొందరికి చెవిలో చెప్పటం అలవాటు ఉంటుంది.

ఈ అలవాటు వల్ల- వాళ్ళు ఎంతమందిలో ఉన్నా- పక్కవాళ్ళ చెవుల్లో ఏదో అంటుంటారు. ఇంతకీ రహస్యం ఏమీ ఉండదు. అదొక అలవాటు... అంతే! దానివల్ల సభ్యత గలవారు కించపడి అక్కడినుంచి వెళ్లిపోతారు.

సాధారణంగా- ఈ పొరపాట్లు అతివల్లోనే ఎక్కువగా ఉంటాయి.

సమయ- సందర్భాలు గుర్తించకుండా, కొత్తా-పాతా గ్రహించకుండా, మంచీ-చెడూ గమనించకుండా అలవాటుగా చేసే పనుల్లో అనేక దుర్ఘటనలు, దురభిప్రాయాలు దొర్లుతాయని తెలుసుకుని జాగ్రత్తగా ఉంటే మేలు.



# స్వేచ్ఛ అంటే ఇదా..?

అర్ధ శతాబ్దం క్రింద ఆడపిల్లకి తగని కట్టడీలు, హెచ్చరింపులు ఉండేవని మన పెద్దలు చెప్తుంటారు.

"మాకాలంలో ఇలా ఉండేదా? ఎంత భయభక్తులతో ఉండేవాళ్ళు?" అని అంటూంటారు.

దానికి "ఫో... బామ్మా! ఈకాలంలో కూడా ఇంకా చాదస్తమేనా?" అని ఈతరం వాళ్ళు కొట్టిపారేయటం మనం వింటూనే ఉన్నాం, చూస్తూనే ఉన్నాం.

కాలం ఏదైనా- మనిషిగా బ్రతకటం ముఖ్యం.

ఆచారాలనేవి, సంప్రదాయాలనేవి- దేశకాల పరిస్థితులని ఆధారం చేసుకుని ఏర్పాటు అవుతాయి. ఒకనాడు పురుషులకి సైతం ఉద్యోగాలు అక్కర్లేక వృత్తివిద్యలతో, వ్యవసాయాలతో హాయిగా గడిచిపోయేది. అటువంటి పరిస్థితులలో ఆడవాళ్ళకి చదువుకోవాలన్న ఆలోచన ఎక్కడ ఉంటుంది? అయితే- ఆనాడు స్త్రీలకి అక్షరజ్ఞానమే లేదన్న అపనింద తగదు.

రామాయణ, భారత, భాగవత, పురాణాది కావ్యాలు, సంస్కృతాంధ్రాలలో చక్కగా రాగయుక్తంగా పాడి అర్థం చెప్పగల విదూషీమణులు ఎందరో ఉన్నారు. వేదాలలో కూడా ప్రవేశం ఉండి, సంప్రదాయక విషయాలలో అర్థం ఎరిగి పాటించిన పండితురాండ్రే కాక, సామాన్య కుటుంబాలలో కూడా గృహిణులకు లోకజ్ఞానం పుష్కలంగానే ఉండేది.

స్వాతంత్ర్యానంతరం- దేశ పరిపాలనలో అనేక మార్పుల వల్ల ఉద్యోగాలు తప్పనిసరి అయి, అందుకుగాను చదువులు, డిగ్రీలు, వృత్తికోర్సులు తప్పనిసరిగా అమలుచేయాల్సిన అవసరం కలిగింది.

ఇదంతా కాలానుగుణమైన మార్పు!

అంతమాత్రం చేత విద్యావతి అయిన యువతి తమ పైతరం వారిని తిరస్కారంగా చూడాలా? విర్రవీగినట్టుండాలా? తిరుగులేనట్టు ప్రవర్తించాలా? ఇదంతా స్వేచ్ఛ అనుకుంటే- ఎంత దురదృష్టం..?

ఆఫీసుల్లో ఎవరైనా పెద్దవాళ్ళని చూసినా- మామూలు సాదాసీదా అలంకరణలో ఉన్న గృహిణిని చూసినా- ముసిముసిగా నవ్వుకుని ఇంగ్లీషులో విమర్శించుకోవటం! తరచుగా మన అనుభవంలోకి వస్తున్నాయి.

ఒకసారి సినిమా థియేటర్‌లో టిక్కెట్ల కోసం నిల్చున్నారు స్త్రీలు!

ఆ క్యూలో ముందువరసలో ఒకావిడ అతిమామూలు వేషధారణతో నిండుగా నెమ్మదిగా నుంచుని ఉంది. ఆమెకు వెనుక నలుగురు ఆడపిల్లలు అల్ట్రా మోడ్రన్ డ్రస్సులో- ఆడపిల్లలేనా? అనిపించే రీతిలో ఉండి తెగవాగుతూ, ఊగిపోతూ, చాక్లెట్లు తింటూ- అటు మగవాళ్ళ మీద, ఇటు ఆడవాళ్ళ మీద కామెంట్లు చేస్తూ తమ ఇంగ్లీషు పాండిత్యాన్ని గుమ్మరిస్తున్నారు.

చివరికి- ఆ గృహిణిని చూసి నవ్వుకుని- "ఈవిడగారు ఈ హిందీ సినిమా అర్థం అవుతుందనే వచ్చిందా?" అని ఇంగ్లీషులో మాట్లాడుకున్నారు.

వెంటనే ఆమె వెనక్కి తిరిగి- "అరగంటనుంచి మీ వరుస చూస్తున్నాను... మీరు మాట్లాడిన వాక్యాల్లో ఎన్ని అసందర్భంగా ఉన్నాయో చెప్పనా..?! నాకు హిందీ వచ్చునో, రాదో చెప్పనా? కానీ, మీకు ఏమీ రాదని మాత్రం తెలుస్తోంది"అని అనర్ఘళంగా ఇంగ్లీషులో, హిందీలో దంచి పారేసింది.

అవాక్కైపోయారు ఆ పిల్లలు!

ఆవిడ వేషం కాదు చూడాల్సింది- ఆవిడ భాషాచాతుర్యం! ఆవిడ నిండుదనం!! మళ్లీ నోరెత్తలేదు ఆ పిల్లలు.

ఇదిగో... ఇలావుంది సమాజం!

స్వేచ్ఛ అంటే ఇదా? నాలుగు ముక్కలు నోటికి వచ్చేనరికి గాలిలోకి తేలిపోవటమేనా? వేషధారణ, విర్రవీగటం కాదు.., మేధస్సు, నెమ్మదితనం నేర్చుకుని, వ్యక్తిత్వం నిలుపుకోవాలి.

అదీ... స్వేచ్ఛ!!



# బాబోయ్... పెళ్ళా?!

జీవితంలో ఎంతో ఆనందించవలసిన శుభ ఘడియలు వివాహం రోజునే!

పెళ్ళంటే చిన్నపిల్లల దగ్గర్నుంచీ వృద్ధుల వరకు ఎంతో సంతోషిస్తారు. ఎంతో దూరాభారాల్ని సైతం లెక్కచేయక ఆ శుభముహూర్తానికి వస్తారు... బంధుమిత్రులు. వేడుకలు ముచ్చటగా చూసి వధూవరులకి అక్షింతలు జల్లి విందుభోజనాలు స్వీకరించి వెళ్ళిపోతారు.

నిజంగా అంతా సవ్యంగా జరిగితే ఆనందమే!

కానీ, వధువు తల్లిదండ్రులు వరుడివైపు వారికి ఇచ్చే లాంఛనాలు వగైరాలలో తేడా వచ్చిందా... ఇక ఆ భాగోతం, పెళ్ళిలో గొడవలు ఎంత వ్యథ కలిగిస్తాయో కొన్నికొన్ని వివాహాలలో చూస్తూనే ఉంటాం. పోనీ.., తమకి జరిగిన ఈ అనుభవం వధువు తల్లిదండ్రులు గుర్తుంచుకుంటే ఎంత బాగుంటుంది..?!

మన ఇంటి ఆడపిల్లకి కట్నకానుకలు ఇచ్చి పెళ్ళి చేసి అత్తవారింటికి పంపేసరికి ఎంత ప్రళయంగా ఉంటుందో, మనమెంత ఆందోళన పడుతున్నామో... అలాగే ప్రతి ఆడపిల్ల తల్లిదండ్రులూ ఇంతటి అవస్థ పడుతున్నారు కదా- అన్న ఆలోచన ఉంటే, కొడుకు కోసం కట్నపు ఆశలు పెంచుకోకూడదన్న వివేకం తోడవుతే... మానవతావిలువలు పటిష్టంగా ఉండేవి.

కానీ, నూటికి ఏ ఒకరిద్దరో అంత సహృదయంతో ఉంటే ఏంలాభం?

మిగిలినవాళ్ళంతా తాము పడుతున్న అవస్థలు, బాధలు- వాళ్ళూ(అవతలివాళ్ళూ) పడాల్సిందే... అన్న ధోరణిలో అదేదో చాలా సహజమైన విషయం అన్నట్టు ప్రవర్తిస్తుంటారు. ఆడపిల్లగల వాళ్ళకి ఈ రకమైన కష్టాలు తప్పవని అంతా సమ్మతిస్తున్నారు.

ఇంకా వివాహసమయంలో జరుపుకునే తంతులు ఎంత విచిత్రంగా ఉంటున్నాయో అందరికీ తెల్సిందే. అవకాశాన్ని బట్టి, అవసరాన్ని బట్టి ఎన్నెన్నో గొంతెమ్మకోరికలు కోరటం, అవి తీర్చలేక ఆడపిల్ల తల్లిదండ్రులు నీరసపడిపోవటం జరుగుతోంది.

పూర్తిగా సనాతన పద్ధతీ కాదు, అలా అని అంతా నవీన పంథాలోనూ సాగదు.

ఏ సమయంలో లాభం కనిపిస్తుందో, ఏ బంధువుల ప్రోత్సాహమో, ఏ స్నేహితుల ప్రభావమో వరుడి వైపు వాళ్ళకి బాగా తలకి ఎక్కి వెంటనే 'ఆ తంతు మాకుంది... జరప'మనటం, ఆజ్ఞాపించటం చాలా శుభకార్యాల్లో మామూలూపోయింది.

ఇంకాపోతే...

భోజనాది విషయాలలో ఏ కాస్త తేడాలు వచ్చినా నానా గందరగోళం చేసి గొడవలు సృష్టించటం చాలామందికి అనుభవమే!

వధువుని కన్న తల్లిదండ్రులు తమకేదో ఋణపడివున్నట్టూ, ఆ బాకీ అంతా వడ్డీతో సహా చెల్లింపుకోసమే ఈ 'పెళ్ళి' అనే తంతు జరుగుతున్నట్టుగా ప్రవర్తిస్తున్న మగపెళ్ళివార్ని చూస్తుంటే... కన్నెపిల్లలకి పెళ్ళంటే 'హడల్' పుట్టి "బాబోయ్! మాకు పెళ్ళి వద్దు" అనే స్థితికి చేరుతోంది మన సమాజం.

రానురాను మనుషులు ధనాశాపరులై రాక్షసప్రవృత్తికి లోనవుతున్నారు. కట్నం తీసుకోవడం అదేదో 'జన్మహక్కు' అన్నంత దృఢంగా మాట్లాడుతున్నారు. మారుమూల పల్లెవాసుల వరకు ఈ ధనదాహం మితిమీరి కట్నాల ప్రాధాన్యం పెరిగిపోయింది. చట్టం శిక్షని విధించినా- చాటుమాటుగా తీసుకోవడం, ఇవ్వడం జరిగిపోతూ ఉన్నాయి. పవిత్రమైన వివాహవ్యవస్థని వ్యాపారసంస్థగా మార్చేస్తున్న నేటి తీరు- సభ్యసమాజానికి సిగ్గుచేటు.

అసలు ఈ కట్నం ఇవ్వటం అనే పద్ధతి ఎలా వచ్చిందీ, ఎందుకు సాగుతుందీ?... అన్న ప్రశ్న ఇప్పుడు అనవసరం. ఇంతై, అంతై శాఖోపశాఖలుగా విస్తరించిన ఈ జాడ్యాన్ని ఎలా నిర్మూలించాలా... అన్న ఆలోచనే ఇప్పుడు ముఖ్యం.

చదువులంటే చదువుకుంటున్నారు, ఉద్యోగాలైతే చేస్తున్నారు కానీ, సంస్కారం నేర్చుకోవటం లేదు. అది అసలు నేర్చుకుంటే వచ్చేది కాదు. సంస్కారం అనేది కొంత జన్మతః వస్తే మరికొంత విద్యా, విజ్ఞానాల వల్ల సంపాదించుకోవాలి.

సనాతనాచారాల్లో వధూవరులకి శుభం కలగాలని అనేక తంతులూ, పెద్దల ఆశీర్వచనాలు ఉన్నాయిగానీ, కన్నవాళ్ళని బాధించి అయినంతవరకు అన్నీ అడిగి తీసుకోమని కాదు. ఈ వెర్రివేషాలన్నీ మనుషులు తమ ఇష్టానుసారం పెంచుకున్నారు. అందుకే ఇన్నేసి కోరికలు, ఆశలు వివాహవ్యవస్థని అస్తవ్యస్తం చేస్తున్నాయి.

# అత్తల్లో అమ్మలు కనిపిస్తే- కోడళ్ళే కూతుళ్ళు కారా..?!

జీవితంలో పెళ్ళంత సంబరం- చావంత దుఃఖం లేదని అంతా నమ్ముతాం.

కానీ- ఈనాటి పెళ్ళిళ్ళు సంతోషానికి బదులు... చావే సుఖమనిపించే దుస్థితిని కల్పిస్తున్నాయి. పూర్వంలాగ పెద్దలు కుదిర్చిన సంబంధాలే అయినా- ప్రేమించి పెళ్ళిచేసుకున్న పెళ్ళిళ్ళు అయినా... 'పదికాలాల పాటు పచ్చగావుంటే అదే పదివేలు' అన్నట్టు అయిపోయింది.

కట్నాల చావులు అలావుంచి- మామూలు పరిస్థితుల్లో కూడా... అమ్మాయి అత్తవారింట్లో సుఖంగా ఉందన్న సంతృప్తి తల్లిదండ్రులకి మిగలటం లేదు.

పూర్వం అంటే- అర్ధశతాబ్ది క్రితమో.., లేక నాలుగు దశాబ్దాల క్రితమో... ఉద్యోగాల ప్రాధాన్యత అంతగా లేనప్పుడు- అంతా కలిసి ఉండే రోజుల్లో అత్తగారు బాగా ఆరడి పెట్టేదనీ, కోడళ్ళు కష్టాలు పడేవారనీ వినేవారు. ఈనాడు ఉద్యోగరీత్యా ప్రతివారూ వేరే ఊళ్లకి వెళుతున్నారు. అవసరమైతే కోడళ్ళు కూడా ఉద్యోగాలు చేస్తున్నారు. ఇటువంటి పరిస్థితుల్లో కూడా- అత్తల అధికారాలు, కోడళ్ళ కన్నీళ్లు ఈరోజుల్లో చాలా వింటున్నాం.

ఒకింటి అమ్మకన్న పిల్ల, మనింటికి వస్తుందంటే- 'అయ్యో... తన వాళ్ళందర్నీ వదులుకుని ఇక్కడికి వస్తుంది కదా... అంతవరకు తనకున్న ఇష్టాయిష్టాలన్నీ ఇకనుంచి మనతోపాటు సర్దుకుని బ్రతకాలి కదా... స్వేచ్ఛ, సుఖం లాంటివన్నీ పుట్టింట్లో జరిగినట్టు ఇక్కడ కొత్తవాళ్ళ మధ్య సాగవని ఆ అమ్మాయి భయపడ్తోందేమో! మనింట్లో మన ఆడపిల్లలు ఎంత స్వతంత్రంగా ఉంటున్నారూ?! రేపు పెళ్ళై అత్తవారింటికి వెళ్లినప్పుడు వీళ్ళు కూడా- వాళ్ళత్తల్ని తల్చుకుని బెదరాల్సి వస్తుంది కదా! ఆ పరిస్థితి రానీయకూడదు' అని అత్త స్థానంలో ఉన్న మహిళ ఆలోచించగలిగితే... కోడలు ఎంత సంతోషపడుతుందీ.., ఎంత సుఖపడుతుందీ?!

ఒక అత్తగారు తన కోడలు మీద తన బంధువు ఏదో నేరం చెప్పి, "జాగ్రత్త... కంట్రోలు చెయ్యి. లేకపోతే లొంగదు" అని చెప్పిందట!

దానికి బదులుగా ఆ అత్తగారు- "కోడలు- నా కూతురు లాంటిదే! మా అమ్మాయి మీద నువ్వు ఇలాంటి చాడీలు చెప్తావా? ఇంకెప్పుడూ మా కోడలు మీద ఫిర్యాదులు చెప్పకు!" అని మందలించిందట.

ఆహాఁ... అత్తలకు ఆదర్శమూర్తి! నీకు జోహార్!!

అసలు- అత్తల్లో దుర్బుద్ధి పుట్టటానికీ, అహంకారం, దర్పం, కాఠిన్యం కలగడానికీ... బంధుమిత్రులే కారణం!!

కోడలు ఇంకా రాకముందే రాబోయే ఆ పిల్ల మీద లేనిపోనివన్నీ చెప్పి... 'పోట్లగిత్త. వస్తోంది- పలుపుతాడు గట్టిగా పట్టుకో, బిగంచి కట్టుదిట్టం చేసుకో!' అన్నట్టుగా నూరిపోస్తారు.

దానితో అంతవరకు మంచిగా ఉన్న అత్త- వీరనారి అవతారం ఎత్తి, యుద్ధ సన్నాహాలు ప్రారంభించే రీతిలో కోడలు కోసం ఎదురుచూస్తూ ఉంటుంది.

అత్తగారి ఎదురుగా కుర్చీలో కూర్చోరాదు- మామగారితో ఎదురు నిలబడి మాట్లాడరాదు- ఆడబిడ్డలకి ఎదురు చెప్పకూడదు... ఇవన్నీ ఒకప్పుడు అత్త స్థానంలో ఉన్న ఆ స్త్రీ... కోడలిగా అనుభవించినవే!! ఆ బాధ ఏమిటో ఆవిడ అనుభవంలో తెలుసుకున్నాక- మళ్లీ కోడలికి ఎందుకు నరకయాతన సృష్టించాలీ?! ఈనాటి కోడళ్ళు ఉద్యోగస్థులై... ఇంటిని ఆర్థికంగా ఆదుకుంటున్నప్పుడు- ఆ అత్తమామలు ఎంత ఆదరణ చూపాలీ?!

అత్తమామలు- తల్లిదండ్రుల్ని మరిపిస్తే... కోడలు, కూతుర్లాగ మారదా?

పుట్టింటిని మరపించే అత్తింట్లో కోడలు కొత్త చరిత్ర రాయదా?

నూటికి పదిమంది కూడా ఆ విధంగా లేని నేటి సమాజంలో ఎప్పుడూ కట్నాల చావులు.., అత్తమామల, మరదుల, ఆడబిడ్డల ఆరళ్ళు... వినాల్సివస్తోంది. అందుకే- పెళ్ళవగానే కొంతమంది అమ్మాయిలు అత్తిల్లును సెంట్రల్‌జైల్లా ఊహించుకుని ముందుగానే తిరుగుబాటుతనం మూటగట్టుకుని భర్తతో వేరింటి కాపురం పెట్టించడానికి సిద్ధంగా ఉంటున్నారు.

పెళ్ళంటే- ఆత్మీయులతో తగాదాలు, విడిపోవటాలు, చావులూ, ఏడ్పులూ, కోర్టులూ, శిక్షలూనా..? ఎంత దౌర్భాగ్యస్థితి?!!

ఓ మహిళా... అత్తవైతే 'అమ్మ మనస్సు' మరచిపోకు..

ఓ వనితా... కోడలివైతే కూతుర్లా మసలుకో.

అనాడే- వివాహం అనేది నూరేళ్ళ పంటగా మిగులుతుంది.



# బాధించటమూ... ఓ కళే!

మనలో చాలామంది ఎన్నో రకాల విద్యలు నేర్చుకుంటారు.

కానీ, నేర్చుకోకుండానే కొంతమందికి కొన్ని కళలు అబ్బుతాయి! ఇవి కళలు అంటారో, లేదోగానీ- మిగతావాళ్ళకి మాత్రం చేతగావు.

"ఏమండీ.. ఏంచేస్తున్నారూ?" అని వస్తారు మనకి పరిచయమున్నవారు. చేస్తున్న పనేమిటో చేస్తాం! అయినా సరే... తీరుబడిగా మొదలుపెట్టారు కబుర్లు.

"అయ్యో... మీ పనికి అడ్డువస్తున్నానేమో?!" అంటూనే గంటకి పైగా ముచ్చట్లు చెప్తూనే ఉంటారు. తీరా వాళ్ళు వెళ్లే సమయానికి మనచేత కనీసం నాలుగైదుసార్లు "ఫర్వాలేదు... కూర్చోండి!" అనిపించుకుంటారు. అంటే- మనం అనేస్తాం! అదీ వాళ్ళ నేర్పు!

మాటమాటకీ "నేను మీకు అడ్డమేమో... ఆటంకమేమో..." అంటూ ఉంటే- మనం మొహమాటం కొద్దీ- "అయ్యో... ఏం ఫర్వాలేదు" అనేయాల్సి వస్తుంది. లోపల కోపంగా, చికాకుగా ఉన్నా- మనమే వాళ్ళని కూర్చోబెట్టి మాట్లాడే పరిస్థితి కలుగుతుంది. ఇది నిజంగా అందరికీ చేతకాదు.

ఇక... కొంతమంది వాళ్ళకొచ్చే అనుమానాలు, సందేహాలు అన్నీ మన దగ్గరే తీర్చుకుంటారు. మనకి మహాచెడ్డ బాధగా ఉన్నా- వాళ్ళు అడిగే విధానం ఎలా ఉంటుందంటే... "మీరు చెప్పకపోతే మాకు ఇంక ఎవరు చెప్తారండీ!" అన్నట్టు మాట్లాడుతారు. అప్పుడు మనం "ఫోవమ్మా! ఇంకెవర్నైనా అడుగు" అనలేము.

దూరపు బంధువు ఒకావిడ ఎర్రని ఎండలో వచ్చి ఆపసోపాలు పడుతూ "అయ్యో... నోరెండిపోతోంది. గ్లాసుడు మజ్జిగతేట ఇయ్యమ్మా!" అంటూ చెమట తుడుచుకుంటూ ఫ్యాన్ వేపుకుని, కుర్చీ ఆ ఫ్యాను క్రిందకు లాక్కుని కూర్చుని, "ఏమిటో... వారం రోజులయేసరికి చూడాలనిపిస్తుందమ్మా? ఇక ఆగలేక బయల్దేరి వచ్చేశాను. వెధవ చుట్టరికపు పేగు! పీకుతుందనుకో..." అంటూ మొదలుపెట్టే... మనకి నిద్ర వస్తున్నా, ఇంట్లో అర్జెంటు పనులున్నా... మానుకునైనా కూర్చోక తప్పదు. ఇదో రకం బాధ!

ఉద్యోగస్థురాలైతే- ఆమెకి సెలవురోజు ఎన్నో పనులుంటాయి కదా!

కానీ, ఆవిడ స్నేహితులు, బంధువులు సరిగ్గా ఆరోజు వచ్చి, "నీకు ఇవాళ సెలవు కదా... మళ్లీ వారం దాకా వీలవదని వచ్చాను" అంటారు.

అప్పుడు ఆవిడ నవ్వితీరాలి గానీ, లోపలి బాధ పైకి తెలియనివ్వగలదా?

ఒక్కొక్కళ్ళకి ఏదైనా కొంచెం తేడా చేస్తే ఇంట్లోవాళ్ళని, ఇక ఊదరకొట్టేస్తారు. తలనొప్పే అయినా సరే! విక్స్‌లు, అమృతాంజనం రాయటంతో ఆగక- శారిడాన్‌లు, ఆస్ప్రోలు చాలక, తలకి ఓ గుడ్డ కట్టి, "అబ్బ... హమ్మ!" అంటూ నొప్పి వాళ్ళకైతే మనం బాధపడేటట్టు చేసి హంగామా చేస్తుంటారు.

మన అందరికీ అనుభవంలోకి వచ్చే విషయం ఉంది. పనిమనిషి మనల్ని చీరలు, జాకెట్లతో పాటు- నెల మధ్యలో కొంత డబ్బు అడుగుతూ ఉంటుంది. మన దగ్గర లేకపోయినా అది ఊరుకోదు. ఏ ఖర్చు కోసమో దాచిన డబ్బు తీసి ఇవ్వాల్సిందే! లేకపోతే ఊరుకోదు.

వీటన్నిటికన్నా విచిత్రమైన బాధ మరొకటి ఉంది.

మనం ఏదైనా రహస్యంగా ఉంచాలనుకున్న విషయం- మన నుంచి బయటికి కూపీ లాగేదాకా ఊరుకోరు కొందరు. నవాలక్ష ప్రశ్నలు వేసి, అసలు సంగతి రాబట్టుకుంటారు.

తీరా... చెప్పేశాక 'అయ్యో... చెప్పేశానా?' అని చింతిస్తాం! ఇదొక రకమైన బాధపెట్టడం!

సరే... కొందరు మనచేత బేరమాడించి వాళ్ళకి కావల్సిన వస్తువులు కొనుక్కుంటారు. ఇదెంత తమాషాగా ఉంటుందంటే-

మనం ఇంట్లో ఎంత అర్జెంట్ పనిలో ఉన్నా- వాళ్ళ బాబో, పాపో వచ్చి "ఆంటీ... రండి త్వరగా! మా అమ్మ పిలవమంది..." అని లాక్కెళతారు. ఎందుకంటే... ఆవిడకి చీరలో, స్టీలు సామానో, పళ్లో... మరేదో కావాలి... దానికి మనం బేరం చేసి పెట్టాలి!

ఇదిగో... ఇలా ఉంటాయి బాధించటాలు! చెప్పటానికి బాగుండవు. పోనీ- అంటే భరించలేం!

ఇంత నైపుణ్యంగా బాధించగల్గటం... మరీ అదీ కళే! అందరికీ చేతకాదు.



# చీర సింగారిస్తే..?!

ఊరు మాటు మణిగిందన్న సామెత- మనకి పూర్వం నుంచే ఉంది.

ఆనాడే మగువల అలంకరణ పట్ల ఆలస్యాన్ని గురించి అపఖ్యాతి ఉంది.

ఇక ఈనాడు- ఆ అపఖ్యాతి మరింత చిలువలు, పలవలు చేసుకుని- ఊరు మాటు మణగటం కాదు, రోజు మారిపోయి మునుపటి రోజులోకి వెళ్లిపోతాం.

పూర్వం ఏదో అద్దంలో చూసుకుని బొట్టుకాటుకా, శుభ్రమైన బట్టలు ధరించేవారు. కానీ, ఈనాడు నిలువెత్తు అద్దాలతో డ్రస్సింగ్ టేబుళ్లు- అవికూడా మూడేసి, నాల్గేసి ఉండి- ఎదురువైపునే గాక, ఇరుప్రక్కలా చూపిస్తూ ఉంటే రకరకాల పౌడర్లు, స్నోలు, గోళ్ళ రంగులు, తల సింగారాలు, మ్యాచింగ్‌లు వచ్చి అతివలు అద్దం ముందు నిల్చుంటే... ఆకాశంలో సూర్యచంద్రుల గమనిక కూడా గమనించనంత తన్మయత్వంలో మునిగిపోతున్నారు.

మామూలుగానే ఇలాంటి ముస్తాబులు చేసుకుంటున్నవారు, ఇక పెళ్ళిళ్లు- పేరంటాలు- సభలు- సమావేశాలు- సినిమాలు- షికార్లు- షాపింగ్‌లు లాంటి వాటికి వెళ్లాలంటే ఇక చెప్పాలా?!

మేకప్ మొదలుపెడితే- కనుబొమలు దిద్దుకోవటం నుంచి- కాలిగోటికి రంగు సరిగా ఉందో, లేదో చూసుకునేసరికి- సృష్టి చేసిన ఆ బ్రహ్మ కూడా విసిగిపోయేలా చేస్తున్న లలనామణులు ఈనాడు ఎందరో?!

పెళ్ళిళ్ల సీజను వస్తుందంటే- ముందు ముస్తాబుల సంగతే చెప్పుకోవాలి.

ముఖ్యంగా కన్నెపిల్లలు, కొత్తగా పెళ్ళయినవారూ- ఆ పెళ్ళిలో అందర్నీ బాగా ఆకర్షించాలనుకుని సింగారం చేసుకుంటారు.

చీర రంగుకి సరిగ్గా జాకెట్టు రంగు సరిలేకపోతే- వేసుకోరు. ఇక చీర కుచ్చెళ్ళు- పమిట దొంతర్లు- కొంగు పొడవు- వెనకా ముందూ చూసుకోవడాలు... ఇలా ఆ మేకప్ పూర్తయేసరికి- పెళ్ళికూతురు, పెళ్ళికొడుకు అప్పగింతలు కూడా పూర్తయి, పీటల మీద నుంచి లేచి వెళ్ళిపోతారు. అమ్మాయిల ముస్తాబు మాత్రం ఇంకా అద్దం ముందు చివరి మెరుగులు దిద్దుకుంటూ ఉంటుంది.

బొట్టూకాటుకా- చెంపస్వరాలు (ఈనాడు మళ్లీ ఫ్యాషన్ అవుతున్నాయి) తల్లో నడినెత్తినుంచి వ్రేలాడదీసుకునే రెండు మూరల పూమాలలు వేసుకుని- పెళ్ళికూతురి కంటే రెండురెట్లు అలంకరించుకుని, గంటలు గంటలు ఆలస్యం చేసే ఈనాటి మగువల్ని చూస్తే- మిగతావాళ్ళకి ఎంత విసుగు వస్తుందో?!

ఎక్కడికైనా వెళ్లాలన్నా- పెళ్ళికైనా- ఒకపూట ముందునుంచీ మేకప్ మొదలుపెట్టేగానీ- ఆ సమయానికి తయారవలేరు. ఇలాంటివాళ్ళతో ప్రయాణాలు పెట్టుకున్నా, పొత్తులు పెట్టుకున్నా- మిగిలినవాళ్ళు నీర్సం వచ్చి నిద్రపోవాల్సిందే! లేదా- 'అమ్మో...' అని హడలిపోవలసిందే!

ఆమధ్య ఒక పడుచుపిల్ల- మ్యాచింగ్ జాకెట్... చీరకంటే ఒక్కరవ్వ ముదురు అయిపోయిందనీ, వెళ్లాలనుకున్న ప్రోగ్రాం మానేసిందంటే- ముక్కు మీద వేలు వేసుకోవాల్సివచ్చింది.

చెవులకీ, చేతులకీ, చెంపలకీ, మెళ్లోకీ అలంకరించుకోవలసిన వస్తువుల్లో ఏది లోటున్నా- ఇక ఆ ముస్తాబు అసంపూర్ణమైపోయినట్టు విలవిలలాడే యువతుల్ని గమనిస్తే- 'ఎంత అమాయకత్వం..!' అనిపిస్తుంది.

ఈనాటి కాలేజీ అమ్మాయిలు, ఉద్యోగినులు... ముఖ్యంగా తెలుసుకోదగ్గ విషయం ఏమిటంటే-

అలంకరణ అనేది అందానికి మెరుగు దిద్దుకోవటమే కానీ, ప్రతి ఆడపిల్లా కొద్దోగొప్పో బాగానే ఉంటుంది. ఆ బాగున్నదాన్నే శుభ్రంగా ఉంచుకోవాలిగానీ- ప్రపంచంలో జరిగే అందాలపోటీలో నెగ్గాలనుకోరాదు.



# చుక్కలెన్నైనా వెన్నెల వస్తుందా?

ప్రతిరోజూ పేపర్ చూస్తున్నారా?

చూడండి... బాగా చూడండి. ఎన్నెన్ని వార్తలో, ఎన్నెన్ని ఉదంతాలో... చదువుతున్నారు కదా? చదవండి- చదివాక బాగా ఆలోచించుకోండి.

ఇన్నేసి సంఘసేవా సంస్థలున్నాయి కదా! వారం వారం ఎన్నో కార్యక్రమాలు చేస్తుంటారు కదా! మరి- పల్లెల మాట వదలండి, పట్నాల్లో కూడా మురికికంపు కొడ్తున్న వాడలు, సందులు పుష్కలంగా ఉన్నాయి. మంచి సెంటర్ లాంటి చోట- బస్సులు, వాహనాలు తిరిగే చోట- జనం తొక్కిడిగా నడిచే చోట- ముక్కు బ్రద్దలయ్యే కంపుకొట్టుంటే... అందమైన కర్చీఫ్ ముక్కుకు అడ్డం పెట్టుకుని చకచా వెళ్లిపోతున్న మన ఆదర్శమణులు అవతల మీటింగ్‌లో ఉపన్యసించటానికో, ఎవర్నైనా సత్కరించటానికో తొందరపడుతుంటారు.

"ఫలానా చోట ఆరోగ్యశిబిరం నిర్వహించాం. ఫలానా పల్లెల్లో కుట్టుమిషన్లు పంచాం! ఇదిగో... ఇక్కడ చెట్టు నాటేం! అదిగో... ఆ వయోజన విద్యాలయం నడిపిస్తున్నాం!" అని చెప్పటం కాదు. చేతల్లో చేసి చూపించాలి.

చీర నలగకుండా- మ్యాచింగ్ మరిచిపోకుండా, వాహనం లేకుండా బయల్దేరలేని ఈనాటి మన సమాజ శ్రేయోభిలాషులైన అంగనామణులు- అసలు 'సేవ' అంటే తెలుసుకుంటున్నారా? ప్రక్కవాళ్ళ ముఖం చూడకుండా పనివాళ్ళ గోడు వినకుండా తిన్నగా ఉపన్యాస వేదిక మీదకెక్కే మన మహిళలకి అసలు సమాజ అవగాహనైనా ఉందా... అనిపిస్తుంది.

"నాకు ఏదైనా చెయ్యాలని ఉందండీ! ఇంట్లో పరమబోరుగా ఉంది." అనే వనితల్ని ఈనాడు చూస్తూనే ఉన్నాం. వాళ్ళంతా 'సోషల్ వర్క్ చేస్తాం' అని బయలుదేరుతున్నారు.

ఒక సంస్థ స్థాపిస్తున్నామని రిజిస్ట్రేషన్ చేయించడానికి ముద్దుగా ఓ పేరు పెట్టి అక్కడి నుంచి మీటింగ్‌లు, ఫొటోలు, వార్తలు, ప్రచారాలు చేస్తున్నారు.

... మంచిదే! ఎక్కడి నుంచి మొదలుపెట్టి, ఎక్కడికి వెళ్లాలో కూడా ఆలోచించరు. మేము 'సోషల్ వర్క్ చేస్తున్నామండీ!' అంటారు.

ఈరోజుల్లో 'సోషల్ వర్క్' ఒక ఫ్యాషన్ పెరేడ్‌లా అయింది తప్ప- మనసులో జాలీ, దయా, సాటివారి బాగోగులు చూసే శ్రద్ధ నిజంగా ఎంతమందికి ఉన్నాయి?

పల్లెల్లో చాలామంది నిత్యం ఒకళ్ళకి ఒకళ్ళు ఎన్నో సహాయ కార్యక్రమాలు అందించుకుంటున్నారు.

రోగాలు వస్తే- సేవలు చేసుకుంటున్నారు.

పెరట్లో పండించుకున్న కూరగాయలు ఇరుగుపొరుగుకి పంచుకుంటున్నారు.

పురుళ్ళకీ, పెళ్ళిళ్లకీ చేయూత నిచ్చుకుంటున్నారు.

పేదరికాన్ని ధైర్యంగా ఎదుర్కొంటున్నారు.

అయితే- వాళ్ళ అమాయకత్వం, అజ్ఞానాన్ని పెద్దలనబడే ధనికులు, చదువుకున్నవాళ్ళు పెట్టుబడిగా పెట్టుకుని వీళ్ళు బాగుపడుతున్నారు. కనుక- ఆ పల్లెవాసులకి చదువు, ఆలోచనాసరళి నేర్పటానికి పాటుపడాలి.

అంతేగానీ- మీ సేవలు వాళ్ళకి అంత అవసరం లేవు. వాళ్ళు స్వయంగా పాటుపడగల ధైర్యస్థులు! వాళ్ళ పనులు వాళ్ళు చేసుకోగల చురుకుతనం గలవాళ్ళు!

మరి.. మన సోషల్ వర్కర్సో..?

పనిమనిషిగానీ, వంటమనిషిగానీ రాకపోతే గిలగిలలాడిపోతారు. మురికివాడల కెళ్లి సేవలు అందించామని చెప్తే... ఎలా ఉంటుంది?

కొన్ని వందల సంస్థలు ఉన్నాయి... ఆకాశంలో చుక్కల్లాగా! కొన్ని వేలమంది పల్లెవాసులకి- ఒక్కొక్కరు పదిమందికి చేయూత నివ్వగలిగినా దేశం బాగుపడేది ఎప్పుడో! కానీ, అన్ని రంగాలు ఎలా పైపైన మెరుగులు చూసి లాభం పొందుతున్నారో... ఈనాటి ఈ సంస్థలూ అంతే! లేకపోతే- చేస్తున్న ప్రతిదానికి ప్రచారం ఎందుకు? వేదికలెందుకు?

నిజానికి ఎవరు మేలు పొందారో- వారు వచ్చి లేదా వారిచేత మేలు చేసినవాళ్ళకి గౌరవం జరిపించాలి గానీ- మనకి మనమే (సంఘ సేవకులకి సంఘసభ్యులు) సన్మానాలు చేసుకోవటం ఏమిటీ? ఇదా సమాజ సేవ? ఏదీ సమాజం బాగుపడ్తోందా?

అందుకే... చుక్కలన్ని సంస్థలున్నా- వెన్నెలలాంటి మేలు సున్నాయే!



# అడగనిదే అమ్మైనా పెట్టదు!

... అనేవారు. అమ్మమాట లాంటిదే చట్టాలు కూడ! సమాజంలో ప్రజలందరికి న్యాయం జరగాలనే అనేక చట్టాలు ప్రవేశపెట్టారు.

తెలియనివాళ్ళకి తెలియచేయాలని కూడా ఉద్ఘాటిస్తున్నారు. బాగానే ఉంది. కానీ, అడగటం మాట అటుంచి- అరచి గీపెట్టినా.., ఆఫీసుల చుట్టూ ప్రదక్షిణాలు చేసినా- కావాల్సిన పనులు నెరవేరటం లేదు.

ఈమధ్య ఒక గృహిణి- భర్త మరణించాక తనకి న్యాయంగా రావల్సిన ఫించన్ కోసం అప్లికేషన్లు పెట్టుకుంటే... పట్టించుకున్న వాళ్ళు లేక... ఎలా ప్రాధేయపడాలో, ఎలా తిరగాలో తెలియక- ఆర్థిక పరిస్థితిని తట్టుకోలేక- పోషించేవారు లేక- గత్యంతరం లేని పరిస్థితులలో ఆమె ఆత్మహత్య చేసుకుందిట!!

'అమ్మా... అన్నం పెట్టమ్మా! ఆకలేస్తోంది!' అని ఇంట్లో పిల్లలడగటం, 'అమ్మా... ధర్మం చేయి తల్లీ!' అని వీధిలో భిక్షులు అడగటంకంటే... ఈ ఆఫీసులో అడుక్కోవటం మరీ అన్యాయమైపోతున్న రోజులివి!

మనిషి మరణిస్తే- ఆ బాధ, బెంగ ఎటూ తప్పవు. కాగా... మిగిలిన జీవితం గడవటానికి న్యాయంగా తనకి రావాల్సిన డబ్బు రాకపోతే ఎలా బ్రతుకుతారూ?!

చట్టాలుంటాయి!

కానీ, సవ్యంగా అమలుజరగవు.

అడగటం (అప్లయ్ చేయడం) కాదు- 'అడుక్కుం'టున్నట్టు తిరిగినా న్యాయం జరగని ఆఫీసులున్నాయి. అన్యాయానికి గురవుతున్న అభాగ్యులున్నారు! ఎంతసేపూ 'చట్టాలున్నాయి... చట్టాలున్నాయి!' అని అరవటమేకానీ- అవి సరిగా అమలు జరుగుతున్నాయా?... అన్నది ఎవరూ పట్టించుకోరు.

కళ్ళ ముందు జరుగుతున్న యదార్థం తెలుస్తున్నా- కాగితాల మీద అన్నీ సాక్ష్యాధారాలతో వ్రాసుకోవాలనటం చట్టంలోని భాగమే కావచ్చును. కానీ, ఆ కాగితాలు ఒక్కొక్కటిగా కదిలి ఫలితం కనిపించేసరికి- బ్రతికివున్న ప్రాణాలు ఘడియో, క్షణమో అనే స్థితికి చేరుకుంటున్నాయి.

ఈమధ్య ఒక కేసులో- యజమాని మరణిస్తే... అతని సంతానానికి ఉద్యోగం ఇచ్చే పరిస్థితి తల్చుకుంటే ఆశ్చర్యం వేస్తుంది.

రెండు మూడు సంవత్సరాలు జరిగాక ఒక ఉద్యోగం ఇస్తూ- ఇంట్లో మరెవరూ ఉద్యోగం చేయటం లేదని హామీపత్రం లాంటిది, లేదా ఎవరైనా గజిటెడ్ ఆఫీసర్ సంతకంతో ధృవీకరణ పత్రం లాంటిది కోరారు... సదరు ప్రభుత్వ కార్యాలయ పెద్దలు!

ఔరా..! ఇంకెవరైనా ఉద్యోగం చేస్తే- అంటే... ఆధారం ఉంటే ఉద్యోగం ఇవ్వరన్నమాట!

మరి.., ఎవరూ ఉద్యోగం చేయటం లేదనుకుందాం... ఎలా బ్రతికి ఉన్నారనుకోవాలి? అంటే... బ్రతికి ఉండకూడదనా?

'వాళ్ళు బ్రతికివుంటే... ఉద్యోగం ఇస్తాం' అనేది తర్వాత తాఖీదు కాబోలు!

చట్టాలనేవి మనుషులకి ఉపయోగకరంగా న్యాయరక్షణ చేసేవిగా ఉండాలిగానీ- డొంక తిరుగుడుగా, కాలికి వేస్తే మెడకీ-మెడకి వేస్తే కాలికీ చుట్టుకుని అప్లైదారులని ఎలాగో ఒకలాగ ఏడిపించాలనా?!

ఒక్కొక్క ఫైలు కాగితం మీద అధికారుల సంతకాలు అయి బయటపడేసరికి- 'అడగటం' కాదు.., 'అడుక్కుతినే' పరిస్థితి రాకుండా- ఏలిన వారు (ప్రభుత్వం వారు) అభ్యర్థుల్ని ఆదుకుంటే- ఎంతైనా బాగుంటుంది!

కనీసం, మనిషి మరణించినవారికైనా సానుభూతితో వారి కుటుంబాలకి సత్వర ఫలితాలు వచ్చేలా చూడాలి!



# ఇంటికి బంధువులు వస్తున్నారు!

తస్మాత్ జాగ్రత్త!

- అనుకోవలసిన దురదృష్టం కొన్ని సమయాల్లో కొందరికి తటస్థపడుతుంది. అసలు ఎవరికైనా బంధువులు వస్తున్నారంటే- పెద్దలైనా, చిన్నలైనా సంతోషపడ్తారు.

ఎల్లకాలం కలిసి ఉండరు కనుక, ఎప్పుడైనా ఇంటికి వచ్చే చుట్టాలకోసం ఎదురుచూసి అప్యాయత ప్రకటించేవారు.

పెరట్లో చెట్టు మీదో, బావి గట్టు మీదో కాకి అరిస్తే- 'ఇవాళ మా ఇంటికి చుట్టాలు వస్తేగెంతనా?'... అని పిల్లలు అరిచేవారు. దొడ్లో కాకి అరుస్తుందంటే- ఇంటికి చుట్టాలు వస్తారని పెద్దలూ నమ్మేవారు.

కానీ, ఈరోజుల్లో ఇంటికి బంధువులు వస్తున్నారంటే భయపడాల్సివస్తోంది... కొందరి ఇళ్లలో!

వచ్చిన చుట్టాలు ఇంట్లోకి రాగానే-

"ఏమ్మా... బాగున్నారా?"తో ప్రారంభించి- "చూడమ్మా... చిక్కటి కాఫీ ముందు ఇయ్యమ్మా! వెధవ ప్రయాణంలో దారిపొడుగునా నీళ్లకాఫీలే తప్ప రుచీ పచీ లేదు" అని పురమాయిస్తారు. ఇంట్లో కాఫీపొడి ఉందా... లేదా? పాలున్నాయా... లేవా? అన్న సందేహం వాళ్ళకి రాదు.

"ఏమోయ్... అబ్బాయ్! షేవింగ్ సెట్టు ఇలా పట్రా!" అని తమ దగ్గర అదికూడా లేదని నిరూపిస్తారు.

వేడినీళ్లు- ఇస్త్రీ తువ్వాలు- కొత్త సబ్బు కోరుతూ... వంటకాల్లో కారాలు ఎక్కువ వేయవద్దనీ, "ఈ నెయ్యి ఇంత కంపుగా ఉందేమిటమ్మా? అబ్బ... బొత్తిగా బాగులేదు

సుమా!" అని విమర్శిస్తూ- 'పాలు ఎన్ని ప్యాకెట్లు తీసుకుంటున్నారు?' అని ఆరా తీసి, "రాత్రి నాకు ఓ చిన్నగ్లాసు పాలు తాగే అలవాటు ఉందమ్మా!" అని వెల్లడించేస్తారు.

అప్పడాలు, వడియాలు వేయిస్తే భేషుగ్గా ఉంటుందని సలహాతోపాటు- రాత్రి కాళ్లకి మర్దనా చేసుకునేందుకు కొబ్బరి నూనె ఇయ్యమని అడిగి తీసుకుంటారు.

అందరూ ఇలాంటి బంధువులు అని చెప్పటం కాదు కానీ, ఈ రకం చుట్టాలు ఉన్నారని మాత్రం ఒప్పుకోవాల్సిందే!

వంటకాల విషయంలోనే కాదు.., పిల్లల చదువుల విషయంలో కూడా కలగచేసుకుని-

"ఏమిట్రా... రాత్రి అంత త్వరగా పడుకున్నాడు మీ అబ్బాయి? అబ్బే... బొత్తిగా నీ భయం లేదురా వాడికి! చదువు మీద శ్రద్ధ లే" దని విమర్శించి-

అంతటితో ఆగక.., వాళ్ళ చదువుల మీద- వాళ్ళ తెలివితేటల మీద ప్రశ్నాపత్రాలు ఇవ్వటం మొదలెట్టారు. "ఫలానా చోట ఏం జరుగుతోంది? కాళిదాసు రచనలేమిటి?" అని యక్షప్రశ్నలు వేస్తారు.

ఈ బాధలు పడలేక ఆడపిల్లలు- ఈ చుట్టాలు వెళ్లిపోయేంతవరకు- ఫ్రెండ్స్ దగ్గరికో, సినిమాలకో పోయి బయటే కాలక్షేపం చేయాలనుకుంటారు.

బంధువులనే వాళ్ళు- బాంధవ్యాన్ని గట్టిపరచి అనురాగాన్నీ, ఆప్యాయతనీ పంచి ఇవ్వాలి. మన ఆతిథ్యం వారికీ, వారి అనుబంధం మనకీ తృప్తినివ్వాలి. అటువంటివారే బంధువులు!

కొందరు బంధువులు అలాగే ఉంటారు. వారు తిరిగి వెళ్లిపోతూ ఉంటే- పిల్లలు, పెద్దలు కూడా వాళ్ళని వదల్లేక కన్నీరు నింపుకునే సందర్భాలు ఉంటాయి! "మళ్లీ ఎప్పుడు వస్తారు?" అని అడుగుతారు.

అంతేగానీ- చుట్టమై వచ్చి దయ్యమై బాధించినట్టు ఉంటే "బంధువులు వస్తారు జాగ్రత్త!" అన్నట్టే ఉంటుంది.

వాళ్ళు మనింటి మీదకి దాడి చేసి, క్రాస్ ఎగ్జామ్సు చేసి, అన్నిట్లో దూరిపోయి, మన మీద పెత్తనం చెలాయించాలనుకుంటే... 'బాబోయ్... బంధువులా?' అని భయమేస్తుంది.



# ఆచరించలేని ఆదర్శాలు

చాలామంది ఉపన్యాసాలు ఇచ్చేటప్పుడు- ఎంతో ఊపుగా, ఎంతో ఆవేశంగా ఆదర్శాలు, ఉపదేశాలు చెప్తూ ఉంటారు.

వినేవాళ్ళకి కూడా ఆ క్షణంలో ఉద్రేకం వచ్చి- అవకాశం ఇస్తే లేచి తనూ నాలుగు మాటలు చెప్పాలనుకుంటారు.

కానీ- తర్వాత ఆ కార్యక్రమం ముగిసాక- ఆ ఆవేశం చల్లారిపోతుంది. చెప్పినదంతా చేయలేని వారవుతారు.

విద్యావంతులం కదా... అన్నీ సాధించేయాలనుకోవడం- కేవలం అనుభవజ్ఞానం లేకపోవడం చేతనే!

అనుభవం అనేది- మనిషికి వివేకం నేర్పుతుంది. అందుకే అనుభవజ్ఞులైన మన పెద్దవాళ్ళు- మనం ప్రగల్భాలు పలుకుతూ ఉంటే నవ్వి ఊరుకుంటారు.

వయస్సు వచ్చిన ఆడపిల్ల- పెళ్ళికి ముందు ఎన్నో షరతులు, హెచ్చరికలు చేస్తుంది. ఇక... పెళ్ళి కుదిరి, ఆ వరుడితో కొద్దిగా పరిచయం అయి, మాట్లాడుకోవడం జరగగానే- ఒక్కొక్క షరతే చెరిపేసుకుంటూ హెచ్చరికలు అన్నీ మరిచిపోతుంది.

ఇందుకు ముఖ్యకారణం ఏమిటంటే..?

అసలు 'వ్యక్తిత్వం' అనేది స్వతఃసిద్ధంగా రావాలి. అప్పుడు పరిస్థితులు ఎదురుతిరిగినా- మనోధైర్యంతో అనుకున్నది సాధించగలుగుతారు.

కానీ, 'వ్యక్తిత్వం' లేకుండా వేదికల మీద ఉపన్యాసాలు, చర్చలు విని ఊగిపోతే- అవి నిజజీవితంలో నిలవవు!

చదువుకున్న అమ్మాయి తన పెళ్ళిచూపుల్లో- నిజంగా వ్యక్తిత్వమే ఉంటే- అతనితో మాట్లాడే అవకాశం కలిగినప్పుడు- తమ ఇంటి స్థితిగతులు చెప్పి- సాధ్యమైనంతవరకు పుట్టింటివారికి బరువు తగ్గించాలని ప్రయత్నిస్తుంది.

కానీ-

ఈనాటి యువతుల్లో ఈ ప్రయత్నం సన్నగిల్లి- మాట్లాడుకునే అవకాశం కలిగితే- అభిరుచులు, షాపింగ్‌లు, సినిమాలు, ఫోటోలు... ఇలాంటి సరదాలు పడుతున్నారు. దానివల్ల- పుట్టింటివారికి మరికాస్త ఖర్చులు పెరిగి అల్లుడికి పెళ్ళి ముందు నుంచే మర్యాదలు చేయాల్సివస్తోంది.

ఇక పెళ్ళయ్యాక-

అమ్మాయి కోరక మీద అల్లుడుగారు సెలవు పొడిగించుకుని అత్తవారింట్లో తిష్టవేయటం జరుగుతోంది! ఆ తర్వాత- తోడికోడళ్లతో సమానంగా ఉండాలని పుట్టింటి నుంచి కావల్సినవన్నీ కొనిపించుకుని వెళ్లటమూ తప్పడం లేదు.

ఇదెక్కడి వ్యక్తిత్వం..?

ఈమధ్య ఉద్యోగం చేస్తున్న అమ్మాయికి పెళ్ళి కుదిరింది. మొదట ఆ అమ్మాయి- పెళ్ళే చేసుకోనన్న పట్టుదల సడలించుకుని ఒప్పుకుంది.

ఇక ఆ తర్వాత- వాళ్ళు కోరినవన్నీ పుట్టింటివాళ్ళు ఇవ్వవలసిందే... అన్నట్టుగా ముభావంగా ఊరుకుని- బంగారం దగ్గర్నుంచి తనకు రావల్సినవన్నీ తల్లిని అడిగి మరీ తీసుకెళ్లింది.

అదంతా సరే- పెళ్ళి కుదరగానే చేస్తున్న ఉద్యోగం మానేసింది. కనీసం పెళ్ళి అయ్యేంతవరకైనా తల్లిదండ్రులకి సహాయపడలేదు.

అందుకు అసలుకారణం-

ఆ అబ్బాయికి ఉద్యోగం చేయడం ఇష్టం లేదుట! అందుకని పెళ్ళికి ముందే మానేసింది.

ఇదీ... ఈనాటి యువతుల వ్యక్తిత్వం!

ఇలాంటి వ్యక్తిత్వం గలవారు- ఎన్నో ఆదర్శాలని గురించి మాట్లాడితే?? వినేవాళ్ళకీ, చూసేవాళ్ళకీ ఏమనిపిస్తుంది??

అందుకే-

ఆచరించలేని ఆదర్శాలు వల్లించకూడదు. అలాగే మహిళామణులు కూడా కట్నాల విషయంలో వృథాగా ఉపన్యాసం ఇవ్వకూడదు.



# ముదురుతున్న నాగరీకత!

ఒకప్పుడు అబల అంటే- అస్వతంత్రురాలనీ, పురుషాధిక్యతకి లోబడి ఉండేదనీ, వంటింట్లోనే ఆమె జీవితం మగ్గిపోతుందనీ... చెప్పుకునేవారు.

ఈనాడు- అబల... అన్నిట్లో శక్తిసామర్థ్యాలు సాధించి, స్వతంత్రం సాధించుకుంటోంది.(పూర్తిగా కాకపోయినా కొన్నిట్లో అంతే!) ఇది ఎవరైనా సంతోషించదగ్గదే!

అయితే- చదువు, ఉద్యోగం... ఆర్థిక స్వాతంత్ర్యం అమరుస్తాయనుకోనక్కరలేదు. చదువుకోకపోయినా కొందరు ధనం కలిగివుండడంతో- దాని ఆలంబనగా అధికారదర్పం చూపిస్తారు...(చూపిస్తున్నారు)

నిజానికి- విద్య, ధనం వల్ల మహిళ మానసికమైన విజ్ఞత సంపాదించుకోగల్గితే- దానిని సద్వినియోగం చేసుకుంటే- అది నిజమైన స్వాతంత్ర్యం! అంతేగానీ, స్వాతంత్ర్యం అనేది అధికారం- అహంకారం చూపించేది కాదు.

ఈరోజుల్లో వివాహపు తంతులో స్త్రీలు తలవొంచి మోసపోతున్నారనీ- ఇక్కట్లు పడుతున్నారనీ చాలాచోట్ల వింటున్నాం. కానీ, కొన్నిచోట్ల స్త్రీలే వివాహపు తంతుని అపహాస్యంపాలు చేస్తున్నారన్నది కూడా గమనించాలి.

విద్యావతి అయి మహిళ వివాహమై అత్తవారింటికి రాగానే, ఇక అత్తింట్లో పోరాటం కోసం సిద్ధం కావాలా?

ఈ ఉదంతం తెల్పే సంఘటనలు వింటే మనకే ఆశ్చర్యం కలుగుతుంది.

ఒక చదువుకున్న కోడలు- అత్తవారింటికి రాగానే నవల ఒకటి తీసుకుని గదిలో మంచం మీద కూర్చుని చదువుకోవటం ప్రారంభించిందట!

అత్తగారు పాపం... ఎదురుచూసి చూసీ- "అమ్మాయీ... మనిల్లు వచ్చేపోయే అతిథి అభ్యాగతులతో ఉంటుంది. మనం పనిపాటలు చేసుకుని, తీరుబడిగా ఉన్నప్పుడు చదువుకోవాలిగానీ- ఇలా అన్ని పనులూ వదిలేసుకుని కూర్చుంటే ఎలాగ?" అని అడిగిందట.

అంతే...

ఆ కోడలు మంచం దిగి- "అయితే అత్తగారూ... మీకు కావల్సింది పనిపాటలు చేయవలసిన కోడలన్నమాట! మరి, నన్ను చేసుకోకుండా ఉండాల్సింది! నాకు పనిరాదు, మీరు ఒక మంచి పనిమనిషిని చూసి కోడలుగా చేసుకోవల్సింది!" అందిట.

ఆ అత్తగారు తెల్లబోయి వెళ్లిపోయిందట!

తర్వాత 'భర్త'- "ఏమిటోయ్... ఈ షర్టు ఇంత మాసిపోయింది కదా- కాస్త ఉతికి వుంచలేకపోయావా?"... అని సరదాగా అడిగితే-

"మీరు ఒక చాకలిదాన్ని పెళ్ళిచేసుకుంటే బాగుండేది! ప్రతిరోజు ఇస్త్రీ మడతలు పెట్టి ఉంచేది!" అన్నదిట! ఇక... ఆ భర్త తెప్పరిల్లుకుందుకు ఆ పూటంతా పట్టిందట!

"అమ్మా కోడలా... వంటలు వచ్చునా? కొత్త రకాలు ఏమైనా నేర్చుకున్నావా? మీ అత్తగారు చేసే వంటకాలు తినితిని మొహం మొత్తుతోంది- నువ్వు గరిట అందుకోమ్మా!"... అని ఆప్యాయంగా మామగారు పలకరిస్తే-

"వంట మనిషిని చూసి మీ అబ్బాయికి పెళ్ళి చేసివుంటే బాగుండేదండీ!" అందిట. పాపం... ఆ మానవుడు దిమ్మ తిరిగిపోయి- గ్లాసుడు నీళ్లు త్రాగాడట!

ఇక- ఆడబిడ్డలుగానీ, మరదులుగానీ ఏమనడానికీ సాహసించలేక- ఏ ట్యూషను చెప్పే పంతులమ్మనో, సంగీతపు టీచరమ్మనో గుర్తుచేస్తుందనే భయంతో అసలు మాట్లాడటమే తగ్గించేశారుట!

ఆ కోడలు- తన ప్రతిభాపాటవాలు బాగా రాణించేసుకుని పుట్టింట్లో గొప్పగా చెప్పుకుని- స్వాతంత్ర్యం ఎలా సంపాదించుకోవాలో నాగరీకత నేర్చుకున్న యువతిగా తను ఎలా అత్తింట్లో వాళ్ళ నోరు మూయించిందో చెప్పుకుందట!

ఆ తల్లిదండ్రులు తలలు పట్టుకుని- "అయ్యో... ఇదా నాగరీకత? కాలేజీ డిబేట్లలోనూ, ఉపన్యాస వేదికల మీదా ఇచ్చే వ్యాఖ్యానాలు నిజజీవితంలో కూడా పలుకుతారా?" అని బాధపడి- ముదురుతున్న నాగరీకత ఇలా వెర్రితలలు వేస్తోందని విచారించారు.

ఒక పనిమనిషి + చాకలి + వంటమనిషి + ఆయా + అనురాగమూర్తి + తల్లి + చాలా కలిపితేనే ఇల్లాలు!! అంతేగానీ- సర్టిఫికేట్లు + ఉపన్యాసాలు + పొగరు + డబ్బు + బద్ధకం... లాంటివి కావని తెలుసుకుంటే- నాగరీకత నగుబాటు కాదు.



# అనర్థాలకి మూలం?!

నగరం నడిరోడ్డు మీద- అటు బస్సు స్టాపు, ఇటు ఆటోలు... మధ్య నాలుగు రోడ్ల కూడలిలో కానిస్టేబుల్ నిల్చుని- వచ్చేపోయే ట్రాఫిక్‌ని కంట్రోల్ చేస్తున్న దృశ్యాలు మనం రోజూ చూస్తూనే ఉన్నాం.

ఆ సమయంలో కాలేజీలకి వెళ్లే విద్యార్థులు, ఉద్యోగస్తులు, స్కూలు పిల్లలు, వ్యాపారస్తులు... రద్దీగా రోడ్డంతా గందరగోళంగా ఉంటుంది కదా?

అయితే- అంత రద్దీలోనూ వెనకాముందూ చూసుకోకుండా ఆగి తదేకంగా చూస్తూ నిలబడిపోయే జనం ఉంటున్నారు. ఆ జనంలో యువకులు, నడివయస్సు పురుషులు... ఎక్కువ!

ఇంతకీ ఆ చూసేది- ఒక బోర్డుని!

అది కొత్తగా విడుదలైన సినిమా బోర్డు!

మన ఇంట్లో గది వైశాల్యమంత సైజులో... ఓ దృశ్యం ఆ బోర్డు మీద ఉంది. ప్రేమికుల సరససల్లాపం... అందులో బాగా ఎక్స్‌పోజ్ చేసి, ఆ పక్కనే 'A' అనే అక్షరం కూడా వేసి ఉంచారు.

అంతేకాదు.., అంటే 'పెద్దలకు మాత్రమే'... అని రాసి మరీ ఉంచారు.

అంటే..?

పెద్దలు మాత్రమే చూడదగ్గ సినిమా.., అందులో ఓ శృంగార సన్నివేశం బాగా కొట్టవచ్చేలాగ చిత్రించి, నాలుగురోడ్ల కూడలిలో పెట్టి... 'పిల్లలూ... మీరు మాత్రం చూడకండి! కావాలంటే ఈ బోర్డులో ఒక్క బొమ్మ మాత్రం మీకు చూపిస్తున్నాం.' అని చెప్పటమా?

లేక- 'ఇలాంటి సీన్లు ఎన్నో ఉన్నాయోచ్చ్! అబ్బా... మీరు చూస్తారా?... ఆశ! మేము మీకు చూపించమని చెప్తూ- పెద్దలకు మాత్రమే... అని రాశాం కదా?' అన్నట్టుగా రెచ్చగొట్టడమా?!

నిజంగానే చిన్నపిల్లలకి నిషేధింపబడిన సినిమా అయితే అందులో పనికిమాలిన పిచ్చి శృంగారాన్ని నడివీధుల్లో ఎందుకు చూపించాలి?... ఇది ఏ రకమైన ప్రకటన?

అలాంటి సినిమాబోర్డులు చూస్తూ- అమ్మాయిల వైపు ఓరచూపులు చూసే విద్యార్థులు, నడివయస్సువారూ (వాళ్ళూ ఏం తక్కువ తినలేదు), వెకిలితనం చేసే రౌడీలు... ఆ నడిరోడ్డు మీదే తాము హీరోలు అయిపోయినట్టు ప్రవర్తిస్తారు.

దీని విషయమై- సెన్సార్‌బోర్డువారితోనూ, వాలుపోస్టరూ-ప్రకటనలని అజమాయిషీ చేసే యాజమాన్యంవారితోనూ చర్చించినప్పుడు- వారు విషాదంగా ఓ నవ్వు నవ్వి ఊరుకుంటారు.(నిస్సహాయతని ఒప్పుకోవడం!) అదీ సంగతి!

ప్రతిచోటా ఈ 'లావాదేవీలు' ఉండటం వల్లనే- ఏ కృషీ ఫలంచటం లేదు.

తన వ్యాపారం బాగుండాలి, తనూ-తన వాళ్ళూ చల్లగా బ్రతకాలీ, మూడు భవనాలు- ఆరు కార్లు, బ్యాంక్ ఎక్కౌంట్లు వర్ధిల్లాలి... అనుకునే పెద్దలు- వాళ్ళ సుఖాల క్రింద సమాజంలో అల్లకల్లోలం సృష్టిస్తున్నారని తెలుస్తున్నా- నిమ్మకు నీరెత్తినట్టు ఉంటున్నారు.

సినిమా తీసినవాడూ, నటించినవాడూ బాగానే ఉంటున్నారు. చూసినవాడు అన్నివిధాలా నష్టపోతున్నాడు. అందులోనూ ముఖ్యంగా మధ్యతరగతివారూ, అట్టడుగు వర్గం వారూ!

ఏమిటి ఈ దురంతం?

మనిషికి ఎక్కడ బలహీనత ఉంటుందో- అక్కడ ఓడిపోతాడు!

యుక్తవయస్సులో వాళ్ళకి శృంగారం పట్ల- పేదవాడికి డబ్బు మీద మోజు సహజం! సినిమాల వల్ల ఆ గుణాలు మరింత ప్రకోపించి అనర్ధకాలకి దారితీస్తున్నాయి!

ఈమధ్య వచ్చే 'సాహిత్య ప్రభావం' కూడా అలాగే ఉంటోంది.

కథల్లో, నవలల్లో- నిజజీవితంలో తీరని సరదాలన్నీ తీరిపోయేలాగ వ్రాస్తున్న రచనలు చదివి- పెద్దల దగ్గర్నుంచీ పిల్లల వరకు తన్మయావస్థలో పడిపోతున్నారు.

మానసికంగా మనుషులని పతనావస్థకి చేరుస్తున్న సినిమాలు, రచనలు మహానేరం చేస్తున్నాయి.



# విద్య యొసగు- వినయం!

అవును... అది ఒకప్పుడు!

ఇప్పుడు- విద్య ఇచ్చేది... ఉద్యోగం, అహంకారం! చదువుకుంటే నమ్రత వస్తుందనీ, విజ్ఞానం పెరుగుతుందనీ అనుకునేవారు.

కానీ, ఈనాడు చాలామంది ఒక డిగ్రీయో, పోస్టుగ్రాడ్యుయేట్, లేదా ఏవైనా ప్రత్యేక కోర్సులు చదివితే- ఇంక వాళ్ళని పలకరించలేకపోతున్నాం.

బ్యాగులు తగిలించుకొని, చేతిమీద తెల్లకోటు వేసుకొని వెళుతున్న అమ్మాయిలు (అబ్బాయిలైనా సరే!) మామూలుగా నడవరు. (అందరూ కాకపోవచ్చును) పక్కవాళ్ళు మనుషులు కారన్నట్టుగా... చూడరు. ఎవరైనా పల్లెటూరి అమాయకురాలు గానీ, బస్తీ శ్రామికజాతి స్త్రీకానీ- "అమ్మా... గీ పత్తాలో ఉన్న బజారుకి పోవాలంటే ఏ బస్సు ఎక్కాలమ్మా?" అని అడిగితే-

అదేదో యోగనిద్ర నుంచి మేల్కొని ఈ ప్రపంచాన్ని కొత్తగా ఇప్పుడే చూస్తున్నట్టుగా చూసి- "అదిగో... ఆ ముసలాయన్ని అడుగు!" అంటూ దూరంగా నిల్చున్న ఒకాయన్ని చూపిస్తారు.

అంటే... ఆ బస్సు తెలియక కాదు.., ఆ మనిషికి చెప్పవలసిన వాళ్ళు అలాంటి ముసలాళ్ళనే భావం! తనబోటి యువతి- 'అప్టరాల్ ఈ బడుగువర్గం మనిషి'తో మాట్లాడమేమిటీ... అనే తత్వం! రేపు సమాజంలో ఇలాంటి అందరి మధ్య తను తిరగాలనీ, తను నేరుస్తున్న విద్య యొక్క ఆశయం అదేననీ గ్రహించరు.

డాక్టర్లనే కాదు.., ఇంజనీర్లు, లాయర్లు, పి.హెచ్.డి.లు, లెక్చరర్లు, బ్యాంక్ ఉద్యోగినులు, పోస్టాఫీసులో ఉద్యోగినులు, పేరున్న కంపెనీలలో ఉద్యోగాలు చేసేవారూ, చాలావరకు తాము నేర్చిన విద్య యొక్క ఆశయాన్ని మరచిపోతారు. చేస్తున్న ఉద్యోగం చుట్టూ ఒక పరిధి సృష్టించుకుని- అందులో తనకి తనే ఒక ప్రత్యేకతని నిలుపుకుని- దర్పం ఒలకబోస్తారు.

నిజం చెప్తే నిష్ఠూరంగానే ఉండవచ్చును. కానీ, సమాజంలో ఎదుర్కొంటున్న అనేక అనుభవాల దృష్ట్యా ఇలాంటి సత్యాలు వెలికితీయక తప్పదు. బీదవాళ్ళని చూసినా, చదువుకోనివాళ్ళని చూసినా, వృద్ధుల్ని చూసినా... వీళ్ళకి తిరస్కారభావం!

విద్యావతి అయినవాళ్ళు ఇలా ప్రవర్తించవచ్చునా?!

పేదరికం అంటువ్యాధి కాదే!? చదువుకోకపోవటం నేరం కాదే?! ముసలితనం మనకీ తప్పదు కదా!... ఎందుకు ఆలోచించరు??

చాలామందికి చదువుకునేసరికి ఉన్నబుద్ధి ఊడిపోతున్నట్లు ప్రవర్తిస్తున్నారు.

దానికితోడు- వయస్సు, డబ్బు... మరీ మూర్ఖతని సంతరించి పెట్టున్నాయి. డాక్టరన్న వాడికి (ఆమెకి) ఎంత ఓర్మి ఉండాలీ?! తనేదో గొప్ప ఫోజు పెట్టి- వైద్యం తక్కువ, కసురుకోవటం ఎక్కువ.., ఇంకా అనేక అన్యాయాలు... ఇలావుంది పరిస్థితి!

ఇక, ఓసారి చర్చాగోష్ఠిలో పాల్గొన్నవాళ్ళలో- ఓ కాబోతున్న లాయరమ్మ మిగతావాళ్ళలో ఉన్న గృహిణిని మాటిమాటికీ ఖండించటం, 'ఆమెకేం తెలుసు? మాలాంటి లాయర్లు, డాక్టర్ల చర్చలో ఈవిడ పాల్గొనడమేమిటీ...' అన్నట్టుగా చూడటం... నిజంగా ఎంత అసభ్యంగా ప్రవర్తించిందో! ఇది చదువుకున్నందుకు అంటుకున్న అహంకారమా?

మరొకసారి- జనరల్ పోస్టాఫీసులో ఏదో డ్రాఫ్ట్ తాలూకు డబ్బు కట్టడానికి ఒకాయన వెళ్తే- సమయం అయిపోతోందన్న తొందరలో ఆయన కంగారుగా పడిపోతే- అక్కడ ఉన్న ఉద్యోగిని 'పూర్ ఫెలో!' అని పక్కామెతో కలిసి నవ్వితే... ఆయనకెలా ఉంటుందీ..?!

మనకీ వృద్ధాప్యం వస్తుంది...

మనకీ తొందర పనులు రావచ్చును...

మనం కూడా జీవితంలో ఎప్పుడైనా ఎదుటివాళ్ళ చేత హేళన చేయబడతామేమో! అప్పుడు- ఒక్కసారి మన పాత స్మృతి గుర్తుకు తెచ్చుకోవాలి.

ఏమైనా కానీ- ఈనాడు సమాజంలో విద్య... వినయం కాదుగదా- దురహంకారం పెంచి, వివేకం నశింపజేస్తోందా? అని బాధ కలుగుతోంది.

ఇది మాత్రం ప్రగతి ధోరణి కాదు.., క్షంతవ్యమూ కాదు.



# ఆదివారం వస్తే... అవస్థే!

ప్రజోపకారం కోసం ప్రభుత్వం ఏవేవో కొన్ని పద్ధతులు, నిబంధనలు ప్రవేశపెట్టూ ఉంటుంది... మంచిదే!

ప్రభుత్వం అన్నాక మరి ప్రజల బాగోగులు చూడాల్సిందే!

అయితే- ఈ ప్రవేశపెట్టుతున్న నియమాలు ప్రజలకి ఎంతవరకు ఉపయోగ పడ్తున్నాయి?, ఉపయోగపడ్తాయి?... అన్న పరిశీలన కూడా ప్రభుత్వంవారు గనుక చేస్తే- ప్రజలు సుఖపడిపోతారు!

ముఖ్యంగా... మహానగరాల్లో (వన్ వే ట్రాఫిక్‌లు) ఒకవైపు నుంచి ప్రయాణించటం లేకుండా ప్రజలు సురక్షితంగా వెళ్లగలరని వారి ఉద్దేశం!

అయితే దీనివల్ల ఐదునిమిషాల్లో అవతలి వీధికి వెళ్లగలవారు- చుట్టూ తిరిగి వెళ్లేసరికి మరొక పదినిమిషాలు ఎక్కువ సమయం పట్టుంది. ఇక వాహనాల వాళ్ళు గిరాకీ పెంచి అడుగుతారు. మామూలు ధరకన్నా మరొక రూపాయి వరకు అదనపు ఛార్జీలు అవుతూ ఉంటాయి.

ఇవన్నీ అలావుంచి- ఆ రోడ్డు మీద ఎవరికైనా అత్యవసరం వచ్చి ఆటోగానీ, రిక్షాగానీ దొరుకుతుందేమో... అని చూస్తే- ఒక్కటీ కనిపించదు. ఎందుకంటే ఆ దారిన అందరూ వెళ్లటమేగానీ, రెండోవైపు నుంచి రావటం నిషేధం గనుక- వెళ్లిపోతుండే వాహనాలే తప్ప- వచ్చే వాహనాలు దొరకవు. అందుకని ఆ రోడ్డు మధ్యలో ఉండేవారు ఆ చివరకో, ఈ చివరకో వెళ్లాల్సిందే! నీ ముక్కేదంటే- తల చుట్టూ తిప్పి చూపించినట్టు- ఇంటికి ఒక ఆటోగానీ, రిక్షాగానీ తెప్పించుకోవాలంటే చాలా కష్టం!

ఇక... అమధ్య పెట్రోల్ పొదుపు నిమిత్తం- ఆదివారం మధ్యాహ్నం నుంచి పెట్రోల్ బంకులు మూసివేసే కొత్త పద్ధతి ప్రవేశపెట్టారు. ఉద్దేశం మంచిదే! కానీ, ఆచరణలో ఆదివారం రోజున ఎంత దుర్భరంగా ఉంటుందో అనుభవించే వాళ్ళకీ... అందునా- ప్రత్యేకించి ఆడవాళ్ళకి తెలుసు.

ఉద్యోగస్తులైన వాళ్ళు- ఒక్క ఆదివారంనాడు మాత్రమే సరదాలు, సంబరాలు జరుపుకోవటానికి వీలుంటుంది.

మిత్రురాళ్ళతోటో, కుటుంబంతోటో, లేదా- ఇంటికి వచ్చిన బంధువులతోనో బయటికి వెళ్లాలంటే... ఒక్క ఆటోవాడూ వస్తాననడు. దరిదాపుల్లో అయితే వస్తామంటారు. లేకపోతే- పెట్రోల్ చాలదు, రామని చెప్తారు.

స్వంత వాహనాల వాళ్ళకైనా అదే బాధ! ఒకవేళ అవసరం వచ్చి ఆదివారం రెండు మూడుసార్లు బయటికి వెళ్లవలసివచ్చినా- కష్టమే! పోతే- కొంతమంది ఉద్యోగస్థులు (కంపెనీ వాళ్ళు) ఆదివారాలు కూడా ఆఫీసుకి వెళ్లాలి కదా! వెళ్లేటప్పుడు ఎలాగో వెళ్లిపోతారు. ఇక వచ్చేటప్పుడు- కంపెనీ సదుపాయాలు లేకపోతే... ఒక్క బస్సూ దొరకదు. చీకటైపోతూ ఉంటుంది. ఆదివారం గనుక షాపులు చాలావరకు మూసివుంటాయి! రోడ్డు మీద జనసంచారం తక్కువ! ఆటోవాళ్ళు రామంటారు. ఇక... ఆ అవస్థ చెప్పనలవి కాదు. 'భగవంతుడా... ఈరోజు ఇంటికి క్షేమంగా చేరితే ఇక ఈ ఉద్యోగం చేయను తండ్రీ!' అని ఇంచుమించు ప్రతి మహిళా మనసులో వేడుకుంటుందనే అనుకోవాలి. కళ్ళనీళ్ల పర్యంతంగా చూస్తూ 'ఒక ఆటో ఐనా దొరకదా!' అన్న ఆశతో నిలిచే మహిళలు ఉన్నారు. ఇది కల్పన కాదు. నిత్యజీవితంలో జరుగుతున్న పరమసత్యం!

రెట్టింపు ఛార్జీ ఇస్తామన్నా (మాఫ్ కర్నా మేడం... పెట్రోల్ నహీ హై!) 'లేదమ్మా... పెట్రోల్ లేదు' అనేస్తున్నారు.

ఎలాగో నానా తంటాలు పడి ఇల్లు చేరుకున్నాక- మర్నాడు- 'క్షమించు భగవంతుడా... ఉద్యోగం మానేయలేను. మా పరిస్థితి నీకు తెలియదా? నీకు కోటిదండాలు! మళ్లీ ఆదివారంనాడు కూడా నన్ను ఇలాగే క్షేమంగా ఇల్లు చేర్చు' అని ఒప్పందాన్ని రద్దు చేసుకునే వనితలు ఉన్నా, లేకున్నా- మళ్లీ ఆదివారం వచ్చిందంటే అవస్థ పడే మహిళలు మాత్రం ఉంటున్నారు.

మగవారైతే- అర్ధరాత్రిదాక బస్సుకోసం ఆగి రాగలరు. లేదా నడిచైనా చేరగలరు. ఆడవాళ్ళో?! అంత సాహసం చేయలేకపోతున్నారు.

అందుకని ప్రభుత్వంవారు కొన్ని నిర్ణయాలు బాగా ఆలోచించి చేస్తే ప్రజలకి కొంత మేలు జరుగుతుంది. మెడికల్ షాపులకన్నా అత్యవసరమైన పెట్రోల్‌ను నియంత్రించడమో.., మాటిమాటికీ పెట్రోల్ ధరలు పెంచుకుంటూపోవటమో చేస్తే... మరి, ఇక ఆ అవస్థ చెప్పనలవి కాదు. ఏమంటారు?!



# అవకాశవాదులు

"బాగున్నారా..? ఏదీ... ఈమధ్య మనం ఎప్పుడూ కలుసుకోవటమే లేదు. ఒకరి సంగతి ఒకరికి ఎలా తెలుస్తుందీ?" అంటూ పాతకాలం నాటి మిత్రురాలు పనిగట్టుకుని వచ్చి పలకరించిందంటే-

తప్పదు... ఏదో కిటుకు ఉండే ఉంటుంది!!

కొన్ని సంవత్సరాలుగా మనతో పరిచయం ఉన్నా, తప్పుకుని తిరుగుతూ- అనుకోకుండా అకస్మాత్తుగా ఒకరోజు ఊడిపడితే అది మన మీద అప్యాయతని ఎలా అనుకోగలం?

పైగా... "ఏమిటిలా చిక్కిపోయారూ? జబ్బు చేసిందట కదా? విన్నాను ఎవరో చెప్తుండగా- ఏదీ... ఈ ఊళ్లో ఉండడం లేదు కదూ- అందుకని రాలేకపోయాను" అని చెప్తారనుకోండి.

అప్పుడు మరి- ఆశ్చర్యపడాల్సిందే! ఈ ఊళ్లో ఉన్నంతకాలం మనింటికైనా రాని మనిషి పై ఊళ్లకెళ్లి మన యోగక్షేమాలను విచారిస్తూ మనింటికి వచ్చిందా... 'ఎందుకబ్బా?' అనిపించదూ..?!

మర్యాదకి కాఫీలు, టిఫెన్లు, కబుర్లు అన్నీ చేస్తాము. అప్పుడు బయటపడ్తుంది అసలు సంగతి!

ఫలానా ఊళ్లో వాళ్ళల్లుడు- ఫలానా ఉద్యోగంలో ఉన్నాడు, అతనికి హైదరాబాదుకి ట్రాన్స్‌ఫర్ కావాలి. అమ్మాయి ఇక్కడ ఉద్యోగం చేస్తోంది కనుక ఆ 'బదిలీ' ఒక్కసారి మీరు- మీవారితో చెప్పి చేయించరా? ఎంత సంతోషం! మా అమ్మాయి ఎప్పుడూ మిమ్మల్ని తల్చుకుంటూ ఉంటుందండి. "అమ్మా... ఆ ఆంటీ ఎంత బాగా మాట్లాడతారో.., వాళ్ళ పిల్లలు ఎంత బాగా పాడతారో..." ఇంక ఇలా సాగుతుంది ఆ పొగడ్తల ప్రవాహం!

ఎన్నడో పదేళ్ల క్రితం మనం ఎప్పుడో మాట్లాడిన మాటలు వాళ్ళమ్మాయి మెచ్చుకుందని ఈవిడ చెప్తే- మనం నమ్మాలా? మన పిల్లలతో అసలు పరిచయమైనా లేని ఆ అమ్మాయి- మన పిల్లల పాట మెచ్చుకుందని ఈవిడ చెప్పడంలో ఏమిటి ఉద్దేశం? ప్రస్తుతం మన పిల్లలకి పెళ్ళిళ్లై అత్తవారింట్లో ఉంటారు. మన పిల్లల పాట మనమే మరిచిపోయే స్థితిలో ఉంటాం మనం!

ఇలా అకస్మాత్తుగా వచ్చి- మన హోదానీ, భర్త చేయవలసిన పనినీ చెప్పటం కోసం- కాలదోషం పట్టిన స్నేహాల్ని పురస్కరించుకుని వచ్చే స్నేహితురాండ్రు- నిజమైన స్నేహితులు కారు... అవకాశవాదులు! మనవల్ల లాభాన్ని ఆశించి 'ఉచ్చు'లోకి లాగటానికి పాత పరిచయాన్ని వలలా విసిరే వేటగాళ్ళు!

ఈ రకం స్నేహితులు చాలామందికి తటస్థపడుతూనే ఉంటారు. మొదట్లో... వచ్చిన పని చెప్పకపోయినా- కొన్నాళ్లు ఇలా సామరస్య భావం ప్రదర్శిస్తారు. మనం రాబోయే ప్రమాదం గుర్తించలేక- 'అబ్బో... ఎంత మంచావిడో..! పాత స్నేహం గుర్తుపెట్టుకుందే?' అనుకుంటాం. తర్వాత ఆవిడ 'వేడికోలు' తప్పకుండా జరిపించాలని నిర్ణయించుకుంటాం.

ఇదే మనలోని బలహీనత! ఇదే ఆసరాగా తీసుకుంటారు ఈ అవకాశవాదులు! ఉద్యోగాల కోసం, బదిలీల కోసం, ఆర్థిక సహాయం కోసం, టీ.వీ.లో, ఆకాశవాణిలో ఛాన్సుల కోసం, పెళ్ళి సంబంధాల కోసం- మనల్ని లోబరచుకునే స్నేహితులు... నమ్మదగ్గవారు కాదు!

మరి.., కొంతమంది ఇంకా విచిత్రంగా ఉంటారు. వాళ్ళకి మనతో అవసరమున్నంత వరకు- ఇక మన ప్రాణం, వాళ్ళ ప్రాణం ఒకే బొందిలో ఉన్నంత నమ్మకంగా మనల్ని అంటిపెట్టుకుని తిరుగుతారు. మనకి ఏదైనా ఆపద వచ్చినా, లేక- మనవల్ల ఏదైనా ఇబ్బంది కలిగినా... మనమంటే ఇక వాళ్ళకి తెలియనట్టు మసలుతారు. అంటే- ఒక బొందిలో నుంచి ప్రాణాలు విడిపోయాయనుకోవాలా?

ఈ సమాజం చాలా గమ్మత్తుగా ఉంటుంది. ఆశావాదులు, అవకాశవాదులు ఎలాగైనా బ్రతకగలరు. కానీ, నీతి-నిజాయితీ గలవారూ, మొహమాటస్థులూ, అమాయకులూ- నానా అగచాట్లూ పడుతూ, తమకి ప్రజ్ఞ ఉన్నా- ఒకరి ప్రమేయంతో బ్రతకకపోయినా- ఇతరుల పట్ల అగచాట్లు పడాల్సివస్తుంది.

నమ్మదగ్గవారినీ, నిజమైన స్నేహితుల్నీ, బంధువుల్నీ, పరిచయస్తుల్నీ మొదట్నుంచీ జాగ్రత్తగా మనం ఉంచగల్గితే?... మనకి వ్యక్తిగతమైనవీ, సంసార సంబంధమైనవీ ఎలాగో భరించవలసిందే! కనీసం ఇతరుల నుంచి పడాల్సిన అగచాట్లైనా తప్పించుకోగలం! ఏమంటారూ..?!



# రమణుల రాజకీయాలు

రాజకీయాలనగానే చాలామందికి దేశ రాజకీయాలనీ, ఎం.ఎల్.ఏ.లు... మినిస్ట్రీలనీ అనుకుంటారు.

కానీ, మన స్త్రీలు అలాంటి రాజకీయాల జోలికి ఎక్కువ వెళ్లరు. అందుకు తగిన ఓపిక లేక కొంతా, పెట్టుబడి కోసం తగిన డబ్బులేక కొంతా, శ్రద్ధ లేక కొంతా... రాజకీయాలపై మోజు చూపించటం లేదు మన వనితలు!

ఇక... 'రమణులకి ప్రత్యేకమైన రాజకీయం ఏమిటి చెప్మా?'- అనుకుంటున్నారా? అయితే వినండి-

మన స్త్రీలకి బోలెడన్ని రాజకీయ వ్యాపకాలు ఉన్నాయి. వాటికి డబ్బు అక్కర్లేదు, చదువులు అక్కర్లేదు, శ్రమపడి పని చేయనక్కర్లేదు. కావల్సిందల్లా... ఉత్సాహం, కుతూహలం! అవి చాలామందికి ఉన్నాయి.

ఇక... ఈ రాజకీయంలో ముఖ్యఉద్దేశం ఏమిటంటే-

వార్తాపత్రికల కంటే వేగంగా.., దూరదర్శన్, ఆకాశవాణి కంటే వివరంగా ఒక వార్తని ఇతరులకి చేరవేయాలి. దానివలన మనకి లాభమా, నష్టమా... అన్న ప్రశ్న కాదు. మనం చేరవేసిన కబురు వల్ల వాళ్ళిద్దరి మధ్య జరగబోయే వైరుధ్యం ఎంత బాగా రక్తి కడుతుందన్నదే- మనకి దక్కే ప్రతిఫలం!

ఈ రకమైన వ్యాపకాన్ని రాజకీయమనే ఎందుకనుకోవాలంటే... వాళ్ళు అందించే వార్త అంతటితో ఆగదు. అది చిలవలు పలువలుగా సాగుతూనే ఉంటుంది. ఒక్కొక్కప్పుడు ఆ ఎదుటి వాళ్ళిద్దరూ ఒకటై- మొదటివార్త అందించిన వాళ్ళమీదకి దండెత్తిరాగలరు.

సరిగ్గా రాజకీయాలలోనూ ఇంతే! అందుకే ఇది 'రమణుల రాజకీయం' అని చెప్పుకోవాలి.

'ఫలానా అమ్మాయికి సంబంధం చెడిపోయిందిట! ఆ చివర ఇంటి లక్ష్మి లేదూ... ఆవిడ వల్లేట!' అని ఒక కాకరపువ్వొత్తి లాంటి కబురు ఓ కమలమ్మ వెలిగిస్తుంది.

అంతే... ఆ పువ్వొత్తి సురసుర కాలుతూ లక్ష్మి మీద పడుతుంది.

ఆవిడ నుంచి, తారాజువ్వలాగ కోపం తన్నుకొచ్చి- ఆ ఫలానా అమ్మాయి వాళ్ళమ్మ మీద పడుతుంది.

ఇక ఈవిడ నుంచి మరొక బాంబు అటు పేలుతుంది!

మొత్తంమీద ఆ వాడంతా పటాకుల వంటి మాటలతో రాజకీయాలు సృష్టించుకుని.., ఎలక్షన్లంత పనిచేసి- చివరికి మొదటి గృహిణి మీద విరుచుకుపడ్తారు.

ఇలాంటివి ప్రతి వాడలో జరగకపోయినా- ప్రతి ఊళ్లో... ఏదోరకంగా జరుగుతూనే ఉంటాయి.

మధ్యాహ్నం పూట తీరుబడిగా కూర్చుని పనిలేక- ఇదిగో... ఇలాంటి కాలక్షేపం కబుర్లలా మొదలుపెట్టి- కారాలు, మిరియాలు నూరుకునేవరకు వెళుతుంటారు... కొందరు స్త్రీలు! ఎవరి కాపురాలు ఎలా ఉన్నాయో.., ఏ ఇంటి అల్లుడు గొడవ చేసాడో.., ఏ అత్తగారు కోడల్ని సరిగా చూడదో.., ఏ బావగారు- మరదల్ని ఓరచూపులు చూశాడో.., ఏ పనికిమాలిన వెధవ- ఎవరి కొంగు పట్టుకున్నాడో.., ఎవరింట్లో ఏం జరుగుతోందో... ఇవన్నీ పర్సనల్ సెక్రెట్రీల కన్నా ఎక్కువ శ్రద్ధగా గుర్తుంచుకుని వెళ్లి వాళ్ళకి చెప్పి వచ్చే రమణీమణులు- ఎంత సమయాన్ని వృధాగా పోగొట్టుకుంటున్నారో గ్రహించలేరు.

చదువుసంధ్యలు నేర్వని అమ్మలక్కలే కాదు.., ఎంతో క్వాలిఫైడ్ అయిన వనితలు కూడా ఈ ముచ్చట్ల మోజులో వాటాదారులే! కాకపోతే- వారి ధోరణి కాస్త హోదాగా ఉంటుంది.

ఎవరు ఉద్యోగం సంపాదించుకున్నారో.., ఎవరికి ప్రమోషన్ ఖాయమో.., ఎవరి భర్త డైవర్స్ ఇస్తున్నాడో.., ఎవరు కీచులాడుకుంటున్నారో.., ఏ ఆఫీసర్ చవట పని చేస్తాడో.., ఎవరికి- ఎవరి దగ్గర పలుకుబడి ఉందో... ఇత్యాది చిట్టా అంతా 'డిగ్నిఫైడ్'గా ముచ్చటించుకుంటారు. ఏదైనా రాజకీయమే! కాకపోతే- దేశ రాజకీయంలో కొంత ప్రజాశ్రేయస్సు ఉంటే... ఇంతుల రాజకీయాల్లో పాల్లు ఎక్కువ పోయి, వృధా కాలక్షేపంగా మిగులుతుంది.

తస్మాత్ రమణులూ... జాగ్రత్త! కాలం ఖర్చుచేసుకోకండి... మళ్లీ దొరకదు. వెనక్కి తిరగదు. సమాజానికి పనికి వచ్చే పని ఏదైనా చేయండి.



# మౌనమే సమాధానమా..?

ఈనాడు విద్యను గురించి పల్లెపల్లెల్లో, మారుమూల గ్రామాల్లో కూడా ప్రచారం చేయటం మనం చూస్తున్నాం, వింటున్నాం... అవసరమున్నప్పుడు మనమూ మన వంతు సహకారం అందిస్తున్నాం!

కొంతమంది చాలా తరచుగా అనే మాట ఒకటుంది-

'ఎంత చెప్పినా ఆ పల్లెవాళ్ళకి అర్థంకాదండీ... అక్షరాలు నేర్చుకున్నంత మాత్రం చేత వాళ్ళకి తెలివితేటలు ఎక్కడ పుట్టుకువస్తాయి? చదువుకున్నవాళ్ళలాగ వాళ్ళు ఆలోచించలేరు' అని గ్రామస్థులని చులకన చేయటం, సానుభూతి చూపటం కూడా జరుగుతోంది.

కానీ, ఒక్క విషయం మనం గమనించవలసి ఉంది.

చదువుకున్న ప్రతివాళ్ళూ ఆదర్శంగా ఉంటున్నారా? ఆరోగ్యంగా ఉంటున్నారా? ఆర్థికంగా బాగున్నారా?... లేదే! విద్యావంతులు కూడా అనేక రకాల సమస్యలతో సతమతమవుతున్నారు.

ఆరోగ్యసూత్రాలు గ్రామవాసులకి నేర్పే ముందు- 'వారికి మంచినీటి బావులున్నాయా..? చిన్న చెరువులున్నాయా..? ఇంటింటికీ సదుపాయాలున్నాయా..?' అని మనం చూడం! పట్నాల్లో మనకి ఉన్నన్ని సదుపాయాలు వాళ్ళకీ ఉంటే? ఆరోగ్యసూత్రాలు క్షణంలో పాటిస్తారు వాళ్ళు!

కుటుంబ నియంత్రణ గురించి చెప్పేటప్పుడు- 'నలుగురుంటే సంపాదిస్తారు కదా!' అని వాళ్ళు అడిగే ప్రశ్నలో- అజ్ఞానం కాదు.., ఆర్థిక సమస్య ఉంది. అందుకని మొదట మనం వాళ్ళ జీవన ప్రమాణాన్ని పెంచే సదుపాయాలు కలిగించి, ఆపైన ప్రచారాలు మొదలుపెట్టే సత్వర ఫలితాలిస్తాయి!

మొదట- వారిలోని న్యూనతాభావాన్ని మనం పోగొట్టగలిగితే- వాళ్ళు మన బోధ వినడానికి ఆసక్తి చూపిస్తారు.

నిజానికి- వాళ్ళు అడిగే ప్రశ్నల్లో నిలదీసే చిక్కుముడిలో మనం బయటపడి సరైన సమాధానం చెప్పగలుగుతున్నామా..?

ఒక్క గ్రామవాసులే కాదు.., మన పెద్దలు కూడా విద్య లేకనే అజ్ఞానంతో ఉండేవారనుకోవటం సమంజసం కాదు.

విద్య నేర్చుకోవలసిందే! కానీ, దానివల్ల కలిగే అదనపు లాభాలని గురించి తెలియచేయాలి కానీ- చదువుకోని వాళ్ళంతా అజ్ఞానులేననీ, చదువుకున్న వాళ్ళంతా జ్ఞానులేననీ చెప్పటం సముచితం కాదు!

ఎన్నోవిధాల మన తరం కన్నా వెనకటి తరం మంచిపనులు చేసేది- విద్యావంతులై కాదు.., స్వతః జ్ఞానంతోటే!

అయితే- ఆ తెలివికి విద్య కూడా తోడైతే మరింతగా శోభిస్తుందని తెలియచెయ్యటమే మన ఈనాటి కర్తవ్యం!

ఒకవేళ మన ముందుతరం మనకన్నా గొప్ప పనులు చేయవచ్చును. అప్పుడు ఆ తరం పిల్లలు మనని విమర్శించి దుయ్యబట్టే... మనం ఏమని చెప్తాం?

మాకు చదువురాదని చెప్తామా? కాదు... 'కాలం మార్పులో తెలివితేటలు పెరగటం, విద్యని సద్వినియోగం చేసుకోవటం ఇదే కాబోలు!' అని వింతగా చూసి సమ్మతిస్తాం!

అందుకే మన విద్యాబోధనల కోసం ప్రచారం చేసినా, చెప్పినా- వారిని అర్థంచేసుకుని, వారి సమస్యలని తీర్చి అప్పుడు మొదలుపెట్టాలి! లేకపోతే వారికి మనం- మనకి వారూ దూరమై... దగ్గరకు రావటమంటూ జరగదు.

అవునా... చెప్పండి!!



# అగచాట్లు అనేక రకాలు!

ఉద్యోగాలు ఎప్పుడైతే అవసరమయ్యాయో... ఊళ్లు తిరగాల్సిన పరిస్థితులూ ఎదురయ్యాయి.

ఉన్న ఊళ్లో ఉద్యోగాలు దొరకవు కదా?

చదివిన చదువుకి తగిన ఉద్యోగం దొరక్కపోయినా, ఏదో ఒకటి చేయాలనుకున్నా... ఎక్కడున్నవాళ్ళకి అక్కడే ఏ జాబూ దొరకడం లేదు. ఎంతో దూరాభారం కాకపోయినా- మొత్తానికి ఉన్న ఊరు వదలి వెళ్లాల్సివస్తోంది.

అటువంటప్పుడు-

వెళ్లినచోటల్లా స్వంత ఇళ్లలా, సౌకర్యాలూ దొరకవు. అద్దె ఇళ్లల్లో ఉండాలి.

ఇక అక్కడ ప్రారంభమవుతుంది... అగచాట్లపర్వంలో మొదటి అధ్యాయం!

"ఈ బాత్‌రూమ్, లావెట్రీ ఉమ్మడండీ(కామన్)... మీరు అంతసేపు జలకాలాడితే మిగతావారి గతి ఏమిటీ? పంపు పోతేనో..?" అంటుంది యజమానురాలు.

బాత్‌రూమ్‌లో పది నిమిషాలుంటే 'దాని లెక్క గంట!' అని యజమానురాలి డిక్షనరీలో ఉంటుంది.

బట్టలుతుక్కున్నా, నీళ్లు పట్టుకున్నా ఉదయం ఏడుగంటల లోపులో అయిపోవాలి. ఆ తర్వాత ఇంటివాళ్ళకి పైభాగంలో నీళ్లు కావాల్సివుంటుంది గనుక- క్రింద అద్దెకున్న వాళ్ళు నీళ్లు వాడరాదు.

గేటు తలుపు రాత్రిళ్లు వంతులవారీగా వేయాలి... అద్దెకున్నవాళ్ళు!

రాత్రి తొమ్మిదిన్నరకి తప్పనిసరిగా గేటు మూయవలసిందే! ఎవరైనా రావాల్సినవాళ్ళుంటే- ఆరోజు ఏ వాటావాళ్ళు తాళం వేస్తారో... వాళ్ళకి ముందుగానే చెప్పి ఉంచుకోవాలి!

రాత్రి టీ.వీ. కార్యక్రమాలూ, రేడియోల వాళ్ళూ తొమ్మిదయ్యేసరికి కట్టేయాలి. అది రూల్! ఆ తర్వాత చూడాలనుకున్నా, చూసేవారున్నా- మీటరు ఛార్జీ అదనంగా కట్టవలసివుంటుంది.

ఇంట్లో గోడలన్నీ సిమెంట్‌వి గనుక మేకులు దిగవు! ఇంటివారు మొదట్లో పెట్టిన మేకులూ, హుక్కులూ వాడుకోవటమేగానీ... మళ్లీ కొత్తవి కొట్టరాదు- కొట్టినా దిగవు!

ఇంటివాళ్ళ చుట్టాలూ, పక్కాలూ వస్తారు.

ఆ సమయంలో వాళ్ళకి ఇబ్బంది కలగకుండా అద్దెకున్నవాళ్ళు బట్టలు బయట ఆరేయకూడదు... ఇళ్లలోనే ఆరేసుకోవాలి!

ఇంటివాళ్ళు సభ్యత గలవాళ్ళు గనుక అద్దెకున్నవాళ్ళు ఎప్పుడూ ఇంట్లో గొడవలు, పోట్లాటలు చేయకూడదు.

మగపిల్లలుండి కాలేజీల్లో చదువుకుంటున్న వాళ్ళుంటే- ఇంటి ఆవరణలో పచార్లు చేయటం, ఈల పాడటం, కూనిరాగాలు తీయటం... పరమ నిషేధం! మరి.., ఇంటివారికి ఈడు వచ్చిన ఆడపిల్లలున్నారు!

ఒకవేళ అద్దెకున్న వాళ్ళకి వయస్సులో ఉన్న ఆడపిల్లలుంటే-

ఆ అమ్మాయిలు తలవొంచుకునే మంచి పిల్లలవ్వాలి! విర్రవీగుతున్నట్టుండి- స్వతంత్ర భావాలూ, విప్లవ భావాలూ ఉండకూడదు. ఎందుకంటే... ఇంటివారి అబ్బాయిలకి ఇంకా పెళ్ళి కాలేదు.

స్కూటర్లూ, సైకిళ్లూ గోడవార పెట్టకూడదు. ప్రతి ఇంటికి మెట్ల పక్కన వాలుగా సిమ్మెంటు చప్టాలున్నాయి గనుక- ఇంట్లో పెట్టుకోవాలి.

చివరగా నెల అద్దె ఎట్టి పరిస్థితిలోనూ- ముప్పై తారీకు దాటకూడదు!... ఈ రకమైన అగచాట్లు, రూల్స్ అన్నీ అద్దె ఇళ్లవాళ్ళు అనుభవిస్తూనే ఉన్నారు.

ఇక రెండో అధ్యాయమా? తర్వాతి పేజీల్లోకి వెళ్దాం.



# ఆవేశమేగానీ... ఆలోచనేదీ..?

జీవితానుభవంలో ఇంకా పరిపూర్ణత సిద్ధించని వయస్సు... యువతరం!

కాలేజీలో తుళ్లుతూ, హాయిగా, సరదాగా గడిపేసి- ఇంటిపట్టున ఉండాలంటే వాళ్ళకి విసుగ్గా ఉంటుంది.

ఏదైనా చేయాలనే ఆరాటం, చేసేయగలమనే ధైర్యం ఉంటుంది కానీ- ఏది చెయ్యాలో, ఏది చెయ్యకూడదో... అన్న ఆలోచన మాత్రం ఉండదు.

సాధారణంగా స్నేహితుల ప్రోత్సాహం వాళ్ళ మీద బాగా పనిచేస్తుంది. కొంతమంది మంచి సలహాలూ, సూచనలూ ఇవ్వవచ్చును. కానీ, కొందరు హాని చేసే సలహాలు ఇస్తూ ఉంటారు.

తండ్రి ఒక పెద్ద పదవిలో ఉంటే- ఇంట్లో అందరికీ ఆడంబరంగా, దర్జాగా బ్రతకటం అలవాటైపోతుంది. అయితే... దురదృష్టవశాత్తూ ఆ తండ్రి హార్ట్ ఎటాక్ వచ్చి గతించాడనుకోండి- ఒక్కసారి ఆ సంసారం తలక్రిందులవుతుంది. ఆర్థిక ఇబ్బందులు ఎదుర్కోవలసివుంటుంది.

కుటుంబసభ్యులు- అందునా... ఆడపిల్లలు ఎక్కువ ఉంటే- చాలా ఇబ్బందులు పడాల్సివస్తుంది. అన్నగారైనవాడు గుండె దిటవు చేసుకొని, తండ్రి ద్వారా వచ్చిన ఉద్యోగంలో చేరి, ఇంటి నిర్వహణ చూడాలి కదా!

కానీ, కొంతమంది "ఛట్... నేను ఆ చిన్న ఉద్యోగం చేస్తానా? మా నాన్న పెద్ద ఆఫీసర్ చేసేవారు. మేము ఎంత గొప్పగా బ్రతికేవాళ్ళం... ఇప్పుడు కూడా అలాగే బ్రతుకుతాం!" అంటే సాధ్యపడుతుందా?

ఈమధ్య ఒకచోట అక్షరాలా అలాగే జరిగింది.

ఇంటి యజమాని హఠాత్తుగా మరణించాడు.

కొడుక్కి ఉద్యోగం, రావాల్సిన డబ్బు వచ్చింది. కానీ, సంసారబాధ్యత పెద్దది! ఒక్క చేతి మీద సాగదు. ఆ పరిస్థితుల్లో గ్రాడ్యుయేట్లు అయిన అక్కాచెల్లెళ్ళు

అందుబాటులో ఉన్న జాబ్‌లు చేసి ఇంటి వాతావరణం తేలిక చేసుకోవాలని తల్లి చెప్పినా- ఆ అమ్మాయిలు స్నేహితుల ప్రభావం వల్ల- "మేం చిన్న ఉద్యోగాలు చెయ్యం" అని భీష్మించుకున్నారు.

ఆ స్నేహితురాండ్రు చెయ్యకపోవచ్చును. వాళ్ళకున్న స్థితి వేరు!

నిరుద్యోగ సమస్య ఎంత దారుణంగా ఉందో తెల్సుండీ- భవిష్యత్తుని గురించిన ఆలోచన లేకపోతే- ఇక చదువుకుని ప్రయోజన మేమిటీ?

ఉద్యోగం నచ్చలేదనీ, ఆఫీస్ బాగులేదనీ, కష్టపడి పనిచేయాలనీ... ఇలా ఈనాటి యువతరం భావాలు వెర్రి ఆశల్లో, అనాలోచిత తీర్మానాలతో వీగిపోతున్నారు.

వివాహ విషయంలోనూ అంతే!

పెళ్ళికొడుకు నలకూబరుడో, సినిమా యాక్టరులాగో... మంచి పాటగాడో, పెద్ద జీతమో ఉండాలని కోరుకుంటారు. పైగా... కట్నం మాట ఎత్తకూడదంటారు. ఇవన్నీ ఎదిగీ ఎదగని వయస్సులోని లేత భావాలు! వీటిలో బలం ఉండదు, రెండోవైపు నుంచి ఆలోచించే నిదానం ఉండదు.

అందుకే కాబోలు- 'రాబోయే వదినని కట్నం లేకుండా చేసుకుందాం!' అని అనుకుంటారా? ఉహూఁ... వదిన ద్వారా చాలా లాభాలు కావాలి!

ఈ రకమైన అభిప్రాయాలు యువతలోనే కాదు.., పెద్దల్లోనూ ఉన్నాయి.

ఇక... స్నేహితుల ప్రోత్సాహంతో పెద్దలకి చెప్పకుండా ప్రేమవివాహాలు జరిపించుకునే వీరనారీమణులు కొందరు!

వారిది నిజమైన ప్రేమే అయితే- తల్లిదండ్రుల్ని ఒప్పించో, లేదా ధైర్యంగా చెప్పేసో రిజిష్టర్ మ్యారేజ్ చేసుకోవచ్చును. కానీ, ఆవేశం- తొందరపాటుతో ఆకర్షణనే ప్రేమనుకొని, నాల్గు సినిమాలూ- పది నవలలూ చదివి- స్నేహితుల ప్రభావానికి లోనై సాహసకార్యం(అడ్వంచర్)లా పెళ్ళి చేసుకోవటం... కేవలం తెలివితక్కువే! ఆ తర్వాత జీవితమంతా లోటుపాట్లు ఎంచుకుంటూ బ్రతకటమే సరిపోతుంది!

పెళ్ళి, ఉద్యోగం, ప్రవర్తన... మనిషి జీవితానికి అతి ముఖ్యమైనవి! వాటికి తొందరపడటమో, నిర్లక్ష్యం చూపడమ్మో చేయడం తగదు.

ఆవేశమే కాదు.., ఆలోచనా ముఖ్యమే!



# అవగాహన లేకనే... అవరోహణ!

'ఏదో చేసేయాలి... చేసేయాలి!'... అనుకోవటం, దానికోసం నానాతంటాలు పడటం... ఈనాటి నారీలోకంలో బాగా అలవాటైపోయింది.

ఈ రకమైన అభిలాష, అభిమతం... అత్యంత ఆమోదనీయమే!

అయితే- ఏమి చేయాలి? ఎలా చేయాలి? ఎప్పుడు చేయాలి? అనే ఆలోచన, వివేకం ముఖ్యం!

అమ్మాయి గ్రాడ్యుయేట్ అయి, ఇంట్లో ఉంటుంది. పెద్దవాళ్ళు వివాహ ప్రయత్నాలు చేస్తుంటారు.

ఈలోపులో ఆ అమ్మాయి- తనకున్న ఉత్సాహంతో, యువతరపు ఊపుతో ఏదో సంఘంలో అన్యాయాల్ని చక్కదిద్దుదామని ఉవ్విళ్లూరిపోయి, వీరనారిలా చెంగు బిగించి- పనిమనిషి మొగుడు దాన్ని కొట్టే సహించక, దాన్ని ఉద్ధరించాలని బయల్దేరి వెళ్లిందనుకోండి.

"నువ్వు తాగివచ్చి దాన్ని కొట్తావా? చూడు... నిన్నేం చేస్తామో? ఆడవాళ్ళంటే ఆటబొమ్మలా!" అంటూ-

"నువ్వు ఇక కాపరం చేయవద్దు. రావే... నీకు స్వేచ్ఛ ఉంది, నీ రెక్కల కష్టం ఉంది, నా అండదండలుంటాయి!" అంటూ కాలేజీలో స్టేజీ మీద ఉపన్యాసంలా ఊగిపోయి, పనిమనిషిని తన ఇంటికి లాక్కువస్తే-

మర్నాడు అది మనింట్లో పని మానేసి వెళ్లిపోవటమే కాదు-

దాని భర్త వాళ్ళ బస్తీ వారందరినీ కూడగట్టుకొని, ఇంటి మీదకు వచ్చి, "మీ అమ్మాయికి బుద్ధి చెప్పుకోండి! పెళ్ళ కావల్సిన పిల్ల- కాపురాల్ని గురించీ, భార్యాభర్తల కీచులాటల్ని గురించీ చెప్పటానికి ఎలాంటి అనుభవం ఉంది?'' అని అరిచి యాగీ చేయగలరు!

ఇక... ఆ పిల్లకి సంబంధాలు చూడటం ఎంత కష్టమో... ఆలోచించండి.

ఇంక కొత్తగా అత్తవారింటికి వచ్చిన కోడలు- మహిళా సమాజాల్లో చేరి చక్కగా ఆటలు, పాటలు, కుట్లు, వంటలు, గ్రంథ పఠనం, సమాజ సేవా కార్యక్రమాలు చేయాలనుకోవటం మంచిదే!

గంటలయేసరికి సమాజానికెళ్లి మిషన్ కుట్టుకోవడం, వంటల గురించి నేర్చుకోవటం, సంఘ సమస్యల్ని చర్చించటం చేస్తే... ఇక్కడ అత్తగారు పనితో సతమతమయి ఆడపడుచు- అన్నగారి షర్టు ఇస్త్రీ చేసి, ఊడిపోయిన గుండీలు కుట్టించి ఆఫీసుకి పంపిస్తుందనుకోండి... ఎలా ఉంటుంది?

"అమ్మా... కోడలు పిల్లా! నీ సంఘసేవా కార్యక్రమాలు, చర్చలు ఇంటి నుంచి మొదలుపెట్టు. నీ సమాజ సభ్యత్వం విరమించుకో తల్లీ!'' అని అత్తమామలు మంద లించవలసి వస్తుంది.

అప్పుడు కోడలు పిల్ల- అత్తిల్లు ఓ నరకంలా ఊహించేసి- వీధిగుమ్మం చూడనివ్వని అత్తగారినీ, రాచిరంపాన పెట్టే ఆడపడుచులనీ... 'ఓ సరదా సంబరాలు ఎరుగరనీ, కూపస్థ మండూకాలనీ' అందరి దగ్గరా వాగబోతే- అందులో ఎంత నిజం ఉంటుందీ.., ఎంత అసహజం ఉంటుందో ఆలోచించండి.

అలాగే మధ్యవయస్కురాలు- ఇంటికి తాళం వేసి ఊరిని ఉద్ధరిద్దామని బయలుదేరితే- పిల్లలూ, భర్తా గుమ్మాల దగ్గర పడిగాపులు పడాల్సివస్తుంది.

ఏదైనా ఓ కార్యక్రమం చేయాలన్నా, ఓ సలహా ఇవ్వాలన్నా- ఉత్సాహం ఉంది కదా... అని- అవసరాలు, అనవసరాలు చూడకుండా- ఎక్కడో ఒకచోటునుంచీ ఏదోరోజున మన ఆలోచన అమలుచేసేయాలనుకోవటం- తొందరపాటుతనవే అవుతుంది.

మనం సరియైన అవగాహనతో ఉన్నప్పుడే అది సత్ఫలితాన్ని ఇస్తుంది. లేకపోతే- అవరోహణ తప్పదు.



# ఆర్జనకి అంతెక్కడ..?

ఒకప్పుడు- ఎవరైనా ఉద్యోగంకాక, మరొక రకమైన సంపాదన చేస్తుంటే-

"అబ్బో... రెండు చేతులా సంపాదనే!" అని చెప్పుకునేవారు.

ఈనాడు- అలా చెప్పుకోనక్కర్లేదు. ప్రతివాళ్ళూ రెండు చేతులతో సంపాదిస్తూనే ఉన్నారు. ఇంకా ఎవరైనా ఒక్క ఉద్యోగం మీదనే ఆధారపడివుంటే- వాళ్ళని "అయ్యో... మరొక రకమైన ఆదాయం లేదా?" అని అడుగుతున్నారు కూడా!

అంటే... మన ఆర్జన అనేది ఇంట్లో మనుషుల సంఖ్యనిబట్టి గాక- అవకాశాన్ని బట్టి సంపాదించటమేనన్న సూత్రం బాగా బలపడిపోయింది ఈనాటి సమాజంలో! ఎవరు ఎక్కువ సంపాదించగల్గితే- వాళ్ళకి గౌరవం! పొదుపుగా, గుట్టుగా, సంతృప్తిగా ఉన్న వాళ్ళని చూస్తే తేలిక భావం!

పూర్వం పదిమంది ఉన్న కుటుంబాలలోనైనా సర్దుకుని, సంసారాలు సాగించేవారు.

కానీ, ఇప్పుడు- గృహిణి చదువుకుని, ఉద్యోగం చేస్తూ కూడా- ఎక్కడా తృప్తి అనేది కనిపించకుండా, ఎప్పుడూ దేనికోసమో ఎదురుచూస్తున్నట్టే ఉంటోంది.

ఒక్క మధ్యతరగతి గృహిణులే కాదు- శ్రామికజాతీ అనేకాదు, ధనిక వర్గపు మహిళలు కూడా ఎన్నో ఇబ్బందులు పడ్తున్నట్టూ (నిజంగా పడ్తున్నారా?), ఏదో సమస్యతో బాధపడ్తున్నట్టూ వాపోతున్నారు.

నిజంగా చాలీచాలక ఏదో నాలుగు, ఐదు వందలు వచ్చినా చాలని తృప్తిపడే గృహిణులుంటే- వేల మీద నలుగురైదుగురు సంపాదిస్తున్నా- ఇంకా చాలక ఏడుస్తున్నట్టున్న వారూ ఉన్నారు.

ఈ రెండు రకాల వార్ని విడదీసి చూస్తే- తృప్తికీ, అసంతృప్తికీ జవాబులు దొరుకుతాయి.

పండగనాడు- ఇళ్లూ, వాకిళ్లూ కడుక్కుని, ముగ్గులు పెట్టుకుని కళకళలాడే ఇంట్లో- ఉన్నదాంట్లోనే వంటకాలు చేసుకుని పండగ జరుపుకున్నామనుకుని సరిపెట్టుకోగల్గే వారు... మొదటిరకం!

పట్టుచీర మీదకి మ్యాచింగ్ జాకెట్టు అందలేదనో, వంటవాడు నాలుగు స్వీట్ల బదులు రెండే చేశాడనో, కోరుకున్న వీడియో క్యాసెట్ దొరకలేదనో... బాధపడే గృహిణులు... రెండోరకం!

ఈ రకం వాళ్ళకి 'ఆర్జన' అంటే పరిధి ఉండదు. 'సమస్య' అంటే అర్థం తెలియదు. తమ సుఖాలకీ, కోరకలకీ ఎల్లలుండవు.

అందుకే సమాజంలో ఈనాడు నిజమైన సమస్యలేవో, కానివేవో తేల్చుకోలేక- ప్రతిదానికీ ఆర్థికంగా ముడిపెట్టి సంపాదన మార్గాలు చూస్తున్నారు.

ఉద్యోగాలు, ప్రక్క వ్యాపారాలు (సైడ్ బిజినెస్‌లు), చిట్టీలు.., ఇళ్లున్నవాళ్ళకి ఇంటి అద్దెలు... ఇలా ఏ మార్గాన్నైనా నాలుగు రూపాయలు వస్తాయంటే... ఆ పని చేస్తున్నారు.

సంపాదన తప్పని ఎవరూ అనరు.

కానీ, నలుగురు పిల్లలున్న గృహిణి బాధపడినట్టే- ఒక్కగానొక్కరో, ఇద్దరో ఉండి, డబ్బు ఇబ్బంది లేని వాళ్ళు కూడా బాధగానే కనిపిస్తే... ఇక సంపాదనకీ, సంక్షేమానికీ అర్థమే లేదు.

కుటుంబ సంక్షేమం ద్వారా, ఉద్యోగాల ద్వారా, కుటీర పరిశ్రమల ద్వారా... సంతోష సుఖాలు పొందాలనే ఈనాటి మన ప్రచారాలూ, ప్రణాళికలు! కానీ... ఏదీ? ఇద్దరున్నా- ఉద్యోగాలున్నా- వ్యాపారాలున్నా- ఇంకా... ఇంకా... డబ్బు కోసమే ఏడుస్తుంటే సుఖమేమిటీ? ఆర్జనకి అంతులేదా..?!



# అందుకే అందుకోలేకపోతున్నాం!

ఎం.ఎస్.సి., పి.హెచ్.డి. అయ్యాక- 'లా' కూడా చేసి, సాహిత్యంలో ప్రవేశముండి- బాధ్యతగల ప్రభుత్వోద్యోగం చేస్తున్న ఒకావిడ- ఒకానొక మీటింగ్‌లో కనిపించి పలకరించింది.

యోగక్షేమాలయ్యాక- సామాజిక విషయాల నుంచి స్వవిషయాల వరకు సాగిన సంభాషణలో సగానికి పైగా వస్త్రాలని గురించీ, ఫ్యాన్సీ సామాన్లని గురించి, డబ్బు సంపాదన గురించి తప్ప- మరొక విజ్ఞానపరమైన సంగతి గానీ, సమస్యగానీ లేవు! గంటన్నర కబుర్లలో ఓ పదిసార్లు చీరల ముచ్చట్లు, మ్యాచింగ్‌ల శ్రద్ధ దొర్లింది.

ఇలా వున్నాం మనం! ఆడవాళ్ళంటే సింగారమే అన్నది అక్షరాలా నిజమనిపిస్తుంది.

అద్దం ముందు అలంకరించుకోవటంలో ఆక్షేపణ లేదు కానీ, ఎంత చదువుకున్న వాళ్ళకైనా- సహజ స్వభావం రవ్వంత కూడా తగ్గడం లేదు. పైకి ఎంత హుందా(డిగ్నిఫైడ్)గా ఉన్నా- మాటల్లో మాత్రం... తేలికైపోతున్నారు చాలామంది.

"ఆ చీర ఎంత వుంటుందనుకుంటున్నారు? అబ్బే... జాకెట్ సరిగా మ్యాచ్ అవలేదు. అయ్యో... చీరకి ఫాల్ కుట్టుకోలేదు. ఇస్త్రీ లేకుండా కట్టుకుంటే బాగుండదండీ!" అనే ముచ్చట్లు- పేరంటాల సమయంలోనో, పెళ్ళిళ్లలోనో, విందులు- వినోదాలలోనో చెప్పుకుంటే- సమయానికి తగినట్టు ఉంటుంది.

కానీ,పేరంటాల వంటివి అస్సలు ఇష్టపడని వాళ్ళు కూడా- అక్కడి అమ్మలక్కలకన్నా ఒక్క మెట్టు క్రిందకి దిగి- చిన్నపిల్లల్లాగ మాట్లాడుకుంటున్నప్పుడు... ఏమనిపిస్తుందీ?- ఇంత చదువూ చదివి, ఇన్ని విషయాలు తెలుసుకుని, సాహితీ సదస్సులలోనూ, విజ్ఞాన గోష్ఠులప్పుడు కూడా చీరలూ, జాకెట్లు వ్యానిటీ బ్యాగులు- జుట్టు ముడులు... ఇదే గోలా?

మహిళామండలి మీటింగ్‌లకైతే చెప్పనే చెప్పక్కర్లేదు.

అలంకరణ అనేది- అతి సహజమైన ఆడలక్షణం! అలంకరించుకోవాల్సిందే!

వంటనేది... నిత్యకృత్యం! రుచిగా వండుకోవలసిందే! కాని, సమయ సందర్భాలు చూడకుండా ప్రత్యేకమైన సభలప్పుడూ, పండిత గోష్ఠులందూ, సైన్సు కాన్ఫరెన్సుల్లోనూ, సెమినార్లప్పుడు కూడా, వీలున్నప్పుడల్లా 'ఆడ ముచ్చట్లు' దొర్లించుకుంటూ ఉండేవాళ్ళని చూస్తే- ఇంటా, బయటా ఒకే దృష్టిగల వీళ్ళు- చదువుకున్న పట్టాలు, డిగ్రీలు ఏంచేసుకుంటారూ? ఫ్రేంలు కట్టించి పెట్టుకోవటానికీ, ఉద్యోగాలకీ, డబ్బు సంపాదనకేనా- అని బాధ కలగకమానదు. పైగా- ఏ చిన్నచిన్న వ్యాపారాలు చేసైనా డబ్బు సంపాదించాలనే ప్రతిపాదనలు చేస్తూ ఉంటారు కూడా!!

కార్లు- స్వంత ఇళ్లు- ఆధునిక పరికరాలు- అత్యంత సౌకర్యాలూ, ఫోన్లు- ఫ్యాన్లూ ఉండి... ఉద్యోగాలు చేస్తున్న వాళ్ళు కూడా, ఇంకా డబ్బు తాపత్రయం చూపించినా- దానికి సంబంధించిన చిట్కాలు చెప్పినా... వినేవాళ్ళకీ, చూసేవాళ్ళకీ ఎంత ఆశ్చర్యమనిపిస్తుందీ?

అదే పురుషులలో- ఈ రకం మనస్తత్వం చాలా తక్కువగా కనిపిస్తుంది. సగటు పురుషుడి కన్నా- సగటు స్త్రీ బుద్ధులు ఎదగటం లేదనే చెప్పాల్సివస్తుంది.

అందుకే- ఎన్ని చదివినా, ఎంత నేర్చినా... ఇంతులు ఇంటి ముచ్చట్లలోనే గడిపేస్తున్నారు... 'అ, ఆ' ల క్లాసులోనే ఉండిపోతున్నారు.

ఔన్నత్యాన్ని అందుకోలేకపోతున్నారు.



# అమ్మకాల గోల!

తలుపు దబదబా బాదడమో, కాలింగ్ బెల్ నొక్కడమో జరిగినప్పుడు- ఎంత పనిలో ఉన్నా... 'ఆ వచ్చిన వాళ్ళెవరో...' అనుకొని చప్పున వెళ్లి చూస్తాం!

తీరా తలుపు తెరిచేసరికి-

"ఎక్స్యూజ్ మి! మేము సబ్బుల కంపెనీల నుంచి వచ్చామండీ! ఈ సబ్బు నాలుగు రకాలుగా 'ఉపయోగపడుతుందండీ! అధిక నురుగు... ముఖం నిగనిగలాడుతుంది. కొద్దిపాటి సబ్బు చాలు! ధర తక్కువ..." ఇంకా అలాగ సాగుతూనే ఉంటుంది వాళ్ళ ధోరణి!

వదిలిపెట్టి వచ్చిన పని ఏమయిపోతున్నా- వీళ్ళ దండకం ఆగదు.

'ఒక్కటైనా తీసుకోం'డని బలవంతం చేస్తూ... చివరికి పేరూ, ఇంటినెంబరూ వేసుకొని వెళుతూ ఉంటారు.

ఒక్కోరోజు ఇద్దరు, ముగ్గురు కూడా వస్తారు.

"మాకు వద్దు మహాప్రభో..!" అని వేడుకున్నా- వాళ్ళ డ్యూటీ వాళ్ళు చేసుకుపోతారు.

"మీరు ఏ టూత్‌పేస్ట్ వాడతార"ని ఒకరు మొదలుపెట్తే-

"ఈ బిస్కట్స్ చాలా ఆరోగ్యం కూడానండీ! ఈ పెద్ద ప్యాకెట్ తీసుకుంటే కర్చీఫ్ ఉచితమండీ!" అనో ఒక పెద్ద ప్యాకెట్ ఉచితమనీ చెప్తారు.

"ఈ అప్పడాలు, వడియాలు ఇంట్లో స్వయంగా తయారుచేసినవండీ, తిని చూడండి. ఎంత రుచిగా ఉంటాయో..?!" అని శాంపిల్ కూడా ఇస్తారు.

ప్రతిరోజు ఎంతలేదన్నా... ఇద్దరూ, ముగ్గురూ వస్తూనేఉంటారు.

ఇవన్నీ చిన్నమోతాదులో వాళ్ళ అమ్మకాల గోలనుకుంటే.., మరొక రకం వాళ్ళుంటారు. ''అమ్మా... నీ బోణీ మంచిది. ఒక పావు కిలో ఐనా కొనమని కూరలవ్వలు వచ్చి కూర్చుంటారు.

ఇక... స్టీల్ సామానులూ, జాకెట్ గుడ్డలవాళ్ళూ, ''ఒక్కటీ తీసుకోరేం?'... అని మనల్ని పాత పద్ధతి ప్రకారం తీసుకోమని ఒత్తిడి చేస్తారు.

ఇళ్ళలో ఉన్న సగటు మధ్యతరగతి గృహిణులు మధ్యాహ్నం పూట కాస్త విశ్రాంతి తాసుకుందామంటే వీలులేదు.

ఆ సమయాల్లోనే మనల్ని బ్రతిమాలైనా సరే- 'వద్దు' అన్నా వినిపించుకోకుండా కొన్ని వస్తువుల్ని మనచేత కొనిపించేటట్టు చేస్తారు.

ఇదంతా ఇంట్లోవాళ్ళని ఎంత చికాకుపెట్టుందో ఆ అమ్మకాల వాళ్ళకి తెలియదు. వాళ్ళ లాభం వాళ్ళు చూసుకుంటారు. ఎంత అమ్మగలిగితే అంత తగిన ఫలితం ఉంటుంది వాళ్ళకి. అందుకని ఎన్నో రకాల మన్నింపులతో మనల్ని లోబరుచుకునేందుకు ప్రయత్నిస్తారు.

ఈరోజుల్లో ప్రతిరోజు ఎవరో ఒక అమ్మకాల(సేల్స్)వాళ్ళు వస్తూనే ఉంటారు. తినే వస్తువులు మొదలుకొని, శరీరానికి ఉపయోగించుకునే సువాసన ద్రవ్యాలు... ఇళ్ళు కడుక్కునే ఫినాయిల్, పిల్లలు తినే బిస్కట్స్, చాక్లెట్స్‌లాంటి అనేకమైన వాటిని చూపించి కొనేదాకా వదలరు.

ఎవరి జీవన భృతి వారిదే... ఒప్పుకుంటాం! కానీ, మనకి అవసరమైనప్పుడు డబ్బు తీసుకుని దుకాణాలకి వెళ్లి మనం కొనుక్కుంటాం. దానివల్ల మనకి కష్టం ఉండదు.

అలాకాకుండా నెలాఖరు రోజుల్లో వచ్చి మన ప్రాణం తీసినంత పని చేస్తుంటారు. వీళ్ళుగాక- చందాల వాళ్ళు, 'మామూళ్ళు' ఉండనే ఉంటాయి! గృహిణి సమాజంలో గౌరవంగా బ్రతకాలంటే ఈ రకమైన మొహమాటాలు తప్పవు. అవి భరించాలంటే ఇంట్లో ఇబ్బందులూ తప్పవు! అగచాట్ల భాగోతాల్లో ఇదొక రకం!

ఇంకా ఎన్నో... ఎన్నో..! అవన్నీ ముందు పేజీల్లో చెప్పుకుందాం.



# అక్కర్లేని సలహాలు!

ఇరుగు- పొరుగు అన్నాక ఎన్నో విషయాలకి మనకి వాళ్ళతోటీ, వాళ్ళకి మనతోటి అవసరాలు కలుగుతూ వుంటాయి!

చుట్టాలూ, బంధువులూ, స్నేహితులూ- అందరూ ఆ కోవలోకే వస్తారు.

ఎప్పుడైనా మనకి సంశయాత్మకమైన స్థితిలోగానీ, విషమ సమయంలోగానీ- మన హితైషులు సలహాలివ్వటం, దానిని అనుసరించి మనం ఆ సమస్యని పరిష్కరించుకోవటం కద్దు! కానీ.., కొంతమంది- మనకి అక్కర్లేకపోయినా ఉచిత సలహాలు ఇచ్చి బాధిస్తారు.

ఇలా అక్కర్లేని సలహాల వలన ఎక్కువగా- మనల్ని కించపరచటమో, అనవసరంగా ఇబ్బంది కలిగించటమో జరుగుతూ వుంటుంది!

"ఏమండీ... మీ పాప ఏమిటీ అంత నీర్సంగా వుందీ? మధ్యాహ్నంపూట స్కూలుకి టిఫిన్ బాక్స్‌లో ఏం పెట్తారు?" అని అడిగి, "అయ్యో... అదేమిటండీ? పాలూ, బ్రెడ్డూ, బిస్కెట్లు ఏమిటండీ? చక్కగా పెరగన్నం పెట్టాలండీ? మీరు చాలా అన్యాయం చేస్తున్నారు..." అని సలహాలాంటి మందలింపు ఇచ్చిందో ఇల్లాలు!

పాపం- ఈ పాపతల్లి విలవిలలాడిపోయింది... 'పాపకి అన్యాయం చేస్తున్నానంటుందేమిటీ?' అని.

అసలు- ఆ పాపకి పెరుగు ఇష్టం లేదు! పాలూ, బ్రెడ్డూ... బలం కాదా? తన పిల్లలకి తాను పెట్టుకున్నట్లు- ఇతరులూ అలాగే పెట్టాలని చెప్పటంలో ఏమి సబబు వుంది?

అలాగే- బట్టల విషయంలో కూడా కొందరు "అదేం డ్రస్సండీ? చక్కగా పెద్దపూలున్న రంగురంగుల డ్రస్సులు కుట్టించండి. ఆ లేత రంగులు వెలవెల బోతున్నాయి! కొత్తవని చెప్పేదాకా తెలియటం లేదు!" అంటారు.

అది సలహాలాగా వుండదు. ఆజ్ఞాపిస్తున్నట్టు వుంటుంది. నిజానికి- ఆ లేత సిల్కువి చాలా ఖరీదుపెట్టి కుట్టిస్తారు వాళ్ళు! కానీ, తమ చవక గుడ్డలే గొప్పవన్న ధోరణిలో అవతలి గృహిణి సలహాలిస్తే- ఈ ఇంటి ఇల్లాలికి ఎలా వుంటుందీ?!

ఇక- బంధువుల్లో కొందరు- తమకి తోచిన సలహాలిచ్చి మనసు గాయపరుస్తూ వుంటారు. అంతా తమకే తెలుసన్న తత్వం వీరిది. పైగా తన మాట అందరూ వినాలనీ ఆరాటం!

"చూడు- మంచి మందివ్వాలి గానీ, ఆ టాబ్లెట్లు వేసుకోవటమేమిటీ? తలనొప్పే కదా అనుకోకు. ఏమో... లోపల ఏ రోగం వుందో? కక్కుర్తిపడి మందులు మానేయకు! వెంటనే డాక్టర్‌కి చూపించు" అని వొత్తిడి చేస్తుంటారు... మన బంధువులు.

నిజంగా మనకి కేవలం తలనొప్పే ఉన్నా- వారి మాటలు కాదనలేక వెళ్లి అన్ని పరీక్షలూ చేయించుకుని- వందల రూపాయల బిల్లు, అక్కర్లేని టానిక్కులూ తీసుకుని- "ఉష్..!" అనుకోవలసివస్తుంది!

ఈరోజుల్లో- డాక్టర్ దగ్గరకి వెళితే రోగం లేదని చెప్పేవాళ్ళు లేరు!! అయినా... రక్తపోటు, తలనొప్పి, గుండెనొప్పి... లాంటివి మనిషికి అలవాటైపోయిన పాత చుట్టాల వంటివి!

ఇంకా- వంటల విషయంలో సరేసరి!-

'ఆ నెయ్యి ఎలా వాడుతున్నారండీ? మా నేతి అబ్బాయి దగ్గర పది రూపాయలు ఎక్కువయినా చాలా బాగుంటుంది తీసుకోండ'నీ, 'ఫలానా కొట్లో సరుకు మంచిది, తీసుకోండ'నీ- మొదలుపెట్టి- మనింట్లో ఏ వస్తువులు ఎక్కడ పెట్టుకోవాలో, ఏవి కొనాలో కూడా సలహాలిచ్చేవాళ్ళు ఎందరో?!

'సలహా'... అనేది మనకి సమస్య పరిష్కారమయ్యేలాగ- మనం అడిగినప్పుడు చెప్తేనే రాణిస్తుంది!

అంతేకానీ... అక్కర్లేని సలహాలు చెప్పి- మనకి బాధ కలిగించేవాళ్ళు- మనల్ని అగచాట్ల పాలు చేస్తారు. తస్మాత్ జాగ్రత్త! అన్ని సలహాలూ వినకండి!



# ప్రచారాల ప్రభావాలు!

వృత్తి అన్నాక- దానిమీద శ్రద్ధ, తగినంత కృషీ... ఎవరికైనా వుంటుంది.

ప్రభుత్వ ఉద్యోగాలు కాకుండా- స్వంత వ్యాపారాలు చేసేవాళ్ళూ, కంపెనీలు స్థాపించుకున్న వాళ్ళైతే- దానికి తగినంత ప్రచారం కూడా చేసుకోవల్సివుంటుంది గదా?!

ఈరోజుల్లో ఈ ప్రచారాల జోరు బాగావుంది. గుండుసూదుల దగ్గర నుంచి ఇనుప కడ్డీల వరకు- అవసరాలతో పనిలేకుండా ప్రకటనలు ఇస్తూ విరివిగా ప్రచారాలు చేసుకుంటున్నారు. ఈ ప్రచారాలకి ఖర్చు పెట్టే డబ్బు మరికొంతమంది జీవనోపాదికి ఉపయుక్తమవుతోంది! ఆ కంపెనీల్లో పనిచేసేవాళ్ళూ- బ్రతకగల్గుతారు!

అయితే- ఈ ప్రచారాల ప్రభావం సగటుమనిషి మీద ఎలాంటి పరిణామం తీసుకువస్తోందన్నదే మనం పరిశీలించాలి!

దూరదర్శన్‌లోనూ, రేడియోలోనూ, చిత్రసీమలోనూ ఈ ప్రకటనలు మనం తరచూ చూస్తూ వుంటాం! వింటూ వుంటాం! బయటకూడా పెద్దపెద్ద బోర్డులపైన ప్రకటిస్తూనే వుంటారు. నిత్యం మనం ఇవి చూస్తే- కొనాలనే అనిపిస్తుంది. ఆ ఆకర్షణ అలాంటిది!

సబ్బుల్ని గురించి ప్రకటనలు వింటే- ఒకదాంట్లో సినిమా హీరోయిన్ కనిపిస్తుంది. మరోదాంట్లో 'రామాయణం' సీరియల్ హీరోయిన్ కనిపిస్తుంది. ఇంకోదాంట్లో అందాలు తరగని ఓ వనిత యవ్వనం ఎలా పోషించుకోవచ్చునో' చెప్తుంది.

ఇంకా బట్టలు ఉతకటానికి ఏ సబ్బు వాడాలో, బట్టలు ఎలా మెరిసిపోతాయో- దానివల్ల ఉద్యోగం వస్తుందనీ కూడా చెప్తూంటారు.

ఇక... సౌందర్యాలంకరణల జాబితాలో పౌడర్లు, స్నోలు, పెదాల రంగు, గోళ్ల రంగు, తల నూనె, బొట్లు- ఇత్యాదివన్నీ ఒక్కొక్క కంపెనీ ఒక్కొక్కరకంగా ప్రచారం చేస్తుంటుంది. అంతవరకు బాగానే వుంటుంది.

కానీ, ఇంట్లో ఇద్దరు ముగ్గురు ఆడపిల్లలుంటే- ఒక్కొక్కళ్ళకి ఒక్కో తార ఇష్టం వుంటే- ఆ సబ్బు కొని వాడాలనుకునే వాళ్ళని చూసినప్పుడు- ఆ ఇంటి యజమానిని తల్చుకుని జాలి పడాల్సిందే!

ఒక్క 'సబ్బు' విషయమే కాదు- టూత్ పేస్టుల సంగతి చూడండి. పెద్దబ్బాయికి 'కాల్గేటు' ఇష్టం! చిన్నాడికి 'క్లోజప్' మోజు! అమ్మాయికి 'ప్రూడెంట్' కావాలి! అమ్మకి, నాన్నకీ- 'ఫారూకీ' పళ్లపొడే వాడాలని వుంటుంది. ఇంకా 'ఫోర్‌హెన్స్'- 'ప్రామిస్' కొందరు కొనాలంటే- ఇంట్లోనే కంపెనీ స్థాపించేలాగ అయిపోతుంది!

ఇక... వంటసామాన్లు శుభ్రపరచటానికి పనిమనిషి కూడా 'బ్రైటిట్' అని కొన్నాళ్ళు, 'విమ్'అని తర్వాత, టీ.వీ.లో చూసినప్పుడల్లా- 'అమ్మగారూ... అది కొనండ'నో, 'ఫలానా వారింట్లో అదే వాడతార'నో సలహాలిస్తూ వుంటుంది!

చాలామంది గృహిణులు- ప్రచారాల్లో వస్తువులు చూసి తమ ఇంట్లో కూడా నింపేసుకోవటం జరుగుతోంది! వస్త్రాలు కూడా 'తగ్గింపు ధర' అని చెప్పగానే వెర్రితనంగా కొనేస్తూ వుంటారు! ఫ్యాన్సీ వస్తువులు చెప్పనే అక్కర్లేదు.

ఆదాయాన్ని మించిన ఖర్చులు చేస్తున్న గృహిణులూ... ఒక్కసారి ఆగి ఆలోచించండి! ఏ వ్యాపార ప్రకటన అయినా వాళ్ళ లాభం కోసం ప్రచారం చేస్తుంది తప్ప- అవి వాడినంత మాత్రంచేత మనం నిగనిగలాడిపోతూ, ముసలితనం రాకుండా ఎప్పటికీ యవ్వనంలోనే వుంటామా? అది సాధ్యమయ్యే పనా?

ఇన్నేసి ప్రకటనల్లో- అందరూ 'తమది మంచిది' అంటే- 'తమది మంచిది' అంటున్నపుడు- ఏది నిజం? అసలు మంచివే అయితే పోటీలుపడి ప్రచారాలు చేసుకునే అవసరం ఏముందీ?

ఇంట్లో అందరూ ఏదో ఒకదాని మీద శ్రద్ధ కుదుర్చుకుని ఒక కంపెనీ వస్తువే కొనుక్కుంటే... ఖర్చు తగ్గడమే కాదు- ఆరోగ్యం కూడా ఎప్పటికీ ఒకలాగే వుంటుంది. అందరూ తలొకటి వాడటం, లేదా మాటిమాటికీ కంపెనీలు మార్చేస్తే- ఖర్చులే కాదు, ఆరోగ్యమూ దెబ్బతింటుంది. ప్రతిదీ శరీరానికి పడవు!

వస్తువు మీదకన్నా ప్రచారం చేస్తున్న వ్యక్తుల మీద మోజులో ఆ వస్తువు కొనుక్కుంటున్న మనం- ఎంత ప్రలోభంలో పడిపోతున్నామో గ్రహించాలి!



# నిచ్చెన మెట్లు

మొదట్లో అతి సామాన్యంగా వుండి, ప్రగతి సాధించే లక్ష్యంతో కొందరు కొన్ని పథకాలనో- కొన్ని నియమాలనో ఉద్దేశంగా పెట్టుకుంటారు.

ఇది చాలా మంచి సాధన.

ఈనాడు సమాజంలో ఒక మనిషి పరువుగా బ్రతకాలన్నా, కుటుంబం సవ్యంగా సాగించాలన్నా- ఆర్థికమైన స్థితి చాలా అండగా వుంటోంది!

బాగా డబ్బు, హోదా గల వాళ్ళు- ఏది చేయాలనుకున్నా సమయం, శ్రమా కలసివస్తాయి! అదే సగటు వ్యక్తి- ఓ కష్టమైన పని చేయాలనుకుంటే- రోజుల తరబడి శ్రమించాలి, అప్పులు చేయాలి! అదికూడా సకాలంలో అందాలి గదా? కనుక- సమాజంలో ఎప్పుడూ డబ్బున్న వాళ్ళు, లేనివాళ్ళూ త్రాసులో సమంగా తూగలేరు!

ప్రతివాళ్ళు ఉద్యోగాలు చేసో, వ్యాపారాలు చేసో సంపాదించలేకపోవచ్చును. అటువంటప్పుడు- ఇంట్లో అందరూ ఒక సమావేశంగా చేరి చక్కని సమాలోచనలు చేసుకుంటే! ఇంటి ఖర్చులు తగ్గించుకుని- పొదుపు పథకమో, మరొక రకమైన సంపాదన మార్గమో చూడటానికి యోచించాలి! దానికోసం ఇంట్లో సభ్యులందరూ ఏకగ్రీవంగా ఆమోదించాలి! నిర్ణయించుకున్నకాలం లోపల ఆ పథకానికి విఘ్నం కలగకుండా చూసుకుంటే- నిజంగా ఏదైనా సాధించవచ్చును.

ఒక గృహిణి- ఇంట్లోకి అన్ని సదుపాయాలూ అమర్చుకోవాలనుకుంది.

కానీ- భర్త ఒప్పుకోడేమో?... అని భయపడి- పిల్లలతో కలసి తర్జనభర్జనలు చేసి- చివరికి ఒక నిశ్చయానికి వచ్చింది.

ఒకరోజు ఇంట్లో అందరి ముందూ- "మనం పొదుపు పథకం అనుసరిద్దాం! మీరంతా మీ పర్సనల్ ఖర్చులు తగ్గించుకుని- ఒక సంవత్సరం తర్వాత ఎవరెంత జాగ్రత్త చేస్తారో చూద్దాం! నావంతుగా నేను సినిమాలు, మహిళామండలి చందాలు మానేస్తాను"- అని చెప్పింది.

అంతే... భర్తగారు- 'నా కాఫీలు, సిగరెట్టుల ఖర్చు తగ్గిస్తా' నన్నాడు. పిల్లలు- వాళ్ళ వాళ్ళ ఖర్చులు తగ్గిస్తామని చెప్పారు. మొత్తానికి... అతికష్టం మీద- ఆ సంవత్సరం 'పొదుపు ప్రణాళిక' అమలుపరచి- నెలకి రెండు మూడు వందల రూపాయల చొప్పున ఆదాచేసి, సంవత్సరం చివరికి- చిన్న మొత్తమే అయినా... మూడువేల అయిదు వందలు దాచగల్గారు.

ఇక... అప్పట్నుంచీ కొంతకొంతగా దాచేయటమే కాదు- తప్పనిసరిగా కొంత డబ్బు బ్యాంకులో దాస్తూ- ఇంట్లోకి కావల్సిన సదుపాయాలన్నీ సమకూర్చుకున్నామని ఆవిడ చెప్తే- నిజంగా మెచ్చుకోవలసిన విషయమే అనిపించింది!

ఎక్కడా అప్పులు చేయకుండా- వాయిదాల పద్ధతి మీద నష్టపోకుండా ఓపికతో- అన్నీ అమర్చుకున్నారు! ఆ తర్వాత సదుపాయాల వల్ల ఇంట్లోనే అందరూ తమ పనులు తాము చేసుకుంటే- పనిమనిషి తోడు అక్కర్లేకుండా- తమ ఇంటి పనులు తామే శ్రమ లేకుండా చేసుకోగల్గుతున్నప్పుడు- నిచ్చెన మెట్లు ఎక్కి హాయిగా డాబా మీద కూర్చున్నంత సుఖంగా అనిపించదూ?!

ఇదే విదేశాలలో అయితే వాళ్ళని మెచ్చుకుంటాం! మనమూ ఎందుకు చేసుకోకూడదూ? ప్రతిదానికి పనివాళ్ళు అలవాటై- వాళ్ళ జీతాలు భరించలేక నానా తంటాలు పడేకంటే- ఒక్కొక్క మెట్టే ఎక్కటం నేర్చుకుంటే- సాధన చేస్తే- మనమూ తృప్తిగా బ్రతకగలం! ముఖ్యంగా... మధ్య తరగతి కుటుంబీకులు!!

ఈనాడు సమాజంలో మధ్యతరగతి గృహిణి నానా అగచాట్లూ పడాల్సివస్తోంది!

పైకి ఎక్కలేక- క్రిందకి దిగజారలేక- సాటివాళ్ళ కోసం లేనిపోని బాధ పడాల్సివస్తోంది! ఆమె చుట్టూ వున్న బడాయి ఇందుకు కారణం! ఈ సంగతి ఆమె గ్రహించి వాళ్ళ నుంచి డాబులు నేర్చుకోకుండా- పరుగెత్తే అలవాటు మాని- ఒక్కొక్కటే నేర్చుకుంటే- సంసారం స్వర్గమే అవుతుంది.



# 'నవ్య పథమంటే ఇదా?'

ఏమిటో- చెప్తే వినేవాళ్ళకి బాగుండదేమో కానీ... కొన్ని ఆదర్శాలు, అభ్యుదయాలు చాలా విచిత్రమనిపిస్తున్నాయి!

అమ్మాయిని, అబ్బాయిని సమానంగా చదివిస్తున్నారు. భేదాభిప్రాయాలు లేకుండా వ్యక్తిగత స్వతంత్రం ఇస్తున్నారు. చాలా సంతోషం! సర్వత్రా ఇది వాంఛనీయమే!

అబ్బాయితోపాటుగా అమ్మాయి కూడా చక్కగా లూనా మీదో, స్కూటర్ మీదో, ఇండ్ సుజుకీ మీదో ఝూంఝూం... మంటూ తిరుగుతూ స్వేచ్ఛా వాయువులు పీలుస్తూ వుంటుంది. మరీ మంచిది! ఆత్మధైర్యం వుండాల్సిందే!

చక్కగా ఆధునిక దుస్తులతో, కత్తిరించుకున్న జుట్టుతో ఇంటా, బయటా, మలయమారుతంలా తిరుగుతుందన్నా సరే... 'అభిరుచుల్ని ఆమోదింపవలసిందే!' అనుకోవచ్చును.

ఇంతవరకు వ్యక్తిగత స్వేచ్ఛకిగానీ, కుటుంబ సభ్యతకిగానీ ఏమీ ఆటంకం లేదనుకోవచ్చును. కానీ అమ్మాయి- తను ఆడపిల్ల లక్షణాలు పూర్తిగా వదిలేసి, లేదా మగపిల్లాడ్నే అనుకున్నట్లు ప్రవర్తిస్తే- ఈ సమాజం ఒప్పుకుంటుందా? - చూసేవాళ్ళకీ, వినేవాళ్ళకీ బాగుంటుందా?

నేను ఫలానా బాయ్‌ఫ్రెండ్‌తో పిక్‌నిక్ వెళ్తున్నాననీ, బాంబే జాలీట్రిప్ వెళ్తాననీ అంటే సమ్మతించవచ్చా? సినిమాలకీ, షికార్లకీ, క్లబ్బులకీ గాలిపటాల్లాగా తిరిగి- "నేను ఫలానా అబ్బాయిని ప్రేమిస్తున్నాను. నాకు పెళ్ళి చేయండి. లేదా- మేమే రిజిష్టర్ మ్యారేజ్ చేసేసుకుంటాం!" అంటే తల్లిదండ్రులు అంగీకారం తెలపటమేనా?

'మేము మా అమ్మాయిని తను ప్రేమించిన వాడికిచ్చి పెళ్ళి చేసేం! చూసుకోండి మా ఆదర్శం?' అంటే అనవచ్చును-

కానీ, ఇది నవ్యపథం మాత్రం కాదు! వ్యక్తిగత స్వేచ్ఛ అనేది, వ్యక్తికి మాత్రమే సంబంధించింది. వివాహం అనేది సమాజానికి సంబంధించిన వ్యవస్థ! ఇద్దరు ప్రేమించి పెళ్ళి చేసుకున్నంత మాత్రంలో వాళ్ళకి సమాజంతో పని లేదా? బంధుమిత్రులతో పని లేదా? వారికి కలుగబోయే సంతానం- ఈ సమాజంలో సక్రమంగా పెరగాలా... లేదా? అంటే- ప్రేమ వివాహాల్ని విమర్శించటం కాదు ఇక్కడ చెప్పేది! కానీ, 'ప్రేమ' అనేది ఎంత ముచ్చటగా, ఆమోదనీయంగా వుంటే ఆ వివాహం అంత వర్ధిల్లుతుంది! ఆకర్షణ ప్రేమ కాదు! కులం, గోత్రం, మతం మాట కాదు చెప్పేది-

సంస్కారం, వివేకం, ఆరోగ్యం, ఉద్యోగం... ఇత్యాదివన్నీ 'వివాహం' అనే పవిత్ర బంధంలో వుంటాయి! అటువంటి పురుషుడు- ఎప్పుడూ- 'ప్రేమ' పేరుతో తల్లిదండ్రులకి తెలియకుండా విహారయాత్రలు చేయడు... అదే సంస్కారం! అలాంటి వివేకవంతుడు పెద్దల అంగీకారంతో- తన హృదయంలో నింపుకున్న ప్రేమతో పెళ్ళి చేసుకుంటాడు. అంటే... పెద్దల్ని గౌరవిస్తాడు.

కానీ, ఈనాడు ప్రేమవివాహాల పేరిట- అర్రసులైనా సరిగాలేని కొందరు అనామకులు- 'వ్యామోహా'నికి 'ప్రేమ' అనే పేరుపెట్టి తొందరపడుతున్నారు. ఇది అభ్యుదయం ఎంతమాత్రం కాదు!

'పట్టాలున్నాయి- ఉద్యోగాలు సంపాదించుకుంటాం!'... అంటే- ఇక పెళ్ళికి (లైన్ క్లియర్) అభ్యంతరం లేనట్టా? ఒక వివాహంతో అటు బంధువులు- ఇటు బంధువులు సన్నిహితులు కావాలి! వారిద్దరి ఆరోగ్యం, తెలివితేటలు, మంచి బుద్ధులు వారికి కలిగే సంతానానికి సంక్రమించాలి! అటువంటి పిల్లలు- సమాజంలో పేరుప్రఖ్యాతులు తెచ్చుకోవాలి!

కట్నాల బాధ పడలేక- ఈనాడు కొందరు ప్రేమవివాహాల్ని ప్రోత్సహిస్తున్నారు. ఇది సరైన పద్ధతి కాదు. ప్రోత్సహిస్తే కల్గేది ప్రేమ కాదు! ఇదే అభ్యుదయం, నవ్యపథం అనుకోవటం చాలా పొరబాటు! స్వేచ్ఛ పేరిట పిల్లల్ని విచ్చలవిడిగా వదలటం- చాలా ప్రమాదం! తల్లిదండ్రులు ఇది గ్రహిస్తే- పిల్లలు నవతరంలో నిజంగా నవ్యపథంలోకి పయనించగలుగుతారు! వారి విద్య- వారికి ఆత్మస్థైర్యాన్ని ఇవ్వాలిగానీ, ఎదిరింపు గుణాన్ని కాదు. వారి స్వేచ్ఛ- వారికి వివేకాన్ని నేర్పాలిగానీ, తిరుగుబాటుతనం కాదు!- అవి తెలుసుకుంటేనే నవ్యపథం అనిపించుకుంటుంది!



# నైరాశ్యం పెంచకండి!

తీరుబడి ఎక్కువైన కొందరు మహిళలు- ఏం చేయాలో తోచక ఊళ్లో వాళ్ళ కబుర్లన్నీ మూటగట్టుకొని తెచ్చి కుప్పపోసుకుని- ఒక్కొక్కటే ఏరుకుంటూ వుంటారు!

అలా ఏరుకుని తమకి తాము ఆనందించటమో, నిరసించటమో చేసుకుంటే బాధలేదు కానీ- మళ్లీ వాళ్ళవి వాళ్ళకే తారుమారుగా అందిస్తూ వుంటారు.

పార్వతమ్మగారి రెండో అమ్మాయికి ఎన్నో సంబంధాలు వస్తూంటాయి. కానీ, ఒక్కటీ కుదరటంలేదు. అందుకు ఆ తల్లిదండ్రులూ, ఆ అమ్మాయి కూడా బాధపడుతూనే వుంటారు.

అయితే... ఈ తీరుబాటు మహిళకి ఏం బాధట? పనిగట్టుకుని వెళ్లి- ''మొన్నటి సంబంధం ఏమైందీ?'' అని అడిగి తెలుసుకుని, మళ్లీ ఆ విషయంపై తన అభిప్రాయాన్ని వాళ్ళు అడగకపోయినా సరే- వెళ్లి- ''అయినా... అమ్మాయి బొత్తిగా బక్కగా వుందండీ? పెళ్ళీడు పిల్ల అలాగేనా వుండేదీ? పెళ్ళికొడుక్కి ఎలా నచ్చుతుందీ?'' అని మూతి తిప్పి చెప్తే- ఆ అమ్మాయికి ఎలా అనిపిస్తుందీ?

ఇంకొకమ్మ వచ్చి- ''పిల్లకి గ్రహదోషం ఉండివుంటుంది. లేకపోతే, ఇన్ని సంబంధాలు వచ్చినా ఒక్కళ్ళూ 'ఊ' అనకపోవటమేమిటీ? శాంతి చేయించండి!'' అని ఓ దీర్ఘ నిశ్వాసం వదిలి వెళ్లిపోతుంది. ఆ పెళ్ళిచూపుల అమ్మాయికి- మనసు సగం చచ్చిపోతుంది! ఇంకా మిగిలివున్న ఏ కాస్త మనసో వుంటే- ఇంట్లో ఉండే మేనత్తో, దూరపు బంధువో అందుకుంటుంది-

''అసలు దీనికి పాతికేళ్లు వచ్చాయి కదూ! ఈ సంవత్సరంలో గనుక పెళ్ళి కుదరకపోతే- జాతకరీత్యా ఇంక పెళ్ళియోగం లేదే పార్వతీ! మన వంశంలో ఎవరికీ పాతికేళ్లదాకా పెళ్ళి కాకుండా లేరు. మరి, ఈ సంవత్సరంలో కుదిర్తే సరే! లేకపోతే- ఇక కాదన్న మాటే! ఇంక ఆ మూడోదానికీ, నాల్గోదానికీ ఎలాగ? ఏమిటో- మనలో ఎవరికీ ఇలా లేదూ?'' అని చెంపకి చెయ్యి చేర్చుకుని కూర్చుంటుంది.

ఇంక ఆ పెళ్ళి కుదరని పిల్లకి- కళ్ళల్లోనే కన్నీళ్లు ఇంకిపోయి- జీవకళ కోల్పోయి- తన బ్రతుకు వృథా... అన్నంత దిగులు నింపుకుంటుంది.

ఇలా ఒక్క పెళ్ళిచూపుల విషయంలోనే కాదు.., ఉద్యోగంకోసం ప్రయత్నాలు చేసేవాళ్ళని కూడా- చుట్టూ వున్నవాళ్ళో- బంధువులో- ఇంట్లోవాళ్ళో- నిరాశ పరుస్తూవుంటారు.

"ఏమైంది..?" అని ఇంటర్వ్యూకి వెళ్లి వచ్చిన ప్రతిసారీ అడగటం-

ఆ తరువాత "ఊఁ... నేను అప్పుడే అనుకున్నాను- నీకిది రాదనీ? అబ్బో... ఆ ఉద్యోగానికి ఎంత తెలివి వుండాలీ?" అని నిరసనగా మాట్లాడుతారు.

ఉద్యోగం రాకపోగా, 'నీకు తెలివి లేద'ని ఎత్తి పొడవటం కూడా భరించాల్సి వస్తుంది. ఇంకా కొందరు- "ఉద్యోగం అంటే వంకాయలు కొనుక్కోవటమా ఏమిటీ? అదృష్టం వుండాలి! అందరికీ వస్తుందా?" అంటూ వంకర నవ్వు నవ్వుతారు.

ఇక- మరీ కాస్త చనువు, అధికారం వున్న బావలో, మేనమామలో అయితే-

"నీ ముఖానికి ఆ ఉద్యోగం వస్తుందా? ఈ అత్తెసరు మార్కులు చూసి ఎవడు ఇస్తాడు ఉద్యోగం? పోనీ... ఆ టైపో- షార్టుహ్యాండో అన్నా నేర్చుకో! ఏదీ చెయ్యకపోతే- ఉద్యోగం పరుగెత్తుకుంటూ వస్తుందా?" అని దులపరిస్తారు.

ఇక ఉద్యోగం వచ్చినా- చెయ్యబుద్ధి కానంత విరక్తి కల్గుతుంది! ఈ రకమైన మనుషులు ప్రతి ఇంట్లో- ప్రతి ఊళ్లో తారసపడుతూనే వుంటారు. పెళ్ళి కావలసిన పిల్లల్ని, ఉద్యోగాలకోసం ప్రయత్నించే అమ్మాయిల్ని అడుగడుగునా నిరుత్సాహపరుస్తూ- వాళ్ళలో నైరాశ్యం నింపి- కుదించుకుపోయేలాగ చేస్తుంటారు.

సంతోషం- ప్రోత్సాహం... సగం బలాన్నిచ్చి మనిషిని ముందుకు నడిపిస్తాయి. కానీ- నిరుత్సాహం పెంచి, నైరాశ్యం నింపితే... మనిషికి ఉన్న బలం పోయి, జీవితం మీద విరక్తి పెంచుకుంటాడు. ముఖ్యంగా- యువతరం ఈ విషయం గ్రహించండి! పెళ్ళైన వాళ్ళంతా అప్సరసలు- ఊర్వశులు కారు! ఉద్యోగినులందరూ- అఖండ మేధావంతులు కారు ! వాళ్ళకి టైం కలిసివచ్చింది... అంతే! మనకీ వస్తుంది! అప్పటి వరకు వేచివుండాలి!

అంతేగానీ, నైరాశ్యం పెంచుకోకూడదు. 'ఆత్మస్థైర్యం అన్ని విజయాలకీ మూలం...' అని తెలుసుకోండి!!



# పేజీ కొత్తదైనా - అధ్యాయం పాతదే!

కేలండర్‌లో ఒక నెల వెనక్కి పోయిందంటే- కొత్త నెల వచ్చిందన్న మాటే!

వేసవి సెలవులు అయిపోతున్నాయంటే- స్కూళ్లూ, కాలేజీలు మళ్లీ తెరుస్తారన్న మాట! ప్రాథమిక స్కూలు స్థాయినుంచి విశ్వవిద్యాలయం వరకు అన్నిరకాల విద్యార్థినీ విద్యార్థులకు క్షణం తోచదన్నట్టు- ఒకటే పరుగులూ, కంగారు! కాగితాలు నింపటం, అప్లికేషన్లు పట్టుకుని తిరగటం, డొనేషన్లు, ఫీజులు, రకరకాల అర్థింపులు- ఇవన్నీ పరిపాటే!

ఇవన్నీ దాటుకుని సీటు సంపాదించుకోవటమంటే- జీవితంలో ఒక పెద్ద ఘనకార్యం సాధించినట్టు భావించే రోజులివి! చిన్నపిల్లలకి కిండర్ గార్డెన్(కే.జి.) స్కూల్లో సీటు దొరికినా, పెద్దలకి కాలేజీలో సీటు వచ్చినా ఒకటిగానే భావించే స్థాయికి చేరుకున్నాం మనం!

అంటే... చదువులు ఈనాడు ఇంత ప్రాముఖ్యతని సంతరించుకున్నాయన్న మాట! ఎందుచేత?

ఒకప్పుడు విద్య పురుషుడికే ఎక్కువ అవసరమనుకునేవారు. విద్యావంతుడై పురుషుడు- ఉద్యోగంచేసి గృహ బాధ్యత సహించాల్సి వుండేది.

కానీ, స్త్రీ విద్యావంతురాలైతే... ఇంట్లో అందరికీ మార్గదర్శి కావటమేకాక- ఆర్థికంగా కూడా భర్తకి చేదోడు అవుతుందని ఈనాటి మేధావి వర్గం గుర్తించింది కనుక- విద్యావిధానంలో అనేక సదుపాయలూ వచ్చాయి. ఈనాడు బాలికల చదువు అతి సామాన్యమైపోయింది! అంతవరకు ఆమోదనీయమే!

కానీ, చదువుకున్న ప్రతివాళ్ళూ- ఇల్లు చక్కదిద్దటం మాట ప్రక్కనుంచి ఇల్లు గడవటంకోనవే విద్యని ఉపయోగించుకునే ధోరణిలో వున్నాం! అమ్మాయి చదువుకుంటుందంటే- రాబోయే పెళ్ళికొడుకు- ముందుముందు తనకి లాభం- ఉంటుందని ఆశపడ్తున్నాడు.

ఇదే మన దురదృష్టం!

విద్య- ఉద్యోగుల లక్షణమైపోతున్న ఈరోజుల్లో... పరుగులు, పోటీలు కాక- నిదానమైన పద్ధతిలో సవ్యంగా ఎలా సాగుతుందీ?! ఈ కారణంగానే బాలికలకి ఉన్నత విద్యా ప్రమాణాలు- వ్యాపార ధోరణిలోకి వెళ్లిపోతున్నాయి. ముప్పై నలభై సంవత్సరాల క్రితం 'స్త్రీ విద్య' పైన చర్చలు జరుపుకునేవారు.

ఇప్పుడు- 'ఆడపిల్ల కాలేజీ చదువువల్ల ఎంత లాభం.., ఎంత నష్టం..!' అని చర్చించుకుంటున్నారు. 'హైస్కూలు చదువులు పూర్తిగా అయ్యాక అమ్మాయిని పైచదువులు చదివిస్తే ఉద్యోగం వస్తుందా? ఆ చదువుకి తగిన వరుడు దొరకాలి కదా? మళ్లీ కట్నం ఇవ్వాలి కదా?'... ఇలాంటి తర్జన భర్జనలన్నీ ప్రతి కుటుంబంలోనూ ఇంచుమించుగా జరుగుతున్నాయి!

అంటే... ఆడపిల్ల చదువు- ఉద్యోగం- పెళ్ళి... ఇవన్నీ సమాజంలో సమస్యలుగానే మిగిలిపోతున్నాయి! ఆనాడూ, ఈనాడూ ఇదే చర్చ!! చదువులు నేర్చుకుని, ఉద్యోగాలు చేసి ఎన్నో రంగాల్లో విశేష ప్రజ్ఞలు వస్తున్నా- కొత్త ప్రజ్ఞలు ఎన్ని చేస్తున్నా- దానికి తగినట్టు మరికొన్ని సమస్యలు ఉత్పన్నమవుతున్నాయి. పేజీలు కొత్తవే కాని, చరిత్ర పాతదే!

ఎందుకిలా జరుగుతోందని మనం సునిశితంగా ఆలోచిస్తే- కొన్ని విషయాలు తెలుస్తాయి. అమ్మాయి విద్యావతి అయితే- తనకన్నా ఎక్కువ చదువుకున్న అబ్బాయిలను చేసుకోవటం ఎందుకు? కట్నం కోరని సంస్కారిని చేసుకోవాలి.

చదువుని ఉద్యోగం తోటే ఎందుకు ముడిపెట్టాలీ? తానే కొంతమందికి ఉపాధి పథకాలని తయారు చేయకూడదా? విజ్ఞానవతి అయి ఆలోచించగల్గితే- కొత్త పేజీల్లో కొత్త అధ్యాయాలే చదువుతాం... ఏమంటారూ?



# వీధి కొక్కబడి, వీధిబడే!!

"ఏమిటోయ్! ఏం చేస్తున్నావ్? ఎక్కడైనా జాబ్ చేస్తున్నావా?" అని మనకి తెల్సున్న ఓ స్నేహితురాల్ని కదిలిస్తే -

"మరే! ఉద్యోగం కాదుకానీ- స్వయం ఉపాధి పథకం లాంటిదే చేస్తున్నాను" అని జవాబు ఇస్తుంది.

ఈమధ్య ఇలాంటి ప్రసంగాలు చాలా జరుగుతున్నాయి! ఏదైనా బ్యాంకు లోను తీసుకుని చిన్నతరహా బిజినెస్ ఏదైనా చేస్తోందేమో అనుకున్నామంటే పొరపాటే! పైసా పెట్టుబడి లేకుండా, రిజిస్ట్రేషన్ కూడా లేకుండా- కనీసం బోర్డు కూడా లేకుండా... ప్రైమరీ స్కూళ్లు నడిపిస్తున్నవారు ఎందరో?!

పదవ తరగతో, ఆపైనో చదువుకోవటం- ఇంట్లో కూర్చుని ఏం చెయ్యాలో తోచక- మరొక రకమైన వ్యాపారానికి పెట్టుబడి పెట్టలేక- ఇలా చిన్నపిల్లల జీవితాలనే పెట్టుబడిగా వ్యాపారానికి దిగే విద్యావంతుల్ని ఏంచేయాలి?

ఇంట్లో పిల్లలతో అల్లరి భరించలేక- దూరపు స్కూళ్లకి పంపలేక- తమ వీధిలోనే వుండే స్కూలుకి పంపి- ఇంట్లో విశ్రాంతిగా వుండే తల్లుల్ని ఏమనాలి?

ఇది ఒకవిధంగా 'ట్యూషన్' అనుకుంటే పర్వాలేదు కానీ, స్కూలు లాగానే ఫీజులు కట్టడం- డ్రస్సులు కుట్టించటం- వేళకి పంపించటం- తీసుకురావటం- వాళ్ళ ఆరాటం చూస్తే- జాలి వేస్తుంది!

ఎందుకంటే... వాళ్ళ పిల్లలు చదివే స్కూల్లోని సర్టిఫికెట్సు చెల్లవనీ- ప్రభుత్వ పాఠశాలల్లో ప్రవేశం వుండదనీ- గ్రహించలేకపోతున్నారు. ఏడవ తరగతి వరకు చదివించుకుని ఆ తర్వాత ప్రభుత్వం వారి (గవర్నమెంట్) పరీక్షకు కట్టించవలసిందే

తప్ప- ఈలోపులో చదివిన చదువుకి ఏ ప్రభుత్వపు స్కూల్లోనూ ప్రవేశం దొరకదు! ఒకవేళ దొరికినా వారు పిల్లల్ని పరీక్షించి చూస్తారు. ఆ పరీక్షలో నెగ్గగలవారు చాలా తక్కువే! ఎలా ఉత్తీర్ణులవుతారు? వాళ్ళు చదివి వచ్చిన స్కూళ్లలో పంతులమ్మ (పంతుళ్ళు) చెప్పేవి పాఠాలా? వాళ్ళు సిలబస్ అనుసరించి చెప్తారా? వాళ్ళు ట్రైనింగ్ అయినవాళ్ళా?

'విద్య'ని ఒక వ్యాపారంగానూ, కుటీర పరిశ్రమగానూ మార్చే దురదృష్టం పట్టాక- ఆ విద్యాబోధ- వ్యాపార సరళిలోనే సాగుతుంది తప్ప- శ్రద్ధతో- నిజాయితీతో సిలబస్ ప్రకారం సాగదు. అంత శ్రద్ధ, లక్ష్యం వుంటే- చక్కగా అనియత విద్యా కార్యక్రమం చేపట్టవచ్చును కదా? పనిపాటలు చేసుకునే శ్రామికజాతి పిల్లలకి నాల్గు అక్షరం ముక్కలు నేర్పవచ్చును కదా? ఉహూ! వాళ్ళ దగ్గర ఫీజులు రావు! అయినా... ఈమధ్య అనియత విద్యా ప్రణాళిక కోసం ప్రభుత్వంవారు నిధులు కేటాయించారు! అందుకోసం చాలామంది ఆ కార్యక్రమం హడావిడిగా ప్రారంభించేస్తున్నారు (నిధుల కోసం!) అంతేకాని, ఆ పిల్లలకి అక్షరం ముక్కలు వస్తున్నాయా? లేదా?... అన్నది ఎవరూ చూడటం లేదు (ప్రభుత్వమే చూడటం లేదు)

అందుచేత- ఈనాడు 'విద్యాబోధ' ప్రైవేటు సూళ్ళుగా మారింది! వీధి కొక్కబడి- ఇంకా చెప్పాలంటే... నాల్గిళ్ళ చావిళ్ళ (మండువాలోగల)లో రోకళ్ల దంపుడులాగా- ఉపాధితెరువుగా మారింది! దీనివల్ల చిన్నారి పిల్లల భవిష్యత్తు దెబ్బతింటుందని- తల్లులూ, తండ్రులూ గ్రహించాలి! తమ పిల్లలకి చేతనైతే తామే చెప్పుకోవటం ఉత్తమం!

ప్రభుత్వం స్కూళ్లని తేలికగా చూసి- పబ్లిక్ స్కూళ్లు, ప్రైవేటు స్కూళ్లు గొప్పవనుకుని- ఇంగ్లీషులో 'మమ్మీ- డాడీ' అంటారనీ మురిసిపోకండీ!

'మమ్మీ...' అన్నా, 'అమ్మా...' అన్నా- ఆ పిలుపులోని ప్రేమ శాశ్వతమని గుర్తించండి! ఆ ప్రేమకి దూరం చేయకండి! ఇంట్లో మీరు స్వయంగా పిల్లలకి చెప్పలేకపోతే- గుర్తింపు వున్న స్కూళ్లలో చేర్చండి! కుక్కగొడుగుల్లా పుట్టున్న వీధి బడులకి పంపి- పిల్లల భవిష్యత్తు పాడుచేయకండి!

'విద్య' గౌరవించిన రోజుల్లో వీధిబడులైనా- ఉచితంగా వుండి, మహావ్యక్తుల్ని తీర్చిదిద్దాయి! ఆ ఉపాధ్యాయుల ధ్యేయం వేరు!

కానీ.., ఈనాడు ప్రతిదీ వ్యాపారం! కనుక తల్లులూ, తండ్రులూ ఆలోచించాలి!



# ఎందెందు చూచిన అందందే!

ఉదయం తొమ్మిది లోపు- ఏ సందులో చూచినా, వీధిలో చూచినా- మెయిన్‌రోడ్ల మీదా- బిలబిలలాడుతూ... పిల్లలే పిల్లలు! స్కూలు పిల్లలు!!

రకరకాల యూనిఫారాల్లో బ్యాగులు, బూట్లు, టిఫెన్ డబ్బాలు, నీళ్ల సీసాలు... ఒకటే పరుగులు- ఒకటే తొందర!

అన్నిరకాల యూనిఫారాలు చూస్తుంటే- అబ్బ... ఇన్ని స్కూళ్లు వున్నాయా?... అని ఆశ్చర్యం వేస్తుంది.

నిజమే... వున్నాయి! నాల్గు వీధులకొక స్కూలు- రెండు సందులకొక 'కిండర్ గార్డెన్' స్కూలు చొప్పున- ఈనాడు వెలిసిన ఈ స్కూళ్లు- దుకాణాలు నయమనిపిస్తున్నాయి.

అయితే... ఇవన్నీ ప్రభుత్వం స్కూళ్లు కాదు! ప్రైవేటు స్కూళ్లు!! ఎవరి చిత్తమొచ్చినంత ఫీజు వాళ్ళు పిల్లల నుంచి వసూళ్లు చేస్తున్నారు. మరి, అలా చేయకపోతే అక్కడ చదువు చెప్పే టీచర్లకి జీతం ఎక్కడ్నుంచి వస్తుందీ? అందుకని- పిల్లల దగ్గర నుంచి ఫీజులు ఎక్కువ తీసుకుంటున్నారు.

పైగా... డొనేషన్లు! ఒక్కోసారి డొనేషన్ అవసరాన్ని బట్టి పెరిగిపోతుంది!

అయినా... తల్లిదండ్రులు- ఫీజులు కట్టి పిల్లల్ని చదివిస్తూనే వున్నారు!

ఎందుకంటే- అవి ఇంగ్లీషు మీడియంవి! తల్లిదండ్రులకి మోజు! ఇంగ్లీషు చదువులవల్ల లాభం బాగా వుంటుందనీ, మంచి తెలివితేటలు వస్తాయనీ- ఆశ!

అసలు- ఈ స్కూళ్లు ఇలా ఎందుకు వెలుస్తున్నాయి? అని ప్రశ్నించుకుంటే- జవాబు విని విచారించాల్సివుంటుంది! చదువుకున్న యువతీ యువకులు, ఎక్కడా

ఉద్యోగాలు దొరక్క- ఊరికే కూర్చోలేక- పదిమంది పిల్లల్ని పోగుచేసి చిన్న స్కూలు నడపటం మొదలెట్టారు! విద్యాశాఖాదికారి ఆమోదమో, ఇన్స్పెక్టర్ ఆఫ్ స్కూల్ అనుమతి లభించగానే (దానికోసం నానాతంటాలు పడతారు) అదికాస్తా ఇంగ్లీషు మీడియం స్కూలునో, కాన్వెంటుగానో పేరు తగిలించుకుని- ఇక ఫీజులు బాగా తీసుకుంటూ వుంటారు!

కానీ, ఎమ్.ఏ.లూ, బి.ఏ.లూ చదివినవారు- మంచి నియమ నిబంధనలతో స్కూలు నడిపితే- అందరికీ సంతోషమే!

కానీ- టెన్త్‌క్లాసు ప్యాసైన వాళ్ళూ, ఇంటర్ ప్యాసైన వాళ్ళూ, చిన్నచిన్న స్కూళ్లు పెట్టి- విద్యాభ్యాసం కన్నా ఫీజు మీదే ఎక్కువ దృష్టి నిలిపే ఈనాటి యువతీ, యువకుల్లారా... ఒక సంగతి మరిచిపోకండి! మనకి సంపాదన ముఖ్యం కావచ్చును- కానీ, చిన్నపిల్లల్కి చదువు ముఖ్యం! కలకాలం ఉపయోగపడేది... విద్య! దానికి పసితనంలో- ప్రాథమిక విద్యాభ్యాసంలోనే 'పునాది' గట్టిగా, బలంగా వుండాలి. అంతేకాని- ఏ టెన్తో, అంతకంటే తక్కువ చదువుకునో- చిన్నపిల్లలకి విద్యాబోధ చేస్తాననటం.... అన్యాయం అనిపిస్తుంది!

పునాది రాయి గట్టిగా వుండాలి!

విదేశాలలో- చిన్నపిల్లలకే ఎక్కువ ప్రాధాన్యత నిచ్చి- చిన్న క్లాసుల వాళ్ళకి, పెద్ద చదువులు చదివినవారు- టీచర్‌గా పాఠం బోధ చేస్తారు.

కానీ, మన దురదృష్టం ఏమంటే- చిన్నపిల్లల చదువుల దగ్గరే నిర్లక్ష్యం చేస్తున్నాం! ఏ కాస్త చదువుకున్నవాళ్ళైనా- ఈనాడు చిన్న స్కూలు నడపకానికి సిద్ధమవుతున్నారు. అందుకే ఇన్నేసి స్కూళ్లు వెలుస్తున్నాయి!

చిన్నపిల్లలకి పునాది రాయిలాంటి ప్రాథమిక విద్యే బలహీనంగా వుంటే- ఇక వాళ్ళ భవిష్యత్తు ఏ రీతిలో బాగుపడుతుంది!?

స్కూళ్ల సంఖ్య కాదు పెరగాల్సింది-

పిల్లల తెలివితేటలు.., మార్కులు!! విద్యావిధానాన్ని వ్యాపారంగా మార్చటం క్షమార్హం కాదు!!



# పిల్లలందు అల్లరి పిల్లలుందురయా!

కాల ప్రభావమో- తల్లి దండ్రుల పెంపకంలో లోపమోకానీ.., ఈనాటి పిల్లల్లో చాలామంది పెంకిగానూ, అతితెలివిగానూ ప్రవర్తిస్తున్నారు. వాళ్ళ చేష్టలూ, మాటలూ తల్లికీ, తండ్రికీ ముద్దుగా, గారంగా ఉండవచ్చును కానీ- ఇతరులకి ఎంత విసుగు, కోసం తెప్పిస్తాయో?!

ఎవరైనా అతిథులు ఇంటికి వస్తే- పెద్దవాళ్ళకన్నా ముందు పిల్లలే వాళ్ళ యోగక్షేమాలడగటం, అక్కర్లేని కబుర్లు చెప్పటం, కొంతమంది ఇళ్ళల్లో అలవాటు. మర్యాద చేయటంలో కూడా కొంత పరిధి వుంటుంది! అది దాటుకుని, అందునా చిన్నపిల్లలు అలా ప్రవర్తిస్తే- వచ్చిన చుట్టాలకో, పరిచయస్తులకో విసుగు వస్తుంది.

అదే కొంత హద్దుల్లో వుండి- "మా నాన్నగారు లోపల స్నానం చేస్తున్నారు. కూర్చోండి ఇప్పుడే వస్తారు! మంచి నీళ్లు కావాలా?" అని అడిగేరనుకోండి. వచ్చినవాళ్ళకి ముచ్చటగా, ముద్దుగా వుంటుంది!

అలాకాక- "మీరెవరూ... ఏం పనిమీద వచ్చారు? మా నాన్నగారు వచ్చేటప్పటికి చాలా ఆలస్యం అవుతుంది. అంతవరకు కూర్చుంటానంటే మీ ఇష్టం... కూర్చోండి. లేదా మళ్లీ రండి!" అన్నారనుకోండి- వచ్చిన పెద్ద మనుషులకి గుమ్మంలోకి రాబుద్ధివుతుందా?

ఇక కొంతమంది పిల్లలు పక్కఇళ్లల్లోకి వెళ్లి- వాళ్ళకి శుభ్రతని గురించి, పొదుపుని గురించి చెప్తుంటారు.

"అదేమిటీ- ఆ టేబుల్ మీద కంచాలు తియ్యలేదూ- మా ఇంట్లో అలా వుంచుకోం" అంటే, "మీ ఫ్రిజ్ తుడవరా? మా మమ్మీ రోజూ శుభ్రం చేస్తుంది. అరెరే! ఆ టూత్‌పేస్ట్ అలా నొక్కేస్తారా! ఎంత వేస్ట్ అవుతుందో?", "అదేమిటి ఆంటీ... సబ్బు బాత్‌రూమ్‌లో నీళ్లలో నానిపోదూ? బాక్స్‌లో పెట్టుకోవాలి! మీరు మిక్సీకి కవరు వెయ్యరా? మా ఇంట్లో కవరువేసి శుభ్రంగా వుంచుతాం!" అంటూ ప్రతిదానికీ వంకలు పెట్టడం- బుద్ధులు చెప్పటం- ఎంత ఒళ్లు మండుతుందీ?

ఇక కొంతమంది- కాస్త చనువుగా ఉన్న చుట్టపు బంధువులతోగానీ ఇంటికి వచ్చే పరిచయస్తులతో కానీ, వాళ్ళ అలవాట్లని గురించి ఆరోగ్యసూత్రాలు చెప్పబోతారు.

"అంకుల్! మీరన్ని సిగరెట్లు తాగితే కాన్సర్ వస్తుంది! మానేయండి"- అంటూ సిగరెట్ పెట్టె తీసుకున్నారనుకోండి. అవతలి పెద్దమనిషికి ఏమనిపిస్తుందీ? ఆ పిల్ల లేదా పిల్లాడి చెంప పగలగొట్టాలనిపిస్తుంది!

ఆరోగ్య సూత్రాలు- పొదుపు హెచ్చరికలు- శుభ్రత గురించి చెప్పటం అన్నీ మంచి లక్షణాలే కానీ, ఏ వయస్సుకు తగ్గవారు, ఆ వయస్సు వారికి చెప్తే- సమంజసంగా ఉంటుంది! అంతేగానీ... పదేళ్ల, పదిహేనేళ్ల పిల్లలు తమ వయస్సుకి రెట్టింపువున్న పెద్దవాళ్ళతో బుద్ధి గరిపినట్టు చెప్తే- వినేవాళ్ళకీ, చూసేవాళ్ళకీ విపరీతంగా అనిపిస్తుంది.

ఇంట్లో తల్లిదండ్రులు అతిగారాబంతో పిల్లలు ఏంచెప్తున్నా, ఏంచేస్తున్నా- ఆమోదిస్తే ఆ పిల్లలు ఇంట్లోనేకాక, బయట కూడా తమ ప్రతిభ, ప్రజ్ఞ చూపెట్టబోతారు. నిజంగా పిల్లలకి అన్నీ తెలుసుండి కాదు. 'నేను చెప్తే అందరూ వినాలి' అనే గొప్పకోసం- సినిమాల్లో, నాటకాల్లో లాగ చేస్తుంటారు. చదువు సంధ్యల్లో సాటి పిల్లలకీ అలాగే నీతులు చెప్తుంటారు. ఈ గుణం క్రమంగా అలవాటై, పెద్దయ్యాక ప్రతివాళ్ళనీ విమర్శించేటట్లు తయారవుతారు.

అతివలు- అదుపులేకుండా ముద్దుచేసి పిల్లల్ని పెంచితే- ఆ పిల్లలు- అన్నిటికీ అతిగా ప్రవర్తించి- చెడుపేరు తెచ్చుకుంటారు తప్ప- ఎవరూ మెచ్చుకోరు.

'పిట్టకొంచెం- కూత ఘనం!' సామెతలాగ తయారయ్యే పిల్లలు ముదురు వంకాయల్లాగ- పనికిమాలిన వారవుతారు.

పక్కింటి ఆంటీ చీరపై మ్యాచింగ్ బ్లౌజు దగ్గర్నుంచీ- ఎదురింటి అంకుల్ సిగరెట్ బ్రాండ్‌దాకా- ప్రతి విషయాన్ని విమర్శించే పిల్లలు- సమాజంలో మంచిపేరు తెచ్చుకోలేరు.

ఈ 'అతి' చురుకుదనమో, లేక గొప్పో... చిన్నప్పుడే పిల్లల్ని కంట్రోలు చేసి హద్దులు దాటనీయకుండా పెంచాలి!

అంతేగాని- నవ్వుతూ, మెచ్చుకోలుగా చూసి పిల్లల్ని మరింత విజృభించేలా చేస్తే- 'తోటకూరనాడే చెప్పకపోతివా అమ్మా' అన్న సామెతగా- బాధపడాల్సి వస్తుంది... భవిష్యత్తులో!!



# గందరగోళ సాహిత్యాలు

చిన్నప్పుడు కొన్ని పదాలకి అర్థం తెలియక పెద్దవాళ్ళు వాడే భాషని గ్రహించలేక మనం తికమక పడటం జరిగేది!

మనం పెద్దయ్యాక సమాజంలో పరిస్థితులు అనుభవంలోకి వచ్చాక- సరిగ్గా మనం అవే పదాలు ఉపయోగిస్తూవున్నాం! అందులో 'గందరగోళ సాహిత్యం' ఒకటి!

ఈనాడు- కళల పట్ల ఆసక్తి అయితేనేమి- ఇదొక 'వెర్రి' అనుకుంటేనేమి- వ్యాపార సరళి అనుకున్నా సరే- మొత్తంమీద సంగీత, నృత్య, సాహిత్యాది కళల యందు చాలామందికి మక్కువ, మోజు, ఆసక్తి, ఇత్యాది అనేక ప్రేరణల వల్ల ఆ కళలు ఇప్పుడు బాగా ప్రచారం అవుతున్నాయి!

ప్రతివారూ తమ పిల్లలకి భరతనాట్యం, కూచిపూడి లాంటి నృత్యాలు నేర్పించాలని ఉబలాట పడుతున్నారు. సంగీతం నేర్పించేవారు కొందరు, కవిత్వాలు, కథలు వ్రాసేసేవారు కొందరు.

'అబ్బో!! మన దేశం ఏమిటీ... ఇలా కళానిలయమై పోయి, సాక్షాత్తూ ఆ శారదాదేవి దివి నుండి భువికి దిగి వచ్చేసిందా... అనుకోవచ్చును. కానీ, కొంచెం అనుకునేముందు- 'ఈ కళలు ఎలా వున్నాయి? ఉంటున్నాయి?' అని యోచన చేస్తే మంచిది.

అందరికీ పనికివచ్చే అద్దం లాంటిది- ఈనాటి మన దూరదర్శన్!

అమ్మాయిగానీ, అబ్బాయిగానీ తన బొమ్మ తను చూసుకుంటాడన్నంత సంతోషంతో ప్రతివారు- కొద్దోగొప్పో నేర్చుకోగానే దూరదర్శన్ ఛాన్సుల కోసం ప్రాకులాడటం, కార్యక్రమాలు ఇప్పించటం.., ఇక ఆ తరువాత వాళ్ళు చూసుకుని ఆనందించుకోవటం అయితే బాగానే వుంటుంది.

కానీ, మిగతా ప్రేక్షక జనం మాటో?! మనమ్మాయి చిట్టి అడుగులు వేసినా, 'ఆఁ...' అని రాగం తీసినా మనకి బాగుండవచ్చును. అంతమాత్రం చేత- 'మిగతావాళ్ళనీ ఆనందించండి' అంటే ఏం సబబు?

ఈమధ్య కొన్ని ప్రోగ్రాములు బాగా లేకపోయినా- చచ్చినట్లు ప్రేక్షకులు చూడాల్సి వస్తోంది!

అలాగే 'కవితలు' అని కొత్త కవులు (ఇప్పుడిప్పుడే కలం పట్టున్నవారు) సభల్లో 'గానాలు' చేస్తున్నారు.

అవి కవితలా? మనం మాట్లాడుకునే మాటలే! కర్త-కర్మ-క్రియలో కర్తనో, కర్మనో ముందువెనుకగా జరిపేసి- అశ్లీల పదాలు వేసి, రాసి- ఇది 'శృంగార రసం' అంటే మనం వినాలా? కుప్పతెప్పలుగా వానజల్లులు కురిసిపోతోంది ఈనాటి కవిత్వ ధోరణి! వేదిక మీదకి పిలవకపోతే మనదే దోషం! అన్నట్టుగా పిలిచేసరికి చదివేస్తున్నారు అందరూ. కానీ ఏదీ? ఒక్కదాంట్లో అర్థం కనిపించదేం?

ఇక... దూరదర్శన్‌లో, చర్చాగోష్ఠులలో, స్త్రీలతో చాలా కార్యక్రమాలు నడిచేయి! ఒక విషయం మీద మాడ్రేటర్ అడిగేక- చక్కగా మిగిలిన నలుగురు చెప్తూ వుంటే- విని తాను అందరి ఉద్దేశాలనీ సమన్వయపరిచి- ప్రేక్షకులకి తెలియచెప్పటం ధర్మం!

కానీ- చెప్తున్న వాళ్ళ మాటలకి అడ్డం తగిలి వాళ్ళని చెప్పనీయకుండా తాను చెప్తూ- మిగిలిన వాళ్ళకి సమయం చాలనీయకుండా- చర్చ పూర్తిగా సాగనీయకుండా- అందరిలో తనే కలయబడిపోతూ- ముగించే ఈ చర్చా గోష్ఠులు విన్నాక- మనం తప్పకుండా అనుకోవాల్సి వస్తుంది... 'ఈ గందర గోళ సాహిత్యాలకి ఏమిటి విలువ? ఈ దేశం కళల నిలయమైందా? కలహాల ఆలయమవుతోందా?' అని!



# అందమైన అబద్ధాలు!

'ఆడది అబద్ధమాడితే గోడ పెట్టినట్టుంటుందనీ- మగవాడు అబద్ధమాడితే- తడిక పెట్టినట్లు- అన్నీ కన్నాలే కనిపిస్తా...' యనీ మన పెద్దవాళ్ళు అంటూ వుంటారు.

ఇది ఎంతవరకు నిజమన్నది మనం తెలుసుకోనక్కర్లేదు గానీ- అబద్ధాన్ని అందంగా చెప్తే- ఆడవాళ్ళైనా సరే... నిజాన్ని మరపింపచేయగలరని మాత్రం చెప్పవచ్చును.

భర్త చాటుగా మారుబేరాలు నడిపే భామామణులు- చీరలు, స్టీలు సామాన్లు, చిట్టీలు- లాంటివి కొనటానికీ, నడపటానికీ ఎంత చక్కని అబద్ధాలు చెప్పగలరో? ఇంటి జమా ఖర్చులు లెక్కవేసి- కూరగాయల ఖర్చుల్లో, నెలసరి వెచ్చాల్లో కొంత మిగిల్చి- ఆ డబ్బుతో తమ కోరికలు తీర్చుకుంటారు.

భార్య కొత్త చీర గమనించి, 'ఇదెక్కడిద'ని భర్త అడిగేవాడైతే-

"మొన్న పండుగకి మా అమ్మగారు వాళ్ళు పెట్టింది ఇదే!" అనేస్తుంది.

కొత్త స్టీలు గిన్నో, కంచమో చూసి- "ఇదెప్పుడు కొన్నావు?" అంటే-

"అదేమిటి? అప్పుడే మరచిపోయారా? మొన్న మా తమ్ముడు మా నల్గురు అక్కచెల్లెళ్ళకీ కొన్నాడు గదండీ?" అమే ఎదురుప్రశ్న వేస్తుంది.

"కాబోలు" అనుకునే భర్త అయితే- ఆవిడ అబద్ధం ఎంత అందంగా రక్తి కట్టుందో- మనం ఊహించుకోవచ్చును.

ఇల్లు దాటి బయట వాతావరణంలో- ఇక ఇలాంటివాళ్ళు ఎన్నెన్ని కబుర్లు అల్లేయగలరో- వినేవాళ్ళు ఎంత భ్రమలో పడిపోతారో చెప్పడం కష్టం!

"వచ్చే నెలలో మేము స్కూటర్ కొంటామండీ- మావారు అసలు కారు కొనేద్దాం అంటున్నారు. నేను వద్దన్నాను. స్వంత ఇల్లు కట్టుకున్నాక కొనవచ్చును- ప్రస్తుతం స్కూటరే కొనమన్నాను" అని చెప్తుంది ఓ ఇల్లాలు.

'నిజమే కాబోలు...' అనుకుంటాం!

ఎందుకంటే- ఆవిడ ఎప్పుడూ గొప్పగానే వుంటుంది. 'వాళ్ళాయన అసిస్టెంట్ ఇంజనీర్ అంటుంది!' మనం సందేహించలేం! కానీ, వాళ్ళవారు- డిప్లమో హోల్డర్ చేసి- ఇంజనీర్లతో సమానంగా చూడమని- మొరపెట్టుకుంటే- ఆ విధంగా ప్రభుత్వం వారు- స్కేల్పు సరిదిద్దారనీ- పేరుకి ఇంజనీరే గాని- ఆవిడ చెప్పేదంతా అబద్ధమని మనకి తెలియదు. అతను స్కూటర్- అలావుంచి, టి.వి.ఎస్. కూడా కొనడు.

ఆ తర్వాత మళ్లీ మరో అందమైన అబద్ధంతో స్కూటర్ అధ్యాయం మూసి మరో అధ్యాయం విప్పుతుంది!

మగవాళ్ళు కూడా ఆఫీసుల్లో చక్కటి అబద్ధాలల్లి- "మా మిసెస్ గ్రాడ్యుయేట్! కానీ, తనకి జాబు చేయటం ఇష్టంలేదు. సోషల్‌వర్క్ చేస్తుంది" అంటూ చెప్తారు.

నిజానికి ఆవిడగారు- టెన్త్‌క్లాసు ఫెయిలై, మళ్లీ కట్టే ఓపిక లేక- పిల్లలకి ఇంట్లో హోంవర్క్ అయినా చేయించక బద్ధకించి- పక్కవాళ్ళతో కబుర్లు, నవలలు చదువుకోవటం చేస్తుంటుంది!

ఇదిగో... ఈ రకమైన అబద్ధాలు అందంగా, వినోదంగా వుంటాయనుకోండి!

కానీ- ఎందుకిలా జరుగుతోందని ఆలోచిస్తే- ఒక నిజం తెలుస్తుంది!

తన పరిస్థితి నలుగురిలో గొప్పగా వుండాలనో, భర్తకి- తన మాట వినకపోతే- ఆమెని ఏమీ చెయ్యలేక- ఊహల్లో సంతోషపడ్తూనే- ఇలాంటి మానసికదౌర్బల్యం చేత భార్యాభర్తలు- సర్వ సాధారణంగా అబద్ధాలు చెప్పి గొప్పగా బ్రతకాలని చూస్తారు.

వాళ్ళకంటే పైమెట్టులో అబద్ధాలు ఆడేవారు ఎదురైతే..? విడిపోయాయంటే- పాపం! వాళ్ళ మనసులు ఎలా వుంటాయి?!! ఆలోచించండి!!



# ఊపే కానీ, ఉపన్యాసం కాదు!

ఇవాళ ఫలానాచోట ఉపన్యాసం వుంది- వెళదామని ఎంతో ఉత్సాహంతో వెళతాం!

వేదికనెక్కి అరగంటసేపు ఉపన్యసించి కూర్చుంటారు- పెద్ద మనుష్యులు.

మన ప్రక్కనున్న వాళ్ళు మనల్ని అడుగుతారు-

"ఏమండీ? వాళ్ళు ఇప్పుడు చెప్పినదాంట్లో అర్థం ఏమిటండీ?" అని!

మనం ఏం చెప్పగలం? మనకీ అర్థమైవుండదు- ఆ ఉపన్యాసం!

అందుకే వెర్రినవ్వు నవ్వి, "నాకూ సరిగా బోధ పడలేదండీ!" అంటాం!

ఇలాంటి సన్నివేశాలు మనకి చాలాచోట్ల తటస్థపడుతూనే వుంటాయి! అరగంటసేపు వాళ్ళు చెప్పినదాంట్లో సారాంశం రెండే రెండు ముక్కలు! స్త్రీకి ఎంత అవకాశాలువున్నా వినియోగించుకోలేకపోతోంది! కనుకనే అనుకున్నంత ప్రగతి సాధించలేక పోతోంది! అని.

ఈ మాట- మెలికలు తిప్పి, రంగులు పూసి, వెనక్కీ ముందుకీ ఊపి- ఏం చెప్తున్నారో మరచిపోయి- మళ్లీ మొదటికి వచ్చి- సుదీర్ఘ ద్వంద్వ సమాసాన్ని ప్రయోగించి- మధ్యమధ్యలో ఇంగ్లీషు పదాలు వేసి- ఉపన్యాసం ముగిస్తారు కొందరు.

వినేవాళ్ళకి బుర్ర గందరగోళమై- దాని సారాంశమైన అర్థంచేసుకోలేక- వెర్రిముఖాలు వేయాల్సివస్తుంది!

వేదిక మీదే కాదు- దూరదర్శనూ, రేడియోలోనూ కూడా కొన్ని చర్చావేదికలు ఇలాగే అసందర్భ ప్రేలాపనలాగా వుంటున్నాయి!

విషయాన్ని చక్కగా, ఇంపుగా, తేలిక పదాల్లో- వినేవాళ్ళకి అర్థమయ్యేలాగా చెప్పటమే- చర్చావేదికల ఉపయోగం! అంతేగానీ, మనకున్న భాషా ప్రజ్ఞనంతా ఉపయోగించి- గారడీ చేసినట్టూ, సర్కస్ ఫీట్లు చేసినట్టూ- మాట్లాడితే- వినేవాళ్ళు డిక్షనరీలు తెచ్చుకుని అర్థాలు వెతుక్కోలేరు గదా?!

ఈమధ్య ఒక ఉపన్యాసం ఇలా సాగింది!-

"విద్యార్థి దశలో సబ్జెక్టు చదువుకోవటం తప్ప- జీవితంలో వాళ్ళు దానిని ఉపయోగించుకోలేకపోతున్నారు. సమాజంలో మొదటినుంచి పితృస్వామ్యం అధికారంలో వుంది. స్త్రీకి చాలా అవకాశాలున్నాయి. ఎన్నో చట్టాలున్నాయి! స్త్రీ అభివృద్ధి సాధించాలి! డాక్టర్లు- ఇంజనీర్లు- లాయర్లు- వున్నారు. స్త్రీ విద్యా ప్రణాళికలో మార్పులు రావాలి! చిన్నప్పట్నుంచీ భేదాలు చూపే పద్ధతి పోవాలి! తల్చుకుంటే స్త్రీ ఎన్నో సాధించగలదు! సాధిస్తోంది! అయినా ఇంకా మార్పు రావాలి- స్త్రీ పురోభివృద్ధికి ఆటంకపరచే వ్యతిరేక శక్తులని, నిరోధించే సంఘ పోరాట ఉద్యమంలో స్త్రీ పాల్గొనాలి!"

- ఈవిధంగా ముప్పావుగంట ఉపన్యాసంలో... ఒక్కొక్కదాన్ని కనీసం రెండు మూడుసార్లు చెప్పి- ముగించారు.

సబ్జెక్టులు చదువుకోవటమేగానీ, ఉపయోగించుకోలేక పోతున్నామని చెప్పినప్పుడు- మళ్లీ విద్యా ప్రణాళికలు మారాలి అని చెప్పటంలో ద్వంద్వార్థం గోచరించటం లేదా?

చాలా ఉన్నత విద్యనభ్యసించినవారు కూడా- ఉపన్యాసాలు ఇవ్వటంలో తడబడిపోతున్నారు. చర్చావేదికల్లో కూడా- విషయం వదిలి ప్రక్కదారుల్లోకి మళ్లిస్తున్నారు.

దీనికి కారణం ఒకటే! మామూలుగా స్వేచ్ఛగా మాట్లాడేవారిని ఉపన్యాసం ఇవ్వమంటే- వాళ్ళు ఇబ్బంది పడిపోతున్నారు.

ఇక రెండోది- కొంత కాలనిర్ణయం ఏర్పరిచేసరికి- దానికి సిద్ధం కాలేకపోతారు. అందుకే కొన్ని ఉపన్యాసాలు అసంపూర్తిగా ముగుస్తాయి! కొన్ని అర్థమవవు!

విద్యావంతులు అందరూ వక్తలవరు! వక్తలందరూ- విద్యావంతులు కానక్కర్లేదు! కొందరు ఎంతో చిన్న పదాలతో విషయాన్ని శ్రోతలకి అర్థమయేలాగా చెప్పి రక్తికట్టిస్తారు!

మాట్లాడటం ఒక కళ!

నలుగుర్ని ఆకట్టుకుని చెప్పటం- ఒక ప్రజ్ఞ!

అంతేగాని- మనకి వచ్చిన విషయ పరిజ్ఞానాన్ని వెల్లడించుకుందుకు- ట్విస్టులు చేసి- ఉపన్యాసాలు ఇవ్వటం- శ్రోతల్ని బాధించటమే తప్ప మెప్పించటం కాదు!



# అంతులేనివి
# - అతివల సమస్యలు!

మార్చి ఎనిమిదో తారీఖు వెళ్లింది!

'అయితే ఏమిటట? ఎన్నో ఎనిమిదో తారీఖులు వెళ్తూవుంటాయి గదా?' అనుకోవచ్చును కానీ, మార్చి ఎనిమిదంటే... మరి అన్ని ఎనిమిదుల్లాగ కాదుగదా?!

అంతర్జాతీయ మహిళా దినోత్సవం!

అబ్బో! మహిళలకి ప్రత్యేకించిన దినం అన్నమాట?! ఒక దశాబ్దంపాటు మహిళల కోసం ఎన్నో అభ్యుదయ పథకాలు రూపొందించి- ఎంతో ప్రగతి సాధించేయాలనుకుని ఏర్పాటుచేసిన దశాబ్దకాలంలో- అభ్యుదయాల మాటకన్నా అపశ్రుతుల సంఖ్య మిన్నగా కనిపిస్తోంది! అందుకే ఇంకా చేపట్టవలసిన బృహత్తర కార్యక్రమాల పథకం మిగిలేవుంటోంది!

చట్టాలెన్ని వచ్చినా- సమస్యలు ఏమీ తగ్గలేదు.

చదువులెంత పెరిగినా- సంస్కృతి ఏమీ పెరగలేదు.

ఉద్యోగాల శాతం పెంచినా- ఉపాధి వెతుకులాటలు తగ్గలేదు.

కట్నాలు తగ్గలేదు, కన్నీరు ఆగలేదు, హత్యలు తప్పలేదు, ఆత్మహత్యలు మానలేదు. మానభంగాలు, వేధింపు చర్యలు, ఆదనపు వేదనలై- అతివల పాలిట అహోరాత్రులు శత్రుత్వం సాగిస్తున్నాయి!

ఇక మహిళాదినోత్సవం గురించి చెప్పుకోవలసిన ఘనత ఏముందీ?

అమ్మాయి చదువు- పెళ్ళి- ఉద్యోగం- సంసారం- అన్నీ సమస్యలే!!

నూటికి పాతిక, ముప్పై మంది నిశ్చింతంగా వుంటే ఏం లాభం? మిగిలినవారి మాటో?!

ఏదైనా ఒక ప్రణాళిక ద్వారా ప్రగతి సాధించాలనుకున్నప్పుడు- ఆ ప్రణాళిక పటిష్టంగా వుంటేనే అది సాధ్యం! లేకపోతే- ప్రణాళిక దారి దానిదే- ప్రగతి, అధోగతే!!

స్త్రీలని గౌరవించాలనీ- సమాజంలో నైతిక విలువల్ని పెంపుచేయాలనీ- అశ్లీలాన్ని అరికట్టాలని పెద్దలంతా చెప్తున్నా- కనీసం సినిమా పోస్టర్లు, మాగజైన్ల మీద వుండే అశ్లీల చిత్రాల్నే అరికట్టలేకపోతున్నారు. ప్రతిదానికీ రూలు, రూలు, ప్రొసీజర్ అంటే కాలాతీతమే తప్ప- కార్యశూరత్వం కనిపించదు.

కంటికి ఎదురుగా- చెరువంత బొమ్మలు అసభ్యంగా గోడలమీద, నాలుగురోడ్ల మీద కనిపిస్తుంటే- అది నిజమేననీ, మహిళలంతా సంతకాలు చేసి ఫారాలు నింపి పంపాలనీ, అప్పుడు చర్యలు తీసుకుంటామనీ- పెద్దలు చెప్పటం ఎంత హాస్యాస్పదంగా వుంటుందో ఆలోచించండి!

పరీక్ష హాల్లో- అమ్మాయిని నిలబెట్టి, టీచర్లముందు- సజీవ దహనం చేస్తే- అది పాఠశాలా? బలిపీఠమా?

-ప్రయాణం చేయాలంటే అమ్మాయిలు గుండెలు అదిరి, 'బాబోయ్...' అనుకునే రోజులువస్తే- అది మహిళాభ్యుదయమా?

ఎంతసేపూ టీ.వీ.ల్లో, రేడియోల్లో గ్రామీణ స్త్రీలకి చేసే సేవా కార్యక్రమాలూ, ఆరోగ్య శిబిరాలూ, కుటుంబ సంక్షేమ పథకాలూ, టీకాలూ, రోగాలూ చూపిస్తారే తప్ప- ఆడపిల్ల స్వేచ్ఛగా, హాయిగా- నిర్భయంగా చదువుకుని ఉద్యోగం చేసుకుంటూ- కట్నం లేకుండా పెళ్ళిచేసుకుని సుఖంగా బ్రతుకుతున్న దృష్టాంతాలు చూడగలుగుతున్నామా?

చివరికి... వినోదం కోసం చూసే సినిమాల్లో కూడా- ఆడపిల్లని పెడుతున్న అల్లరి, తల్లిదండ్రుల అవస్థలే చూడాల్సివస్తోంది! లేదా- వెర్రిగంతులూ, డ్యూయెట్లూ, అర్ధనగ్నపు అలంకరణటూ..!! ఇదా ప్రగతంటే??

ఎన్ని మహిళా దినోత్సవాలు జరుపుకున్నా- మానసికమైన మార్పు రానంతవరకు- విజయం లభించదు.

మహిళల్లోగానీ, ఋషుల్లోగానీ- మొత్తంమీద సమాజపరంగా- సంస్కారం కలిగినపుడుగానీ- శుభ ఫలితాలని సాధించలేం!!



# అధికార దర్పాలు

మన సమాజంలో చాలా మందికి- తమ పదవులు ద్వారా, వ్యక్తిగత పెద్దరికాల ద్వారా దర్పాలు చూపించటం అలవాటు!

ఆఫీసులో ఉన్నతోద్యోగంలో వున్న స్త్రీ- ఆ ఆఫీసులో ఉన్నంతవరకు తన అధికారాన్ని ఉపయోగించుకోవచ్చును. కానీ, ఇంటి దగ్గర కూడా- 'నేను ఆఫీసర్ని ఏమనుకుంటున్నారో..?!' అన్నట్లుగా ఇరుగుపొరుగు వాళ్ళ మీద గొప్పలు- డాబులు చూపిస్తే -వాళ్ళెందుకు ఊరుకుంటారు? ఆమె వాళ్ళకి జీతం ఇస్తుందా? పోషిస్తుందా? లేక, ఆమె చేతిక్రింద వాళ్ళు పనిచేస్తున్నారా?

ఇవన్నీ ఆమె ఆలోచించదు! ఆఫీసులో అధికారం చేసి- అదే బుద్ధి జీర్ణించుకుపోయి, ప్రతిచోటా దర్పం చూపిస్తే- మిగతావాళ్ళు సహించరన్న వివేకం ఆమెకుండాలి!

ఇంకా విచిత్రమైన విషయం ఏమంటే... తమ భర్త పెద్ద పదవిలో వుంటే- ఆ హోదాను తాను ఉపయోగించుకునే స్త్రీలు మన సమాజంలో బోలెడుమంది వున్నారు. 'పేనుకి పెత్తనం ఇస్తే తలంతా చెడకొరికింది' -అన్నట్టుగా... తన భర్తకి పదవి వుంటే అది తను ఉపయోగించుకుంటే ఎలా భరించటం?

ఇక... కొంతమంది మహిళలు ఎక్కడైనా ఉపన్యాసాలూ, సభలూ జరిగేచోటుకి వెళితే- తననేదో పట్టం గట్టి వేదికని ఎక్కించలేదని రుసరుసలాడుతారు.

'నేనంటే ఏమనుకుంటున్నారూ? ఎన్ని సమావేశాల్లో పాల్గొన్నానూ? ఎన్ని ఉపన్యాసాలు ఇచ్చేనూ? ఎన్ని చర్చల్లో మాట్లాడేనూ? నా అంతటి వక్త ఇక్కడుంటే మీరు గుర్తించరా?'... అన్నట్టుగా ప్రక్కవాళ్ళతోటీ, కార్యకర్తలతోటీ కస్సుబుస్సులాడుతారు.

తానెంతటి 'వక్త' అయినా మిగతావాళ్ళకి కూడా అవకాశం ఇవ్వాలనీ- ఎప్పటికీ ఒక్కరే వేదికమీద ఉపన్యసిస్తూవుంటే- వినేవాళ్ళకి విసుగు పుట్టుందనీ గ్రహించుకోకపోతే ఎలా?

ఇక- రచయిత్రుల సంగతి చెప్పనక్కర్లేదు.

నాలుగు నవలలో, నాలుగు కథలో అచ్చులో వచ్చేసరికి- తమకి తామే గొప్ప రచయిత్రిగా ఊహించేసుకుని, 'ప్రఖ్యాత' అని రాయమనటం.., 'ప్రముఖ రచయిత్రి' అని రాయమనటం.., అలా ఎవరైనా రాయకపోతే "ఏమండీ? ఏమనుకుంటున్నారా? నా అంతటి రచయిత్రిని ఎలా గౌరవించాలో తెలియదా?" అని కారాలూ, మిరియాలూ నూరుతారు.

ఇదెంత అజ్ఞానం?

మన గొప్పతనం ఎదుటివాళ్ళు గుర్తించి- వాళ్ళు మనకి గౌరవం ఇవ్వాలిగానీ.., 'మాకు గౌరవం ఇవ్వండి', 'మమ్మల్ని నెత్తిన పెట్టుకోండి' అని పురమాయిస్తే- ఎదుటివాళ్ళు నవ్వుకుంటారన్న ఇంగితం వుండవద్దా?

పదవుల సంగతి అలావుంచి-

సామాన్య ఉద్యోగినులు కూడా- ఉద్యోగాలు చేయని వాళ్ళ దగ్గర బీరాలు చూపిస్తారు. 'తామేదో సంపాదనపరులమనీ- మీరు పనికిమాలిన దద్దమ్మ'లన్నట్టుగా చూసే ఆడవాళ్ళూ వున్నారు. నువ్వు ఉద్యోగం చేస్తే- ఆ అవసరం నీకుంది గనుక నువ్వు చేస్తున్నావ్! అందుకని ఎదుటివాళ్ళని చిన్నబుచ్చటం, వాళ్ళ దగ్గర బడాయి చూపటంలో అర్థం లేదు.

ఉద్యోగం చేయటం గొప్పా? కాదు... అది అవసరం! ఆర్థిక సమస్య!!

ఎదుటివాళ్ళు గుర్తించి- అధికారం గానీ, గౌరవం గానీ వాళ్ళు ఇవ్వాలి గానీ- "మాకివ్వండో..." అని గోలపెట్టి సాధిస్తే- అది గౌరవమా? స్త్రీలు ఎంత త్వరగా ఈ సత్యం గ్రహిస్తే- సమాజం అంత త్వరగా బాగుపడుతుంది.



# 'ప్రజోత్పత్తి'కి ప్రజా విజ్ఞప్తి

తూర్పు వాకిట్లో తెలతెలవారగట్ల ముత్యాలు జల్లునట్లు ముగ్గులు, పచ్చని గడపలు, అకుపచ్చని తోరణాలు, సంతోషపు తరంగాలు నింపుకున్న తెలుగువాకిళ్ళు 'ప్రజోత్పత్తి' నామ తెలుగు సంవత్సరాదికి చిరునవ్వులతో స్వాగతవచనాలు చెప్తూ వుంటాయి.

అభ్యంగన స్నానాలు, షడ్రుచులు, పచ్చడి, కొత్తబట్టల రెపరెపలు- సంబరాల కాంతులు వెదజల్లుతున్నా... 'సాయంకాలం పంచాంగ శ్రవణంలో సూచించబోయే భవితవ్యపు నివేదికలో ఏమి వినాల్సివస్తుందో...' అని ఏమూలో గుండె దడదడలాడుతూనే వుంటుంది.

ప్రతి సంవత్సరం పంచాంగం వింటూనే వుంటాం!

ఆదాయ- వ్యయాలు- రాజపూజితం- అవమానం, ప్రమాదాలు, ప్రమోషన్లు, వివాహాలు, విషాదాలు, పంటలు, నష్టాలు... ఇవన్నీ వింటూనే వుంటాం! తట్టుకుని ముందుకు సాగిపోతూనేవున్నాం!

ఉగాది పండుగ వస్తోందంటే ఊరంతా సందడే!

కానీ, ఎన్నెన్ని ఊసులు బాసలు గుండె లోయల్లో నిక్షిప్తమవుతూ తెరవెనక్కి వెళుతున్నాయో- ఎందరు అమ్మలు, అక్కలు, చెల్లెళ్ళు కన్నీటి గోదాట్లో తడిసి ముద్దవుతున్నారో ఏ డైరీలు చెప్పగలవు?

అందుకే... ఓ ఉగాదీ! ఈరోజు మొదలెట్టే దినచర్యలో (డైరీలో) అంతా శుభమే జరగాలని విజ్ఞప్తి!

పంచాంగంలో ఈ సంవత్సరం 'మనోతాపం' అని వుంటే ఆడపిల్లల తల్లితండ్రులు "అమ్మబాబోయ్! అమ్మాయికి సంబంధాలు చూస్తున్నాం! ఎలాంటి అల్లుడు వస్తాడో?" అనుకునే దౌర్భాగ్యం పట్టనీయకు!

అదాయవ్యయాల్లో అంకెల తేడా చూపకు!

అసలే నిరుద్యోగ సమస్య కృంగదీస్తోంది. చాలీచాలని బ్రతుకుబాటలో వ్యయాల గుంటలే వుంటే బోర్లాపడుతూ వుండాలని ముందే నిరాశలు నింపుకునేలా చేయకు!

ప్రమాదాలు తప్పవు అనకు ఓ ప్రజోత్పత్తీ!

దినదిన గండం నూరేళ్ళ ఆయుష్షుగా- ఉదయం బయల్దేరిన వాళ్ళు సాయంత్రం ఇళ్ళు చేరేసరికి బ్రతికే వున్నామనుకుని తృప్తి పడ్తున్న అల్పజీవులు!

మళ్లీ ప్రమాదాలు అనేసరికి సగం ఊపిరి పోయి హార్ట్ ఎటాక్‌ల లిస్టు అధికం కాగలదు.

పంటలు, నష్టాలు, వర్షాలు, తుఫానులు సవ్యంగా సాగించు ఉగాదీ!!

వేసవిలో వర్షాలు రాకుంటే చాలు!

రైళ్ళు పడిపోకుంటే మేలు!

అగ్ని ప్రమాదాలు అరికట్టే ఫ్యాక్టరీలు వెలిసినంత ఆనందం!!

ఉగాదీ... మహిళలకి రక్షణ ఇవ్వు తల్లీ! సజీవదహనాలు, మానభంగాలు, అత్తింటి పోరులు తగ్గిస్తే (అసలు లేకుండా వుండాలని కోరితే 'అత్యాశ' అనగలరు) అక్కడికదే పదివేలు!!

కట్నాలు కోరినా- కనీసం ఇవ్వగలిగే స్థాయిలో వుంటే... 'అబ్బో... అదే వసంతాగమనం' అనుకుంటాం!

భార్య వుండగా మరొక మహిళతో ప్రేమకలాపాలు చేయకుండా వుంటే- వాడు శ్రీరామచంద్రుడే అని మురుస్తాం!

అమ్మా- ఉగాదీ... ఈ సంవత్సరమైనా మా డైరీల్లో (అతివల మాసంలో) తృప్తిగా రాసుకోగల్గితే అదే చాలు.

అందుకే అందుకో ఓ ప్రజోత్పత్తీ... మా (ప్రజా) విజ్ఞప్తి!!



# ఏటి పొడుగునా పండుగలు!

"అమ్మా! పండగ ఇనాం" అని తలుపుకొట్టి అడుగుతున్నారు- పని చేసుకునే వాళ్ళు.

"పండగ మాకేమీ లేదు... ఫో!" అన్నా-

"ఏమిటమ్మా! ఏడాదికొక్కనాడు- పండగ ఇనాం ఇవ్వలేరా? మళ్ల మళ్ల వస్తమా?" అది దబాయించి మరీ అడుగుతోంది- వాళ్ళలో లీడర్ లాంటి ఆమె!

నిజమే! పండగనేది ఏడాదికి ఒక్కనాడే! కానీ, ఏడాది పొడుగునా ఎన్ని పండగలు?!!

అది ఎవరూ ఆలోచించరు!

మిగతా మతస్తుల మాట ఎలావున్నా- హిందువులకి సంవత్సరం పొడుగునా ఎన్నో పండగలు! ఇవికాక, అమ్మవారి జాతరలు (బోనాల పండుగ), జాతీయ దినోత్సవాలు, కాలనీవాసుల మీటింగ్‌లు- లాంటివి వస్తుంటాయి! వీటి కోసం చందాలు తప్పవు!

ఈ చందాలు కూడా ఒకరు చేయటం కాక- ఒక్కొక్క గ్రూపువారు వచ్చి అడుగుతూ వుంటారు.

వినాయక చవితి చందాలు- కనీసం నాలుగైదు సంస్థల వాళ్ళు వచ్చి అడుగుతారు.

"మేము ఇంతకుముందే ఇచ్చాం!" అంటే-

"మేమే కాలనీ తరపున అడుగుతున్నాం! మీరు ఇంకెవరకీ ఇవ్వకూడదండీ!" అని ఓ చిన్న లెక్చర్ దంచుతాడు... ఆ గ్రూప్ లీడర్!

- ఈ భాగోతం ప్రతి సంవత్సరం జరుగుతూనే వుంటుంది. మొదటి గ్రూప్- తమదే కరెక్ట్ అంటారు. ఈ గోల భరించలేక- ఇద్దరికీ ఇచ్చేస్తూ వుంటారు- ఇంట్లో వుండే గృహిణులు!

అలాగే- దసరా ఉత్సవాలకీ, అయ్యప్ప పూజలకీ, శివరాత్రి జాగరణకీ, శ్రీరామనవమి ఉత్సవాలకీ- రకరకాల సంస్థలవాళ్ళు వచ్చి- తలుపులు (బెల్లు) కొట్టి ఎంతో హుందాగా అడగటం- (ఇంగ్లీషులో కూడా) రసీదులు, బుక్కులు చూపెట్టటం- ఇచ్చేవరకు వదలకపోవటం- ఈమధ్య చాలా కాలనీల్లో జరుగుతోంది!

ఇక... కాలనీ సమస్యలు తీర్చుకుందుకు ఓ యూనియన్, దానికోసం సభ్యత్వ రుసుము కాక- ఎమర్జెన్సీ మీటింగ్‌లూ, వాటికోసం అదనపు చందాలూ తప్పవు!

ఇక జనవరి, ఆగష్టు వచ్చిందంటే- గబగబా మైదానం బాగుచేయటం, ఓ కర్ర పాతటం, జెండా ఎగరేయటం- దానికోసం కాలనీలో అందర్నీ తలా ఐదు రూపాయలు వేయమనటం రివాజు!

ఏడాదికొక్కమారే ఇలాంటివన్నీ అనటం బాగానే వుందిగానీ.., ఏటి పొడుగునా ఇలా ఎన్ని?

'ఇవన్నీ ఎవరు చేస్తున్నారు? ఎందుకు చేస్తున్నారు? ఎలా చేస్తున్నారు?'... అని ఆలోచిస్తే- అన్నీ లొసుగులే!! అన్నీ హుళక్కులే!!

ఎవరూ అడగలేరు! ఎదిరించలేరు!

'మామూళ్ళ తంతు' పేరు మీద- ముఖ్యంగా మహిళలు ఎంత అవస్థపడాల్సి వస్తుందో చెప్పటం కష్టం!

మధ్యతరగతి కుటుంబాల్లో ఎన్నో అవసరాలు ఉంటాయి! ఇల్లాలు ఎంత పొదుపు చేసినా కొంత కొరతగానే సాగుతుంది సంసారం! ఇలాంటి పరిస్థితుల్లో- ఈ పండగల 'ఇనాం' లూ, 'చందాల' రివాజులూ... ఎలా తట్టుకోవటం?!!

వాళ్ళు దబాయించి అడిగే తీరు చూస్తే- ఇచ్చి తీరాల్సిందే... నన్నట్టుగా ఉంటుంది! ఇస్తే- ఇంట్లో అనేకమైన ఇబ్బందులు!!

పండగలన్నా- పర్వదినాలన్నా మధ్యతరగతి మహిళల పాలిటి శాపం కాకూడదు. అవసరమైనవే ఇచ్చి- అనవసరమైనవి ఖండించే పరిస్థితిని- ధైర్యంచేసి మహిళలే తీసుకురావాలి!!



# ఆశయాలు-
# అనుభవాలు!!

"అమ్మాయి చదువు పూర్తి అయినట్టుంది. ఇక వివాహం చేస్తారా?" అని మాకు తెల్సిన ఒక పెద్దింటి గృహిణిని అడిగేరు- ఆమె స్నేహితురాండ్రు!

"చేయాలి! కానీ, మాకు తగిన (మా హోదాకు తగిన) సంబంధం దొరికేవరకు చేయం!" అన్నది ఆమె.

ఆమె- హోదాలో పెద్ద ఆఫీసర్‌గారి భార్య!

స్వంత ఇల్లు వుండి, కారు, హంగు- పొంగులు వున్నాయి. తగినంత కట్నం ఇవ్వగలరు కనుక- వరుడు- ఏ ఐ.ఏ.ఎస్. ఆఫీసరో- లేదా (డైరెక్టు సెలెక్షన్ వాడు కు(రాడు), జడ్జీగారి కొడుకో (జడ్జీ కావటానికి కొంత సమయం పడ్తుంది గదా!) డాక్టరో, ఇంజనీరో, కంపెనీలో స్పెషల్ ఆఫీసరో- మొత్తానికి... పెద్ద హోదా కావాలి. అలాంటి సంబంధాలు చెప్పమని కోరింది ఆవిడ!

మంచిదే! తల్లిదండ్రులకి తమ పిల్లలు మంచి స్థితుల్లో వుండాలని కోరటం సహజం! అయితే- ఈ 'మంచిస్థితి' అన్నదే- తేలవలసి వుంది!

ఆర్థికంగా బాగా వుండటం- పెద్ద ఉద్యోగంలో వుండటమే- మంచి స్థితి అనుకుని చాలామంది తమ కోరిక లేదా ఆశయం- దృఢంగా పెంచుకుంటారు.

ఆ పరిస్థితుల్లో- వాళ్ళకి మామూలువాళ్ళు- అంటే... ఆఫీసర్ కానీ, ఉద్యోగస్తులు కానీ కళ్ళకి కనిపించరు- భవిష్యత్తులో వాళ్ళు పెద్ద పదవిలోకి వెళ్తారన్న ఆలోచన రాదు. స్కూటర్ వున్నవాడు- అద్దె ఇంట్లో వున్నవాళ్ళు- వాళ్ళ దృష్టికి ఆనరు!

తెలుగు సినిమాకథల్లోలాగా- లేదా నవల్లోలాగా- పే...ద్ద మేడ, మారుతీ కారు, లేదా ఫారిన్ మోడల్ కారు, బ్యాంక్ బాలెన్సులు, ఫర్నిచర్- వగైరాలతో కు(రాడుగా వుండగానే ఆఫీసర్‌గా వున్నవాడు కావాలని వేటాడుతారు!

బాగానే వుంది! మరి, వాడి గుణగణాలు అక్కర్లేదా? వాడు బయటకి వెళ్తే ఎన్ని వేషాలు వేస్తాడో తెలుసుకోవద్దా?

పార్టీల్లో- కంపెనీ కోసం మందు పుచ్చుకోవటం- సరదా కోసం పేకాట- కాలక్షేపం కోసం అశ్లీలమైన వీడియోలు చూడటం... ఇవన్నీ- 'డబ్బు, హోదా' అనే ముసుగులో దాచబడి పెద్ద ఇంటివాళ్ళలా చెలామణి అవుతున్నారు కొందరు.

అవన్నీ వివరాలు తెలుసుకోలేక- కేవలం అబ్బాయి 'పెద్ద ఉద్యోగస్థుడైతే' చాలనుకుంటే- పిల్ల భవిష్యత్తు ఎలా వుంటుందో ఊహించరేం?!

ఆర్థికంగా సామాన్యంగా వున్నా- పిల్లవాడు బుద్ధిమంతుడై, భార్యయందు అనురక్తి కలవాడై, సుఖపెట్టగలవాడు- పనికిరాడా?!!

మన సమాజంలో ఈనాడు- డబ్బుకి వున్న విలువ- మనిషి వ్యక్తిత్వానికి లేదు. అంతేకాదు- ఎంతసేపూ తల్లిదండ్రులు తమ ఆశయాలని బట్టి చూస్తారే తప్ప- అమ్మాయికి ఎలాంటివాడు నచ్చుతాడు- ఆ పిల్ల ఎవర్ని కోరుకుంటోంది- అని గ్రహించరు.

అందుకే- తల్లిదండ్రుల ఆశయాలు తాటిచెట్టు ఎక్కాలని తాపత్రయపడుతూ వుంటే- అమ్మాయి... అందుబాటులో వున్న నచ్చినవాణ్ణి గుట్టుచప్పుడు కాకుండా పెళ్ళి చేసుకుంటుంది!

ఆ గృహిణి ఆలోచనలు, ప్రయత్నాలు సాగుతూ వుండగానే వాళ్ళమ్మాయి- చక్కగా తనకి నచ్చిన బుద్ధిమంతుడైన మామూలు క్లర్క్‌ని గుళ్ళో పెళ్ళి చేసుకుని- తల్లిదండ్రుల్ని ఆశీర్వదించమంటుంది!

కోపతాపాలు- ఎడముఖాలు తప్పలేదు. అయినా... భవిష్యత్తు ఎవరు నిర్ణయించగలరు? ఒకవేళ ఆ క్లర్కు ఆఫీసర్ కావచ్చును! ఇల్లూ, కారూ కొనగలరేమో?!... ఇవన్నీ యోచించరు.

ఎదురుగా- రంగురంగుల సినిమా కనిపించాలి! అదికూడా తమ ఆశయాలకి అనుగుణంగానే వుండాలి! అమ్మాయిని గురించి ఆలోచించరు! అందుకే- ఆశయం ఎప్పుడూ అనుభవంలో చేదుగానే ఉంటుంది!



# వింత అనుభవాలు!

వివాహమై కొత్తగా కాపురం పెట్టినవారు- ఎంతో ఆనందంగా, ఉత్సాహంగా వుంటారనీ- వాళ్ళకి ఇరువైనాలుగు గంటలు సరిపోవనీ అనుకుంటూ వుంటాం!

-కానీ అందరి విషయంలో ఇది సరికాదేమో... అనిపిస్తూ వుంటుంది.

ఇద్దరూ ప్రేమించి పెళ్ళి చేసుకున్నప్పుడు-

ఆ పెళ్ళిని ఉభయుల వైపు పెద్దలు ఆమోదించనప్పుడు-

వాళ్ళు స్వంత కాపురం పెట్టుకున్నప్పుడు-

ఎదురయ్యే అనుభవాలు చాలా విచిత్రంగానూ, చికాకుగానూ వుంటాయని- కొంతమందిని గమనిస్తే తెలుస్తుంది.

ఇటీవల ఒక యువజంట- ప్రేమించి పెళ్ళిచేసుకున్నారు. వారు వేరువేరు కులాలవారు! వారి పెద్దలు ఆమోదించలేదు. అందుచేత వాళ్ళు తమ స్వంత కాపురం- ఎవరి సహాయ సహకారాలు లేకుండానే ప్రారంభించారు.

నిజంగా ఆమోదించవలసిన విషయమే!

అయితే... ఇరుగుపొరుగు సంస్కారవంతులైనప్పుడే ఇది సాధ్యం! అలా కానప్పుడు?? ఇదిగో... ఇలాంటి ప్రశ్నలు- పరిస్థితులు ఎదుర్కోవలసిందే!!

"మీ అమ్మా, నాన్నా రారా? ఎందుకు? మీ పెళ్ళి వాళ్ళకిష్టం లేదా? పాపం! మీ ఇద్దరూ ఇట్లా ముద్దూముచ్చట్లు లేకుండా బ్రతకాల్సి వచ్చిందా?"

- అని ఆ ఇంటి పెద్దయే పరామర్శించేసరికి- కొత్త పెళ్ళికూతురి మనస్సులో ఎక్కడో కలుక్కుమన్నట్లు అయింది..!

"పండగ వచ్చింది కదా? ఇప్పుడు కూడా మీ పెద్దోళ్ళు రారా? ఎంతైనా- పెద్దవాళ్ళ మనస్సు నొప్పించటం మంచిపని కాదు. ఇదిగో... మా ఇంట్లో చూడు- అందరం ఎంత కలిసిమెలిసి వుంటామో? మా అమ్మాయిలు- అల్లుళ్ళు- కొడుకులు- కోడళ్ళు- మనమలు- మనవరాళ్ళు- పండగనాడు ఒక్కచోటే సంబరాలు జరుపుకుంటాం! మా అత్తమ్మ అత్త- (మామగారి తల్లి) కూడా మొన్నమొన్నటిదాకా బ్రతికే వుంది! వంశం అన్నాక అందరూ కలిసేవుండాలి!"

- అంటూ ఇంటి పెద్దకోడలు చెప్పుకు పోతుంటే- కొత్త పెళ్ళికూతురు కనుకొనల్లో సన్నగా నీరు ఉబికింది- కలిసి ఉండనందుకు కాదు- తనని వేలు ఎత్తి చూపి- అయిన వాళ్ళందరినీ వదలి ఒంటెత్తు గుణంతో వున్నట్టుగా నింద వేస్తున్నందుకు!

పెద్దల స్వార్థం వలన తమ ప్రేమన్ని ఆమోదించక- మనసుల్ని విరిచేస్తుంటే- తామిద్దరూ ధైర్యంచేసి ముందుకువచ్చి పెళ్ళి చేసుకున్నారు. అంతేగానీ, అప్పుల్ని వదిలేసుకోవాలన్న దురుద్దేశం తమకి లేదు!

-కానీ, తమ చుట్టూ వున్న సమాజం అదేమీ గమనించకుండా- ప్రేమించి పెళ్ళిచేసుకున్నారనగానే- నిరసనగా- 'పెద్దల్ని ఎదిరించే దుండగు'ల్లాగా ముద్రించేస్తారు.

పైగా... ప్రతి నిముషం- ప్రతి పనినీ విమర్శనాత్మక దృష్టితో చూస్తారు. ఏదో మహాపరాధం చేసినట్టు- గుణపాఠం నేర్పబోవటం- లేదా ఆరాలు తీయటం చేస్తుంటే- మహా విసుగ్గా వుంటుంది ఆ దంపతులకి!

బయటికి వెళ్లి వచ్చేసరికి- "ఏం అమ్మాయి... ఎక్కడికి వెళ్ళారు? బజారుకా? ఏం కొన్నారేమిటి? డబ్బంతా ఖర్చు పెట్టేసుకుంటే- మళ్లీ కష్టం కాదా? ఆదుకునేవాళ్ళు కూడా లేరు" -అంటుంటే... కొని తెచ్చుకున్న వస్తువు మీద గానీ.., వెళ్లివచ్చిన ప్రదేశం మీద గానీ ఆసక్తి చచ్చిపోయి- నీరసం, దిగులు పుట్టుకువస్తుంది.

ప్రేమించి చేసుకున్న ఆ జంట ఇలాంటి ఆరాలు, విమర్శలు భరించలేక- మరొక ఇల్లు చూసుకుని వెళ్లిపోయారు.

కానీ- మళ్లీ ఆ కొత్త ఇంట్లో మాత్రం- ఇలాంటి సమస్యలు రావని ఏమిటి నమ్మకం?!

ఇంతకీ... ఉమ్మడిగా వున్న ఆ సంసారంలో- వారం వారం- కొట్లాటలు, ఆస్తి తగాదాలు తప్పనిసరిగా జరిగేవే!! అందరూ కలిసి వుండటమంటే... ఇల్లు- వాకిలి- డబ్బు మీద వ్యామోహం తప్ప మనుష్యుల మీద కాదని ఋజువు చేసుకుంటూనే వుంటారు- అలాంటివారు!

-అన్నీ తృణప్రాయంగా వదిలేసి- ప్రేమనే నమ్ముకుని పెళ్ళి చేసుకొని కొత్తకాపురం పెట్టుకుంటే- ఎదురయ్యే ఈ అనుభవాలు- ఎంత బాధాకరమో ఆలోచించండి!



# వేదికలెన్నైనా...
# వేదన కరిగేనా?

అందరూ పెద్దమనుష్యులే! ఉపన్యాసాలు ఇచ్చేవాళ్ళే! కానీ- పిల్లి మెళ్లో గంట కట్టేవారెవరన్నట్టుగా- పరిష్కార మార్గాన్ని మాత్రం ఎవరూ చూపలేరు... చూపించరు!

జంగనగరాలే కాదు- ఈరోజుల్లో- చిన్నచిన్న మారుమూల ఊళ్లో సైతం మహిళావేదికలు, చర్చలు జరుగుతూనే వున్నాయి!

అక్షరాస్యతా ఉద్యమ కార్యక్రమంలో అనేకమంది పాల్గొంటున్నారు- గ్రామ పునరుద్ధరణోద్యమాలలో మహిళలు ముందుకు ఉరుకుతున్నారు!

కుటీర పరిశ్రమలు- చిన్నతరహా ఉపాధి పథకాలు చాలామంది వింటున్నారు- చేస్తున్నారు.

అన్నీ బాగానే వున్నాయి!

అయితే- కుటుంబాలలో కలతలు- కట్నపు వేధింపులు- ఆత్మహత్యలు- హత్యలు- అప్పులు- మోసాలు- దారుణాలు... ఎక్కడివక్కడే వుండి, చిలవలు పలవలు వేసి విస్తరించుకుంటున్నాయి తప్ప- నూటికి పావువంతుకైనా తగ్గలేదు.

పత్రికల్లో- టీ.వీ.లో... సినిమా కథలు- ఇవే చూపిస్తున్నాయి! సమాజంలోనూ ప్రతిపూటా ఏదో ఒక దారుణం వింటూనే వున్నాం!

మరి ఎక్కడుంది ఈ లోపం?

వేదికమీద కంఠశోషపడే పెద్దలు- ఆచరణలో అంత ఆసక్తి చూపటం లేదనిపిస్తుంది!

ఉదాహరణకి- బ్యాంకు లోను వుంది! అది సామాన్యులకు ఉపయోగపడాలని కదా దాని ఉద్దేశ్యం?! కానీ- నలుగురు మధ్యతరగతి వాళ్ళకీ- మరో నల్గురు వెనకబడిన వారికీ- అందుబాటులోకి వస్తే- పదిమంది 'పలుకుబడి' గలవారికి కైవసం అవుతోంది! అందుచేతనే- ఉన్నవాళ్ళే లాభం పొంది- లేనివాళ్ళు లేనట్టే మిగులుతున్నారు!

రెండు కొండలమధ్య పొట్టేలు వాటంలాగా- బలాబలాలు, గల రెండు వర్గాల మధ్య- అమాయకులంతా చితికిపోతున్నారు.

అక్షరాలు నేర్చుకుని- తెలివి సంపాదించమని బోధిస్తూనే- మరొక ప్రక్క ధనిక వర్గం- తన లాభం తను చూసుకుని- పేదవాళ్ళ మీద దెబ్బకొట్టున్నారు.

ఈమధ్య గృహనిర్మాణ కార్యక్రమాలు చేపట్టి- కొందరికి స్వంత ఇళ్ళు ఇవ్వటం జరిగింది!

అయితే - వీరు ఆ స్వంత ఇళ్ళల్లో వుండరు!

అవి అద్దెకిచ్చి- చక్కా ప్రభుత్వంవారి క్వార్టర్స్ లోనే కాపురం వుంటున్నారు! అటు స్వంత ఇల్లు! ఇటు ప్రభుత్వం వారి ఇల్లు! రెండు సదుపాయాలూ ఒకరికే! అసలు ఇళ్లులేని వాళ్ళు అద్దెకొంపల్లో నానా అగచాట్లు పడుతూనే వున్నారు!

ఇలాంటివన్నీ తెలిసికూడా- 'కిమ్మన'ని మహిళాభ్యుదయవాదులు కొందరు- వేదికల మీద మాత్రం మైకులో గొంతుచించుకుని- ఆదర్శాలు పలుకుతారు!

హాస్టల్స్‌లో అత్యాచారాలు.., రైలు పెట్టెల్లో రేపు కేసులు.., నడిబజార్లో దహనకాండలు- ఇవి నిత్య జీవిత కార్యక్రమాల్లా సాగవలసిందేనా?!

ఏదో... పదిమంది చేత ఇంటర్వ్యూలు జరిపి- "ఇదిగో... ప్రగతి!" అని చెప్పే పెద్దలు- ఆ పదిమంది వెనుక తొంభైమంది తీరు ఎలా వుంది? అని పరిశోధిస్తే- ఇలాంటి వ్యాసాల సంపుటాలు రావాల్సి వస్తుంది!

ఇంతకీ... మనం ఆలోచించదగ్గది ఒక్కటే! డబ్బు దుబారా చేసి- అనవసరపు సమావేశాల కంటే- సమైక్యతాభావంతో ప్రతిఒక్కరూ- కనీసం ఒక్కరికైనా చదువు చెప్పటం, బ్రతుకుదారికి తోడ్పడటం- చేయగలిగితే చాలావరకు నయం!

'పదిమంది' నుంచి తొంభైమందికి చేర్చగల్గి కొంత ప్రగతి సాధించగల్గుతాం! లేకపోతే- వేదికలెన్నైనా వేదనలు కరగవు!



# హాస్టల్ జీవితాలు హడల్ పుట్టే?!

ఇప్పుడిప్పుడే- చదువులు- ఉద్యోగాలు మహిళాలోకానికి ఉత్తేజం, ఉత్సాహం కల్గించి- ఆర్థిక సమస్యల్ని కూడా ఎదుర్కొని ముందుకు వచ్చేలా చేస్తున్నాయి.

ప్రతివారు కొద్దో గొప్పో చదువుకుని, దానిని సద్వినియోగం చేసుకోవాలనే ప్రయత్నంలో వున్నారు!

ఊరుకాని ఊరైనా- కొంతమంది ధైర్యంగా ముందుకువచ్చి పట్నాల్లో చదువుకుంటున్నారు, ఉద్యోగాలు చేస్తున్నారు. పట్నాల్లో వీరికి సదుపాయాలు వున్నాయని, సురక్షితంగా ఉండవచ్చుననీ ఆశిస్తున్నారు. ఆ విధంగా వున్నవారు కూడా వున్నారు. ఉద్యోగినులకీ, విద్యార్థినులకీ ఎవరి వీలుకి తగినట్టు వారికి హాస్టల్స్ వుంటున్నాయి.

ఇటీవల ఈ సదుపాయం మరింతగా పెరిగింది. ఒక మోస్తరు ఊళ్లో కూడా హాస్టల్స్ వుంటున్నాయి! దానివల్ల- ప్రతిచిన్న పల్లెనుంచి ఆసక్తి గలవారు వచ్చి చదువుకునేందుకు, ఉద్యోగాలు చేయటానికి వీలుగా ఉంటోంది.

ఇంటిదగ్గర పెద్దలు కూడా- 'మన పిల్లలు ఫలానా చోట హాస్టల్‌లో హాయిగా, సురక్షితంగా వున్నార'న్న ధీమాతో- నిశ్చింతగా ఉండగల్గుతున్నారు (ఉంటున్నారు).

కానీ, దురదృష్టం అనేక విధాలుగా సమాజంలో వికటాట్టహాసం చేస్తోంది! ఆడపిల్లల పాలిట 'కట్నం' ఒక పిశాచంలా వుంటే- అత్తింటి ఆరళ్ళు మారణహోమానికి దారితీస్తే- అత్యాచారాలు... ఆత్మహత్యలకి పీఠం వేస్తుంటే- ఇవన్నీ చాలక- హాస్టల్స్‌లో కూడా అమానుషత్వం విజృంభించింది!

ఆమధ్య ఒక సాంఘిక సంక్షేమ వసతి గృహంలో విద్యార్థినిపై అత్యాచారం జరిగిందనీ- ఆమె ఆ కారణంగా మరణించిందనీ- దాని మీద వాదోపవాదాలు, చర్చలు ఈనాడు జరగటం కాదు! ఆనాడు ఏం చేశారు? ఆమె తిరిగి బ్రతికి వస్తుందా? అందుకు కారకులైనవారిపై ఏ చర్య తీసుకున్నారు?... అన్న ప్రశ్నలు ఈనాడు వేసుకుంటే- లాభం వుంటుందా?

మానవత రానురాను అడుగంటిపోతుంటే- అమానుషత్వం వీరవిహారం చేస్తుంటే- అమాయకులు బలి అయిపోతారని అందరికీ తెలుసు!

కానీ, భవిష్యత్తులో దీని ఫలితం ఎలా వుంటుంది? చదువులకీ, ఉద్యోగాలకీ- పరాయి ఊళ్లకి వెళ్లాలంటే మళ్లీ భయం భయమే! 'చదివినంతవరకు చాలు! ఇంటిపట్టున పడివుండు' అనేమాట సభ్యకుటుంబాల్లో వినబడుతుంది!

అక్షరాస్యత కోసం- పెద్దఎత్తున ప్రచారాలు చేస్తున్న మనం అక్షరజ్యోతులు వెలిగించుకుంటున్న మనం- అజ్ఞానపు ఊబిలో, స్వార్థపు నీడలో- కళ్ళు మూసుకునిపోయి అత్యాచారాలకీ, అక్రమాలకీ పాల్పడుతున్నామా?... అని ఎందుకు ఆలోచించగలరు? అటువంటి ఆలోచనే వుంటే- ఇన్నేసి దారుణాలు ఎలా జరుగుతాయి?!

సమాజంలో ఒకవైపు ప్రగతి సూత్రాలు వినిపిస్తూ, మరోవైపు దౌర్జన్యాలు- దురాగతాలు చేస్తుంటే- దేశం ఏ రీతి బాగుపడుతుంది?

అమ్మాయి హాస్టలో వుండాలంటే హడల్ పుట్తే ఇక సంక్షేమ వసతి గృహాలు దండగ!! కొన్నాళ్లకి మూసివేయాల్సి వస్తుంది! భవిష్యత్తులోనైనా నైతిక విలువలు పటిష్ఠంగా వుండే తీరున ప్రభుత్వం చర్యలు తీసుకుంటే మంచిది!

ఉత్తి అరుపుల కన్నా గట్టి చర్యలు కావాలి!



# ఎంత ఎదిగినా - గుప్పెడు తక్కువే !

కొత్త బడ్జెట్ వచ్చిందని... టీ.వీ.ల దగ్గర, రేడియోల ముందు, పత్రికల్లో తలదూర్చి- తల మునకలైపోతున్నారు కొందరు.

"విన్నావా... పెట్రోల్ ధర పెరిగింది. మాటిమాటికీ బయటకి వెళ్లాలన్న ఉబలాటం తగ్గించుకో..." అన్న ఒకానొక భర్తగారి ఆజ్ఞ విని భార్య చిరునవ్వు పారేసింది!

"సంబడమే! నా తిరుగుళ్ల వల్ల కలిసి వచ్చేదేమీ లేదు గానీ, పెట్రోలు ధర పెరగక చస్తుందా? హవ్వ! ప్రతివాడూ 'బండి' కొనడమే! రోడ్డు మీద మనుషులు నడవటం తక్కువ.., వాహనాలు తిరగటం ఎక్కువ! వీటన్నిటికీ ఎక్కడ్నుంచి వస్తుంది పెట్రోలు? బాగా జరిగింది!" అన్నది ఆవిడ. పైగా- "జీతాలు పెరగటం లేదా? పెట్రోలు, అవీ ధర పెరిగాయనుకుంటే ఎలా?" అంది.

భర్త ఏమీ అనలేక- తల పట్టుక్కూర్చున్నాడు.

దేశంలో పరిస్థితులు.., ఆర్థిక ఇబ్బందులు.., ఉద్యోగాలు.., ధరలు.., సమస్యలు... ఎలావున్నా, ఎటు పోతున్నా... 'అవన్నీ మగవాళ్ళు చూసుకునే గొడవలు... మనకెందుకులే!' అనుకునే మహిళలు ఇంకా మన సమాజంలో చాలామందే ఉన్నారంటే నమ్మక పోవచ్చును. కానీ, ఇంట్లో కూర్చుని ఎంతసేపూ- వంటలు, నవలలు, సినిమా పాటలు, రేడియో ప్రసంగాలూ వింటూ పనిమనిషితో చచ్చేట్టు పనులు చేయించుకుని పనికిమాలిన కబుర్లతో కాలక్షేపాలు చేసే స్త్రీలు కూడా ఉన్నారంటే- అబద్ధం కాదు.

వీళ్ళకి బొత్తిగా లోకజ్ఞానం లేక కాదు!

మెదడుకు పదును పెట్టుకుని శ్రమపడటం ఇష్టంలేక- ఏదీ పట్టించుకోరు. జీతం పెరిగినా ధరలు పెరగటం వలన- మళ్లీ యధాస్థితే వస్తుందనీ.., ఏ విషయాల్లో జాగ్రత్తగా ఉంటే సంసారపు బండిని అదుపులో పెట్టుకోవచ్చో... ఆలోచించరు!

ఆ అవసరం వాళ్ళకి కలగకపోవటానికి కారణం వుంది!

ఇంట్లో కొడుకూ, కోడలూ, పెళ్ళి కావల్సిన కూతురూ, భర్తా అందరూ ఉద్యోగాలు చేస్తుంటారు. అది పెద్దదా, చిన్నదా... అనికాదు. ఆ మాటకి వస్తే ఇంటి ఇల్లాలు కూడా...

చిన్నపాటి సంపాదన చేస్తోంది! చీరలు, బ్లౌజు పీసులు, స్టీలు సామాన్లు... హోల్‌సేల్‌లో కొని, ఇంట్లో మారుబేరానికి అమ్మి పదీ, పాతికా లాభం చూస్తోంది! అంటే- ఇంట్లో ప్రతివారూ ఏదోవిధంగా నాలుగు రాళ్ళు సంపాదించి ఇంటికి వినియోగపడుతున్నారన్న మాట! కానీ, ఇది వినియోగమా? అదే యోచించగల్గితే మహిళా స్థాయి పెరుగుతుంది.

వందరూపాయలు సంపాదించగలిగితే... పది రూపాయలు మిగుల్చుకుని దాచగల్గాలి! అప్పుడు వినియోగపడినట్టు! కానీ, వందరూపాయలు రాబడి వుంటే- నూటపది రూపాయల ఖర్చు తేలినప్పుడు- వినియోగం ఎలా అవుతుందీ? సామాన్యగృహిణి నిదానంగా ఆలోచించలేకపోతోంది!

అందుకే ఖర్చులు పెరిగినప్పుడల్లా- సంపాదించటానికి మార్గాలు వెతుకుతోంది తప్ప- ఖర్చు తగ్గించుకుందామని భావించటం లేదు!

దేశంలో ప్రతిరోజూ జరుగుతున్న విషయాల్ని క్షుణ్ణంగా తెల్సుకోగల్గితే- అంతకుమించిన చదువు లేదు.

'అభ్యున్నతి, ప్రగతి' అనేవి- అక్షర జ్ఞానం వల్లే జరగవు! ఈనాడు సగటు మహిళ- ప్రపంచ జ్ఞానం కలిగి- జీవిత విధానంలోని ఒడుదొడుకులు ఎలా వస్తుంటాయో తెలుసుకోగలిగే స్థాయికి ఎదగాలి!

- రాజకీయ నాయకురాలు కానక్కర్లేకపోయినా రాజకీయ పరిజ్ఞానం వుండాలి!

'లా' చదవక పోయినా 'అన్యాయం' అంటే ఏమిటో తెలుసుకోవాలి!

'డాక్టర్' కాకపోయినా ప్రాథమిక చికిత్సావిధానం తెలిసుండాలి!

ఉద్యోగం చేయక్కర్లేదు కానీ- 'ఇంటి బడ్జెట్'ని సక్రమంగా నిర్వహించగలిగి వుండాలి!

ఇదీ అసలైన చదువు!

కానీ, నేటి మన సమాజంలో- సగటు స్త్రీ నగరాలలో వుండటం చేత అధునాతన పోకళ్లు అలవరచుకుంటోంది తప్ప- దేశ కాల పరిస్థితులను జీర్ణం చేసుకోలేకపోతోంది!

పురుషుడు తెలుసుకోగలిగినన్ని సంగతులు- లేదా పరిజ్ఞానం స్త్రీ కూడా గ్రహించగలిగితే బాగుండును.

ఎంత ఎదిగాననుకున్నా- గుప్పెడు తక్కువగానే మిగిలిపోతున్న స్త్రీ- ఎలా ప్రగతి సాధిస్తుందీ?



# పంతాలు - పట్టింపులు!

సమాజంలో కొన్ని నియమాలు, పద్ధతులు ఎప్పుడు, ఎందుకు వచ్చాయో గానీ- కాలం మారుతున్నా.., మనుష్యుల వ్యవహారికాలు మారిపోతున్నా... ఏనాటి నియమాలో గుర్తుచేసుకుని... పంతాలు, పట్టింపులు పెట్టుకోవటం చూస్తుంటే... బాధగా నిట్టూర్చుకోవలసిందే!

ముఖ్యంగా స్త్రీలకే ఇవి ఎక్కువ!

పూర్వం అంటే- స్త్రీలు ఇంకా ఉద్యోగరంగంలో విజృంభించనప్పుడు- ఇంటిపట్టునే వుండి, అన్నిపనులూ స్థిమితంగా చేసుకునేందుకు చాలినంత సమయం ఉండే రోజుల్లో... ఏ వేడుక చేసుకున్నా ఆర్భాటంగా... అందర్నీ పేరుపేరునా పిలుచుకుని చేసేవారు.

నిజమే... బంధుమిత్రుల్ని పిల్చి- పండుగల వేడుక చేసుకుని, స్వయంగా సాగనంపి... ఎన్నైనా కబుర్లు చెప్పుకోవచ్చును.

అంత తీరుబడి ఉన్నప్పుడు కదా?

మరి, ఈరోజుల్లో మహిళలు ఉద్యోగ విధుల్లో ఊపిరి సలపకుండా... నిత్యకృత్యంలో ఇంట్లో చేసుకోవలసిన పనులే సరిగా చేసుకోలేక పోతున్నప్పుడు- ఇక ఏ శుభకార్యమో, వేడుకో చేయవల్సి వస్తే... కాళ్లూ చేతులూ విరగగొట్టినంత స్పీడుగా చేసినా పనులు సకాలంలో పూర్తి కావు.

పైగా- బస్తీల్లో, మహాపట్టణాల్లో ఒక్కొక్క బంధువు, మిత్రుల ఇళ్లు ఎంతెంతో దూరంలో వుంటాయి! రానూపోనూ ఛార్జీల సంగతి అలావుంచి... సరైన వాహన సౌకర్యం కూడా లేనంత దూరంలో వుంటున్నాయి.

అటువంటప్పుడు- ఒక్కొక్కరి ఇంటికి వెళ్లి- పిలుపు నివ్వాలంటే చాలా కష్టం! అనుకోకుండా చాలా తక్కువ వ్యవధిలో శుభకార్యం కుదిరితే, మరీ కష్టం! ఆ పరిస్థితుల్లో కొందర్ని మరిచిపోవడం కూడాకద్దు! అయితే- చటుక్కున ఫోను చేయటమో, ఏ మనిషినైనా ఇచ్చి పంపటమో... చేస్తారు.

కానీ.., అవతల ఈ పిలుపుని అందుకునే వాళ్ళు ఎలా వుంటున్నారూ?

"ఇప్పుడా పిలవటం? ఇంకానయం... శుభకార్యం అయిపోయేక పిలవపోయారా?" అనో,

"సరేలే... మేము రాకపోతేనేం?" అనో... నిష్ఠూరపు విసుర్లు విసురుతారు!

ఇక బంధువులే అయితే- "ఇలాగేనా పిలవటం? వచ్చి తీసుకెళ్లాలి గానీ..!" అని అలిగి రాకపోగా- నానా అల్లరీ, యాగీ చేసేవారుంటారు.

ఇంకా కొందరు- బయల్దేరి వచ్చి, ఆ సంతోష సమయంలో పదిమంది ముందూ- 'ఇలా జరిగింది'... అని చెప్పి భోజనాల దగ్గర పట్టింపులు మొదలుపెట్తారు.

ఈ అనుభవాలు ప్రతివాళ్ళకీ ఎప్పుడో ఒకప్పుడు జరగకపోవు!

ఎందుకంటే... మనం మనుషులం! ఎన్ని పనులు చేసుకున్నా... ఏదో ఎక్కడో మిగలక పోదు. అందుకే- వివేకంతో అర్థంచేసుకుని-' దేవతలంతటి వాళ్ళకే పొరపాట్లు జరుగుతూవుంటాయి కదా?- మనం సామాన్యమానవులం కనుక ఏదో పొరపాటు జరిగివుండవచ్చును... లేకపోతే అసలు ఎందుకు పిలుస్తారూ, మానేసేవాళ్ళు కదా?' అని సమర్థించుకోవాలి!! ఇలాంటివాళ్ళే నిజమైన స్నేహితులు, బంధువులు!!

అంతేకాని... 'ఎక్కడ, ఏ లోపం వుంటుందా? పట్టుకుని ప్రాణం తినేయాలి' అని చూసేవాళ్ళు- స్నేహితులు, బంధువులూ కారు!

ఈరోజుల్లో ఎన్నో అధునాతన సౌకర్యాలు.., పద్ధతులు వచ్చాయి.

మునపటి కాలానికీ, ఇప్పటికీ తేడావుంది!

ఏ వేడుకలకైనా, వ్రతాలకైనా, శుభకార్యాలకైనా... తీరుబడిగా పిలిచేంత సమయం దొరకటం లేదు. అలాగే- ఇంటికి వచ్చి పిలిచినా... వెళ్లే తీరుబడిలేక- కొందరు మానేస్తారు.

అప్పుడు పిల్చినవాళ్ళు- "ఏం గీర్వాణం! ఇంటికి వెళ్లి పిలిచినా రాలేదు" అని తిట్టుకుంటారు.

ఇది పొరపాటు! 'వాళ్ళకి ఏ ఆటంకం వచ్చిందో?' అని ఆలోచించాలికదా?

ఎంత చదువులు చదివినా.., ఉద్యోగాలు చేస్తున్నా.., నగరాల్లో వున్నా... ఆలోచన, వివేకం కోల్పోయినప్పుడు- పంతాలూ, పట్టింపులూ ఎక్కువై... అనవసర కలహాలో, నొప్పించుకోవటమో జరుగుతుంది! అదే, వివేకంతో మెలిగితే ఇరుపక్షాల వారికి సుఖ శాంతులు మిగులుతాయి!!



# అవసరం వీళ్ళది - అవకాశం వాళ్ళది!

ప్రతిరోజూ బస్సు ప్రయాణం చేసేవారికి అవసరం ఎటువంటిదో దానిని అవకాశంగా తీసుకుని ఆర్.టి.సి.వాళ్ళు ఎలా వాడుకుంటున్నారో మనకి బాగా తెలుసు!

ఆఫీసులకీ, పనులకి వెళ్ళాలంటే బస్సు తప్ప మరో తక్కువ ఖర్చుగల సదుపాయం లేదు. ముఖ్యంగా ఆడవాళ్ళు బస్సుకోసం ఎంత పరుగులు పెట్టాలో?!

బస్సు కదుల్తూ వుంటే... మగవాళ్ళు పరిగెత్తి ఎక్కినట్టు- ఆడవాళ్ళకి సాధ్యంకాదు.

దాంతో రష్‌గా వుండే బస్సు ఎక్కలేక- ఆగకుండా వెళ్ళే బస్సులో పొరబడలేక- నానా అవస్థగా వుంటుంది!

తీరా ఎక్కాక- ముందు సీట్లు స్త్రీలకే అయినా... మధ్యలో నిల్చుని వుండేవారంతా పురుషులే!

ఇక కండక్టర్- తానేదో అతిరథుడు, మహారథుడు అయినట్టు- అందర్నీ తోసుకుంటూ- అవసరం లేకున్నా తాకుతూ- టిక్కట్లు ఇస్తుంటాడు. అసలు భాగోతం ఇక్కడే వుంటుంది!

టిక్కెట్టు పైసలు సరిగ్గా ఇచ్చినవాళ్ళ మాట వదిలి- ఒకవేళ చిల్లర లేకపోతే... ఇక చిల్లర ఇవ్వడు కండక్టర్!

"చిల్లర ఇవ్వండి" అని అడిగితే-

"లేదండి- మీరు చిల్లర వుంచుకోండి!" అంటాడు.

అందరూ నోట్లు ఇస్తే- అతను చిల్లర ఎలా ఇస్తాడు? కానీ, అతని సంచీలో చిల్లర లేకకాదు! గలగలలాడుతూనే వుంటుంది! అయినా ఇవ్వడు! అది అంతే! 'ఎదురుగా రాసి వుంది, చూసుకో'...మంటాడు! ఇక కొంతమంది కండక్టర్లు- ఇష్టం వచ్చినంత రేటు కొట్టి టిక్కెట్టు ఇస్తారు!

ముందురోజు అదే రూట్‌లో తీసుకున్న డబ్బుకీ, మరుసటిరోజు అదే రూట్‌లో ఎక్కువ తీసుకున్నా- ప్యాసింజర్లు తిరగబడి అడగలేరు. అడిగినా- వినిపించుకోనట్టు వెళ్లిపోతాడు కండక్టర్!

అక్షరాలా ఒకసారి అలాగే జరిగింది. కాకపోతే- ఆరోజు ఆ మహిళ ఇదేమిటని అడిగింది! కానీ ఏం లాభం?

మాట్లాడకుండా వెళ్లిపోతున్న కండక్టర్‌ని- "సరే... నేను మహిళామండలి వాళ్ళతోవచ్చి మీ ఆఫీసర్ దగ్గర చెప్తాను!" అన్నది! "అలాగా?" అని- ఓ నవ్వు పారేశాడు తప్ప- మిగిలిన డబ్బులు మాత్రం ఇవ్వలేదు. అప్పుడు పక్కవాళ్ళు కూడా- ఇతను రోజూ ఇలాగే చేస్తాడని అందుకున్నారు. మరెందుకు ఊరుకుంటారంటే-

"ఏం లాభం లేదండీ! రోజూ ఎక్కాల్సిన బస్సు కదా? గొడవ పెట్టుకుంటే- వెళ్లడం కష్టం" అన్నారు! అన్నీ అందరూ వింటున్నా... ఎవరూ పెద్దగా కల్పించుకోలేదు.

మరొకసారి ఊరికి వెళ్లే మహిళ- రిజర్వేషన్ చేయించుకుని బస్సు ఎక్కింది. ఆమె తాలూకు మనుషులు వెళ్లిపోయారు. బస్సు కదిలేక- కండక్టర్ టికెట్లు చెక్ చేస్తూ అవిడ దగ్గరకి వెళ్లాడు. ఆమె టికెట్ చూపించింది. "ఇది రిజర్వేషన్ కదా? ఈ బస్సులో చెల్లదు! ఇక్కడ టికెట్ తీసుకోవాల్సిందే!" అని దబాయించి- "లేకపోతే దిగిపోండి"- అన్నాడు. "రిజర్వేషన్ చెల్లకపోవటమేమిట"ని ఆమె అడిగితే- అప్పుడు నలుగురూ కల్పించుకుని- ఆ టికెట్ చూసి- "ఇది ఈ బస్‌కిచ్చిన టిక్కెట్టే! మీ హెడ్డాఫీసు నుంచే ఇచ్చార"ని నచ్చచెప్తే ఊరుకున్నాడు ఆ కండక్టర్!

ఇది ఎంత అన్యాయం? రిజర్వేషన్లు వద్దనుకున్నప్పుడు వాళ్ళ హెడ్డాఫీసులో- ఆ బందోబస్త్ చేసుకోవాలిగానీ.., తీరా టిక్కెట్టు వాళ్ళిచ్చి, చార్జీలు చెల్లించాక- నడిరోడ్డుమీద ఊరు మధ్యలో ఆడమనిషిని దిగిపొమ్మంటే- అర్థం వుందా? ఆ డబ్బు వాపస్ ఇస్తారా? ఆమె ప్రయాణం ఆపేసుకోవాలా?

ఇలాంటి అన్యాయం జరిగినప్పుడు- ఎవరికి కంప్లైంట్ ఇవ్వాలి? ఎలా ఇవ్వాలి?... అని తెలియని మహిళలు ఎంత అవస్థ పడుతుంటారో?! ఇక... రోజూ బస్సులో కండక్టర్లు చేసే అన్యాయం, నిర్లక్ష్యం భరిస్తున్న వాళ్ళెందరో? అంతా అలా వుండరు. సిన్సియర్‌గా, నెమ్మదిగా వుండే మంచి కండక్టర్లు కూడా వుంటారు. కానీ... దుర్గంధం మధ్య సువాసన ఏం రాణిస్తుంది? ఇప్పటికే చాలామందికి కండక్టర్లన్నా, పోలీసులన్నా, కొంతమంది డాక్టర్లన్నా, ఇంకా సమాజంలో కొంతమంది మీద అసహ్యం పేరుకుపోయింది!! అవకాశవాదులు వీళ్ళంతా!!

ఇదీ మన సమాజం! నేటి నవనాగరీక సమాజం! స్వతంత్ర భారతం ఇలా వినియోగం వెలగబెట్టోంది?!!



# చట్టాలున్నా సరే-
# చవటలవుతున్నారు!!

సమాజంలో ప్రతివాళ్ళకీ బయట ఎన్నో అవసరాలుంటాయి!

నిత్య జీవితంలో లేచింది మొదలు- రాత్రి నిద్రపోయేవరకు ప్రతి అవసరం- బయట కొన్న వస్తువులతో ముడిపడే వుంటుంది. టూత్‌పేస్ట్ నుంచి, యూఫోబెడ్ వరకు- మనిషికి కావల్సినవన్నీ కొనవలసిందే కదా? ఇక- పప్పు దినుసులు(అపరాలు), కూరలు, పళ్ళు, జ్యూసులు, కాస్మోటిక్స్ (సౌందర్య ఉపకరణాలు) సరేసరి!

మనిషికున్న ఈ అవసరాలని అవకాశంగా తీసుకుని వ్యాపారస్తులు- లాభాలకోసం ఆశపడి ఎన్నో మోసాలు చేస్తున్నారు.

పూర్వపురోజుల్లో- కొద్దోగొప్పో పాపభీతైనా వుండేది! ఇప్పుడు ఆ మాట అంటే నవ్వుతున్నారు కూడా! ఎవరు ఎక్కువ మోసం చేయగల్గితే- వాడే గొప్ప!!

అందుకే సామాన్య ప్రజానీకం కూరలుకొన్నా, కిరాణాకొట్లో వస్తువులు కొన్నా ఎంతో నష్టపోయి- చేసేది లేక చింతిస్తూ, తిట్టుకుంటూ ఊరుకుంటున్నారు.

ఇటువంటి బాధలు చూశాక ప్రభుత్వం 1986వ సంవత్సరంలో వినియోగదారుల కోసం ఒక చట్టం రూపొందించింది! చట్టం వచ్చి ఇన్ని సంవత్సరాలైనా- పెద్దగా లాభం పొందుతున్నట్టు వినియోగదారులు చెప్పుకోలేకపోతున్నారు! దీనికి కారణాలు రెండు ఉన్నాయనిపిస్తోంది!

ప్రభుత్వ చట్టంలోని రూల్స్- వాటిని అమలుపరుచుకునే విధానం తెలియక పోవటం.., ఒకవేళ తెలిసినా- పక్కనున్న వాళ్ళకి జడిసి డిగ్నిటీకోసం మాట్లాడకుండా కొనేయటం..! అందుచేత- చట్టాలువున్నా... చవటలవటం తప్పటంలేదు. ప్రతి చట్టం ఎలావుంటుందో- ఇదీ అంతే!!

అసలు- ఆడవాళ్ళు మార్కెట్‌కి వెళ్లినా, షాపింగ్‌కి వెళ్లినా, కిరాణా కొట్టుకి వెళ్లినా... తమకన్నా పైహోదాలో ఉన్నవాళ్ళతో వెళితే- ఇక వాళ్ళముందు నోరెత్తలేక-'రెండు మూడు

రూపాయలే కదా...' అనీ, ప్రభుత్వ గుర్తు 'ఐ.యస్.ఐ.' లేకపోయినా పెద్ద ఉపద్రవం లేదనీ కొనేయాల్సివస్తుంది!

ఇక- స్టీల్ సామాన్లు, కాస్మొటిక్స్ దగ్గర మహిళలు మత్తులో పడిపోయి- ఆ వస్తువును వదులుకోలేక- దుకాణంవాడు చెప్పే మాయమాటలకి లొంగిపోయి కొనేస్తారు. అవి పాడైనప్పుడు- మళ్లీ వెళ్లి అడగనూలేరు.., వాడు వీళ్ళనసలు లక్ష్యపెట్టడు (రెస్పాన్స్ ఇవ్వడు). ఇవి కేవలం ఆడవాళ్ళ మోజు, పిరికితనం వల్ల కలిగే నష్టాలు!

ప్రతిరోజూ కొనేకూరలు- తూకం రాళ్ళు చూసుకున్నా సరుకు తాజాగా వుండకపోవచ్చును. పైగా... పావలానో, అర్ధో తగ్గించి ఇస్తానంటే మురిసిపోయి కొనే మగువలు ఎంతమంది లేరూ?

పళ్లు అయితే- పైసా తగ్గడు సరికదా... మంచివి చూసుకోనివ్వడు. కార్లలో వచ్చే 'మేం సాహెబ్'లకీ, 'మేడమ్'లకీ ఆహ్వానాలు పలుకుతూ... మామూలుగా వచ్చేవాళ్ళని (సాదా మనుషుల్ని) పురుగులు దులపరించినట్లు చూస్తారు... ఈ పళ్లవాళ్ళు!

ఇక... ఫ్యాన్సీ సామాన్లు అయిన బ్యాగులు, పర్సులు, ప్లాస్టిక్ సామాన్లు, కప్పు సాసర్లు వగైరా చాలా వాటిల్లో బేరం చేస్తే ఒక్కొక్కళ్ళు దండకాలు చదువుతారు. బేరం చెయ్యాలో, కూడదో తెలియక తికమకపడే మహిళలు నోరుమూసుకుని కొనేస్తారు.

రోజూ పొద్దున్నే తీసుకునే పాలప్యాకెట్లు చిల్లుపడివుంటాయి! పది నిముషాలు ఆలస్యం చేస్తేచాలు- సగం ప్యాకెట్ మిగులుతుంది!

అదేమంటే- "మేమేమి చెయ్యం? మీరు త్వరగా వచ్చి మంచివి తీసుకెళ్లండి!" -అంటారు బూత్‌వాళ్ళు! అంతేగానీ- ప్యాకెట్లు ఎందుకు చిల్లులు పడతాయో చెప్పడు. పాలు విరిగినా, పెరుగు బంకలా సాగినా- అధికారులు టీ.వీ.ల్లో జవాబులు చెప్పినంత త్వరగా మనకి ఫలితం కనిపించదు.

ఊరగాయ రోజుల్లో నువ్వుల నూనె డబ్బా కొంటే ప్రభుత్వం గుర్తు (ఐ.ఎస్.ఐ.) వుంటోందిగానీ- మునుపటి రుచి వుండటం లేదు! లోపం ఎక్కడుందో తెలియక గింజుకున్న స్త్రీలు చాలామంది వున్నారు.

కనుక చట్టాలున్నా- నోరులేని మహిళలు చవటలవక తప్పటంలేదు కదా... చెప్పండి?!!



# దుర్వినియోగమవుతున్న పథకాలు !

ప్రభుత్వంవారు ప్రజలకి మేలు చేయాలని ఎన్నో పథకాలు ప్రవేశపెట్టున్నారు.

మరెన్నో సదుపాయాలు ప్రకటిస్తున్నా- సంతోషించవలసిందే కానీ.., 'ఆ పథకాలు ఎంతమందికి సద్వినియోగం అవుతున్నాయి? ఎంతమంది దుర్వినియోగం చేస్తున్నారు?' అని ఏమైనా ఎంక్వైరీలు చేస్తున్నారో, లేదో తెలియదు గానీ- నిజంగా అవసరం ఉన్నవాళ్ళంతా- ఆ పథకాల వల్ల మేలు పొందలేకపోతున్నారు. అక్కర లేకపోయినా కొందరు పలుకుబడి, పక్కదారులు త్రొక్కి- లబ్ధి పొందుతున్నారు!

మగదిక్కు లేక చిన్నచిన్న పిల్లలుండి, చదువుకున్న చదువుకు ఏ ఉద్యోగం దొరకని ఇల్లాళ్ళు- తమకంటూ ఓ ఉపాధి సంపాదించుకోవాలంటే- ఇలాంటి స్వయం ఉపాధి పథకాలున్నాయని తెలిసినా... దానిని ఎలా అడగాలో, ఎవరిని అడగాలో తెలియక, తెలిసినా- వాళ్ళు ఇచ్చే ఫారాలు నింపలేక- పాపం దిగాలుపడి వాళ్ళ కష్టాలు వాళ్ళు పడుతూనే వున్నారు.

ఇక- నోరు వున్నవాళ్ళు (డబ్బున్న వాళ్ళు) ఎలాగో దాన్ని ఉపయోగించుకుని, మరింత పుంజుకుంటున్నారు.

ఉదాహరణకి- ఒక సంగతి చాలు!

ఒకబ్బాయి చదువుకుంటూ- తాను స్వయంగా ఆటో నడుపుకుంటానని- బ్యాంక్ లోను తీసుకుని- దానిని అద్దెకిచ్చి తను మాత్రం హాయిగా కాలేజిలో చదువుకుంటూ

వున్నాడు. ఆ కుర్రాడి చదువు పూర్తి అయేసరికి ఆటో లోను పూర్తిగా తీరిపోయి చక్కగా స్వంతమవుతుంది. ఇక... ఆ అబ్బాయి రిజర్వేషన్ కోటాలో ఉద్యోగార్హుడే! ఇటు ఉపాధి పథకం- అటు ఉద్యోగం రెండూ వస్తాయి!

మరి- ఒక నిరుపేదరాలు... బ్యాంక్ లోను తీసుకుని బుక్ షాపో, చీరలో, మొమెంటోలో పెట్టుకుందామని అడిగితే- దానికోసం వాళ్ళు చెప్పిన వివరాలు విని నీరసం వచ్చింది ఆమెకి.

రిజిస్ట్రేషన్ చేయించాలనీ, ఎవరైనా గెజిటెడ్ ఆఫీసర్ సంతకం కావాలనీ, 'ఏదైనా ఆస్తిగానీ- స్థలంగానీ సెక్యూరిటీగా చూపగలవా?' అనీ, కొంత డబ్బు మార్జిన్ కట్టాల్సి వుంటుందని చెప్తే- అవిడెలా కట్టగలుగుతుంది?

పరీక్షల్లో రాయవలసినన్ని ప్రశ్నలుగల ఫారం ఇచ్చి, నింపి- సంతకాలతో సహా తీసుకురమ్మన్నారు.

అవిడ పరువుగా బ్రతికి- చితికి పోయిన ఇల్లాలు! ఎవరింటికి వెళ్లి అడిగినా- వాళ్ళు సెక్యూరిటీ ఇవ్వటానికి వెనకాడుతారు. ఆమె అభిమానం చంపుకుని ఎన్నో ప్రయత్నాలు చేసి విసిగి, ఇక ఆ ఉపాధి పథకం జోలికి వెళ్లకుండా- స్వయంగా తనకు చేతనైన పనులు చేసుకుంటోంది!

ఇదీ వరస! ఇలా వున్నాయి... ప్రగతి ప్రణాళికలు, ఉపాధి పథకాలు!!

తఏమీ లేకనే- ఉపాధి పథకం కోసం వచ్చిన వాళ్ళని "మీకు అస్థులున్నాయా- 'మార్జిన్ మనీ' కట్టారా?" అంటే, ఏదో సామెత చెప్పినట్టుగా వుంది!

ఇక- డబ్బున్నవాళ్ళు, పలుకుబడి వున్నవాళ్ళు- ఎన్నో రకాలుగా లబ్ధి పొందుతున్నారు!

పెద్దపెద్ద ఆఫీసర్ల భార్యలు- వ్యాపారస్థుల భార్యలు- బ్యాంక్ లోనూ, స్త్రీ శక్తి పథకాలూ ఉపయోగించుకుని లాభసాటి ఉపాధులు నడుపుకుంటున్నారు.

టీ.వీ.ల్లో చూపిస్తున్న ఆ దృశ్యాలు చూస్తుంటే- సర్వత్రా ఇలాగే జరుగుతుందను కోలేము. అందరికీ (అవసరమైన వారికి) అందుబాటులోకి వచ్చినప్పుడే ప్రభుత్వ పథకాలు అందునా- స్త్రీ శక్తి స్వయం ఉపాధి పథకాలు సద్వినియోగ మవుతున్నాయని ఆనందించవచ్చు.



# ఆదర్శ వివాహం!

ఆమధ్య ఒక సంఘటన జరిగింది!

మా బంధువులింట్లో వివాహానికి వెళ్తే- అక్కడికి ఒకావె వచ్చింది! నలభై సంవత్సరాల పైనే వుంటాయి ఆమెకి! చాలా సింపుల్‌గా- అసలు పెళ్ళికి చేసుకోవాల్సిన ముస్తాబు కూడా ఏమీ లేకుండా వుంది! నగలుగానీ, ఆడంబరాలుగానీ ఏమీలేవు! కానీ, మనిషి మాత్రం నిండుగా, హుందాగా- చక్కని మాట- చక్కని అందం... అదో ప్రత్యేకతతో అందర్నీ ఆకట్టుకుంది!

స్త్రీ సహజమైన ఆసక్తితో- ఆమెను గురించి అడిగారు- కొందరు! మా బంధువులావిడ- అంటే... పెళ్ళికూతురు తల్లి చెప్పింది.

ఆమె తమ ఊళ్లో- (కొచ్చిన్)లో ఒక పెద్ద ఆఫీసర్ భార్య! ఆంధ్రాకి చెందినదే!

అయితే చిన్నప్పుడే ప్రేమించిన యువకునితో పెళ్ళి చేసుకుంటానంటే- తల్లిదండ్రులు ఒప్పుకోలేదుట! అందుకని- పెద్దలు లేకుండా- భగవంతుని ఎదుట మిత్రుల సమక్షంలో వివాహం చేసుకుని- అతనితో కొచ్చిన్ వచ్చేసింది.

అప్పట్నుంచీ దాదాపు ఇరవై సంవత్సరాలుగా అసలు ఆంధ్ర ప్రాంతానికి రానేలేదు. ఒకమ్మాయి, ఒకబ్బాయి వాళ్ళకి! ఇద్దరూ పెద్ద చదువుల్లో వున్నారు. ఆవిడ అక్కడ సోషల్ వర్కర్‌గా మంచిపేరు తెచ్చుకుని ఎన్నో కార్యక్రమాలు చేస్తోందిట! ఎప్పుడూ అలా సింపుల్‌గానే వుంటుందిట! ఎంతో హోదాగల ఆఫీసర్ భార్య అయినా ఆమె నిగర్వంగా పేద-గొప్ప అనే భేదం లేకుండా భుజం మీద చేయివేసి మాట్లాడుతుందట!

ఇంతవరకు పొరపాటున కూడా- తమ కులం ఏమిటో, భర్త ఏ కులస్తుడో- ఎవ్వరికీ చెప్పలేదుట!

ఈ పెళ్ళికి మా బంధువులు ఆంధ్రాకి వచ్చి చేస్తున్నామని- ఆమెని రమ్మని బలవంతం చేస్తే- ఒక్కసారి తల్లిదండ్రుల్ని గురించి తెలుసుకోవాలనే ఆకాంక్షతో ఆంధ్రాకి వచ్చిందట! ఇదీ ఆమెను గురించిన వివరాలు!!

నిజంగా ఆశ్చర్యపోయారంతా!

ఏ ఆదర్శానికి కట్టుబడి ఆమె వివాహం చేసుకుందో- దాన్ని జీవితంలో అమలుపరుస్తున్న ఆదర్శ గృహిణి! పెద్ద జీతంగల భర్త అయినా- ఆవిడ నిరాడంబరం ముందు- ఆ 'జీతం' తలవంచవలసిందే! నిజంగా అందమైనది! నలభైదాటిన మనిషని చెప్తేగాని తెలియదు! ఆ భర్త వరించి చేసుకున్నందుకు తగినదే! చక్కని వాక్పటిమ గలది! అయినా- ఆదర్శాలని గురించి లెక్చర్ ఇవ్వకుండా జీవితాలని సరిదిద్దాలని వాంఛిస్తోంది!

ఇదే ఆదర్శ వివాహం అంటే!!

అంతేగానీ- భర్త హోదా తను చూపించి- బయట అంతా 'టాం టాం' చేసుకుని ఆదర్శాలని కూడా ప్రచారం చేసుకోవటం కాదు!

వాళ్ళు ఇరవై సంవత్సరాల క్రితం ఎలా కొత్త కాపురం ప్రారంభించారో ఎవరికీ తెలియదు. ఈనాడు ఎంత మామూలుగా వున్నారో- చూస్తే తెలుస్తుంది!

పెళ్ళి మాత్రం ఆదర్శంగా చేసుకుని- ఆ తర్వాత డబ్బు, హోదా రాగానే- ఆదర్శాలన్నీ పక్కకి నెట్టి విర్రవీగటం... ఆదర్శం అనిపించుకోదు.

ఆవిడని చూశాక- ముచ్చట వేసింది!

ఇరవై సంవత్సరాలు వెనక్కి వెళ్లి- ఆమెను యువతిగా, ప్రేమమూర్తిగా ఊహించి చూడాలనిపించింది! ఇదెంతటి చక్కని ఊహ! అందుకే- చెట్టాపట్టాలేసుకుని తిరిగే జంటలు, రోడ్లూ- పార్కులూ చుట్టుకువచ్చే ప్రేమికుల్ని చూస్తే- అసలు ప్రేమలన్నా, పెళ్ళిళ్ళన్నా రోత పుట్టుకొస్తుంది!

ఇంతకీ- ఆ సాయంత్రం పెళ్ళివారింట్లో పాట కచ్చేరీ జరిగింది! -ఆమె పాడింది!! భర్త నేర్పించాట్ట!!

ఆ కచ్చేరీకి వచ్చిన కొందరు- ఆమెను గుర్తుపట్టి- ఫలానావారి ఇంటి ఆడపడచు అని చెప్తే- తెల్లబోయారంతా!!

ఆ ఫలానావారు- చాలా మంచి కుటుంబీకులు! అయినా ఆమె చెప్పుకోలేదు! తను నమ్మిన భర్తతో అజ్ఞాతంగానే, అతని ప్రేమమూర్తిగానే మిగిలింది!! కట్నాలకోసం కాట్లాడుకునేవారికీ- ప్రేమ పేరు మీద వెర్రిగంతులు వేసేవారికీ- ఇదొక చక్కని దృష్టాంతం!!



# ముదితల్ నేర్వగరాని... విద్య కలదే?

**...అ**న్నారు. కానీ, ముదితలు నేర్వకపోయినా- నేర్చుకునే విద్య ఒకటుంది. అదే... 'తప్పుడు ప్రచారాలు' చెయటం!

ఈ విద్య ఎవరూ నేర్పక్కర్లేదు. నేర్చుకున్న విద్యలో ఆరితేరడం వేరు. నేర్చుకోనక్కర్లేకుండా వచ్చే విద్యలో మితిమీరటం వేరు!

కొంతమంది మహిళలు- "పని తీరిక వేళల్లో ఏం చేస్తుంటారండీ?" అని అడిగితే-

"ఆఁ... ఏం తీరికండీ- మధ్యాహ్నం కాస్తసేపు నడుంవాల్చి లేస్తే- మళ్లీ పని మొదలు!" అంటారు.

ఆ 'పని' ఏమిటంటే... పక్కింటి పార్వతమ్మ- ఎదురింటి ఇందుమతి- అవతలి వీధి అరుంధతి- అంతా కలసి సూపర్ మార్కెట్టుకి వెళ్లాలనో- జనతా బజారుకో వెళ్తారు. ఇక అక్కడ కొనే సరుకు కంటే- ఇతరుల మీద విసుర్లే ఎక్కువ!

"మాకు నెలకి నాలుగు కిలోల కందిపప్పు అవసరమవుతుందండీ! మరి, ఆ లక్ష్మమ్మగార్కి రెండు కిలోలు సరిపోతాయట? నలుగురు పిల్లలు కూడా వున్నారు. ఎలా సరిపోతాయండీ? ఏమో బాబూ... మేము ఆ పొదుపు చేయలేము" అంటుందొక ఇల్లాలు!

"పొదుపు కాదండీ! తేరగా మరొకచోట నుంచి వస్తే- కొనుక్కోవటమెందుకూ? వాళ్ళాయన 'సీటు' మహాత్యం అలాంటిది! పప్పులే కాదు- పట్టుచీరల వరకు దొరుకుతూనే వుంటాయి! ఇక మళ్లీ కొనుక్కోవడం ఎందుకూ?" -అని మూతి తిప్పుతుంది మరొక గృహిణి!

"అసలు మీకు తెలుసో, తెలియదో- ఆవిడ గుణం- పోనీలెండి... ఎందుకొచ్చిన గొడవ! ఆవిడ్ని గురించి మా పనిమనిషి అంతా చెప్తూనే వుంటుంది!" -అంటూ ముగిస్తుంది మూడో ముద్దరాలు!

తోటి ఇల్లాళ్ళి గురించీ- వాళ్ళ సంసారిక విషయాల్ని గురించీ ఈకలు తోకలు లాగడానికి వీరు షాపింగ్ పనిలో అంతర్భాగంగా పెట్టుకుంటారు.

ఇక షాపింగ్ కాక మరొకటుంది- మ్యాట్నీ సినిమా! నలుగురైదుగురు మహిళలు బయల్దేరి సినిమా హాల్లో టికెట్ క్యూలో నుంచుని- కనిపించిన ప్రతి పడతి మీదా కామెంట్లు విసుర్లు చేస్తూ-

"ఇదిగో... చూశారా? ఆ చివర ఆవిడ లేదూ- ఆ ఎత్తుముడి ఆవిడండీ? నాకు బాగా తెల్సు. మొగుడితో పడదు! ఒకటే గోల! అస్తమానం దెబ్బలాటలేట! ఈవిడ విలాసాలకి ఆ చాదస్తపు మొగుడు పనికిరాడు! చూడండి ఆవిడ వేషం!" -అంటూ టికెట్టు తీసుకునేవరకు ఒకటే సోది చెప్తుంది!

సగటు మహిళలు ఇలావుంటే- ఇక ఆర్థికంగానూ, విద్యాధికులైనవారూ మాత్రం తక్కువ తిన్నారా? కాకపోతే- చెప్పుకునే నేరాల్లో, చేసే ప్రచారాల్లో కొత్తదనం వుంటుంది.

"మిసెస్ చౌదరి సంగతి తెలుసా? ఫారెన్ నుంచి బోలెడు సరుకు తెచ్చిందట! మంత్లీ ఒకసారైనా పార్టీ అరేంజ్ చేస్తుంది గదా... ఎందుకనుకుంటున్నారూ? ఆ తెచ్చిన స్మగుల్డ్ వస్తువులన్నీ అందరికీ అంటగట్టుంది! ఈమధ్య మరొక 'ఫియట్' కూడా కొన్నారు తెలుసా?" అని తమకన్నా స్థితిమంతురాలైన సాటి మహిళ మీద గంటసేపు రిపోర్టు ఇస్తుంది ఒక ఆధునిక మహిళ!

"మీకు తెలియదు గానీ- నాకు చాలా అన్యాయం చేసింది ఆ మాలినీదేవి! నాకు రావల్సిన ప్రమోషన్ (లేదా పర్మిట్లు.., అదీ కాకపోతే అవార్డు) తన్నుకుపోయింది. రెకమెండేషనోయ్... రెకమెండేషను! వడ్డించేవాడు మనవాడైతే- పంక్తిలో ఎక్కడ కూర్చున్నా ఫర్వాలేదు- అని ఆఫీసర్ ఆవిడకి చాలా దగ్గరి చుట్టంట! ఇక సీనియార్టీలూ, మెరిట్లూ శుద్ధ దండగ!" -అంటూ తనకి రాని వాటికోసం వచ్చినావిడ మీద ఉక్రోషంతో చేసే వాగ్ధోరణి ఇలా సాగుతుంది!

చదువుకున్నవారు గానీ- చదువుకోనివారు గానీ- నోటి వాచాలకత్వం చేత సాటి మహిళల మీద దుష్ప్రచారాలు, నేరాలు చెప్పటమనే విద్య తమంతట తామే నేర్చుకుని వాగుతూ వుంటారు. ఇందులో ఆరితేరినవారు కూడా వుంటారు.

అయితే- కాలం ఎప్పుడూ ఒకేలాగ వుండదు. అది తెలుసుకోవాలి ప్రతివారు! ఎప్పుడో ఎదురుతిరిగి మనకి ముఖం వాచేలాగ దెబ్బకొట్టుందని గ్రహిస్తే- ఇలాంటి పనికిమాలిన విద్యలకి ప్రాముఖ్యతనివ్వరు!!



# నాటికీ, నేటికీ - ఇదేనా?

విద్యావతి అయినా కాకున్నా- వివాహం ఆడపిల్ల జీవితంలో అతిముఖ్య ఘట్టం!

"ఏమి? పెళ్ళి చేసుకోకపోతే బ్రతకలేరా?" అని, -నేటి అభ్యుదయవాదుల వాదన ఉంది!

కానీ, అది అనుకున్నంత తేలికా కాదు- సుఖమూ లేదు!

చదువుకుని, ఉద్యోగం చేస్తూ వివాహం చేసుకోకుండా ఉన్న ఆడపిల్ల- హాయిగా, నిర్భయంగా, నిశ్చింతగా ఉందని ఎవరైనా చెప్పగలిగితే? అప్పుడు 'వివాహం' అన్న పదాన్ని ప్రక్కకి పెట్టవచ్చును.

కానీ- ఆనాడూ, ఈనాడూ కూడా ఆడపిల్ల జంటగా వున్నా- ఒంటరిగా వున్నా- సమాజంలో నానా అవస్థలు తప్పటం లేదు. పెళ్ళంటే కేవలం రక్షణ కోసమే కాదు. పురుషుడికి కూడా పెళ్ళి అతిముఖ్యం!

కానీ- ఆ సంగతి పెద్దగా చర్చించకుండా- పెళ్ళి అనేసరికి- అమ్మాయిని గురించే ఆలోచిస్తారు!

ఎప్పుడో ఆడపిల్లలకి చదువు అవసరం లేదనుకునే రోజుల్నుంచీ మహిళలు పెద్దపెద్ద చదువులు చదువుకుని ఉద్యోగం చేస్తూ- ఇల్లు కూడా చక్కబెట్టున్న ఈరోజుల్లో కూడా- అమ్మాయి పెళ్ళి గురించి దిగులు, భయం పెట్టుకుంటున్నారు.

అమ్మాయికి వయస్సు వచ్చిందని తొందరపడ్తారు గానీ, అబ్బాయి ఈడు ముదిరిపోయినా కట్నాల తూకం సరిగా తూగేవరకు అలాగే వుంటారు. మరి.., ఇన్నేళ్ళ స్వాతంత్ర్యం ఏమి సాధించింది?

ఆరోజుల్లో- అమ్మాయి అత్తవారింట్లో ఆరళ్ళూ, వేధింపులు పడుతుంటే- పుట్టింటి వారు బాధపడడం, ఓదార్చటం జరిగేది.

కానీ ఈనాడు- అత్తింటిదాకా వెళ్లకుండానే- సమాజంలో ఆడపిల్ల దినదిన గండం, నూరేళ్ల ఆయుష్షులాగా బ్రతకాల్సివస్తోంది.

చదువులు, ఉద్యోగాలు లేని రోజుల్లోనే నయమనిపిస్తోంది! నాలుగు గోడలమధ్యే వున్నా- మానసిక వ్యధలు, మానభంగాలు, ఆత్మహత్యలు లాంటివి వాళ్ళ నోటీసుల్లోకి వచ్చేవి కావు.

ఎప్పటికీ బయట ప్రపంచం చూడలేదు, అజ్ఞానంలో కొట్టుమిట్టాడు తున్నారన్న ఆరాటం తప్ప- అఘాయిత్యం, అత్యాచారాలు వాళ్ళ అనుభవంలోకి ఎక్కువగా వచ్చినట్టు లేదు.

మరి, మహిళ- విద్యావతి అయి, బయటికి- తుఫాను తాకిడికి గురైన ప్రకృతిలాగ- ఎడాపెడా ఎదురుదెబ్బలే తగుల్తున్నాయి ఈనాడు!

సంపాదన- ఇటు పుట్టింట, అటు అత్తింటా అందరికీ ఇష్టమే! కానీ, ఆ సంపాదన కోసం- స్త్రీ బయట ప్రపంచంలో ఎన్నెన్ని అవమానాలు ఎదుర్కోవలసి వస్తోంది?

బాలికల కోసం- యువతుల కోసం- గృహిణుల కోసం చాలాచాలా చేస్తోంది ప్రభుత్వం! కానీ, ఏమి లాభం? సమాజపు బురద గుంట పైకి లేవనీయటం లేదు కదా?

ఉద్యోగం చేసే భార్య కావాలనుకోవడమే గాక, కట్నమూ కావాలి!

ఆ తర్వాత సంపాదన ఇంటికిచ్చేసి చేతులు దులుపుకొని- పండగలకీ, వేడుకలకీ- మళ్లీ అత్తవార్ని వేధించాలి!

ఒకవేళ, అతను మంచివాడైతే తల్లే నూరిపోస్తుంది... "నీకు అల్లుడి అధికారం వుందిరా" అని!

ఇటు భార్య సంపాదన- అటు మళ్లీ అత్తవారింటి ముడుపులు- ఈకాలం పురుషులకి ఇదొక ఆటవిడుపు అయ్యింది!

నాడు- ఆడది 'అబల'గా అత్తింట మాత్రమే బాధలు భరిస్తే.., ఈనాడు- మహిళ 'సబల'గా వుండి- అన్నివైపుల నుండీ ఆటుపోట్లు భరించాల్సివస్తోంది!

ఇదా మన ప్రగతి??



# హోలీ, హోలీల రంగ హోలీ!!!

"సమ్మకేలీల హోలీ!"

... అంటూ హోలీ పండుగకి వారంరోజుల ముందునుంచే- మునిమాపువేళ, రాత్రిపూట, తెలంగాణాలో పాటకజనం- చేతులు చరుస్తూ, పాడుతూ, ఇళ్లముందు ఇనాములు కోసం వస్తుంటారు.

ఈ ఆచారం ఎక్కువగా తెలంగాణాలోనే వుంది! అంతేగాక... స్త్రీలే చేస్తారు!

'హోలీ పండగ' అంటేనే రంగులు జల్లుకునే పండగ!

భారతదేశంలో- ఉత్తర, దక్షిణ ప్రాంతాలలో.., ఇంకా అనేకచోట్ల హోలీ పండగకి అనేక కథలు చెప్తారు.

కథలు ఏమైనా- దాని ఫలితం మాత్రం సమాజంలో బాగా ప్రాచుర్యం పొందింది! ఫాల్గుణ శుద్ధ పూర్ణిమ- హోళికా పూర్ణిమ!! ముందురోజు రాత్రి కర్రలు, కంపా, చెత్తాచెదారం- ప్రోగుచేసి కాముణ్ణి దహనం చేస్తారు.

ఆరాత్రి పిల్లలు, పెద్దలు భోగిమంటల్లాగా- ఆ కామదహనం మంటల దగ్గర చేరి- కేరింతలు, సంబరాలు వెదజల్లుకుంటారు. కొందరు ఆ నిప్పు తీసుకెళ్లి-ఇళ్లల్లో పొయ్యిలోవేసి వంటకాలు ప్రారంభించటం కూడా జరుగుతుంది!

ఇక... ఉదయం నుంచి చిన్నా పెద్దా- రంగునీళ్లు జల్లుకుంటూ రంగుల పండుగ చేసుకుంటారు.

సీసాల్లో- పిచికారీల్లో- రంగు రంగుల నీళ్లు నింపి ఒళ్లంతా నింపేస్తారు. సునేర్ (చమ్కీ) ముఖాలకి పూస్తారు. మొత్తానికి... ఒకరికొకరు గుర్తుతెలియనంతగా రంగులు పూసుకుని, ఆడుకుని- బుక్కాలు జల్లుకుని- అలసిపోయాక- అప్పుడు శుభ్రంగా తలంట్లు పోసుకుని- కొత్త బట్టలు ధరించి- తీపి తింటారు.

ముఖ్యంగా... మార్వాడీలు ఈ హోలీ పండుగ ఒక ప్రత్యేకమైన రీతిలో- చాలా సరదాగా చేసుకుంటారు. బంధువులు, మిత్రులు, వరసైన వాళ్ళకి గులాబీరంగు జల్లి ఆనందిస్తారు. సాయంత్రం అందర్నీ పిలిచి చక్కగా పార్టీ చేస్తారు.

ఆరోజు మనం టీ.వీ. పెడ్తే చాలు- అన్నీ హోలీపాటలే వస్తాయి!

రాధాకృష్ణుల కేళి మొదలు- ప్రేమికులు, బావామరదళ్ళు, వియ్యంకులు- వియ్యపువాళ్ళు- మిత్రులు... అంతా రంగులాటల్లో దర్శనమిస్తారు!

నిజానికి హోలీ పండుగ- మనసులని రంజింపచేసేదే! వివాహ సమయంలో కూడా- వధూవరులచేత వసంతం (ఎరుపునీళ్లు) చల్లించి ఆనందిస్తారు పెద్దలు! బుక్కాలు చల్లిస్తారు. ఇవన్నీ ఆనందాలకి సాక్ష్యాలు!

పండగలన్నీ అర్థం తెలుసుకుని ఆనందిస్తే ఫర్వాలేదు.

కానీ, దురదృష్టవశాత్తు- అర్థం మరచి- విపరీత ధోరణిలోకి వెళ్లి- ఆనందాలని హరింపచేసే సంఘటనలు ఎన్నో జరుగుతూ వుంటాయి.

చక్కగా రంగులు జల్లుకోక- కొందరు మసిబొగ్గు, బురద, కారంనీళ్లు చల్లటం- అపరిచయస్తుల మీద కూడా చల్లి వాళ్ళ మనస్సులు నొప్పించటం- కళ్ళల్లో, ముక్కుల్లో పోసి- ఆసుపత్రికి వెళ్లేలాగ చేయటం... చాలా విచారించదగ్గది!

అలాగే- ఇనాములు అడుక్కునే స్త్రీలు- లంబాడీవాళ్ళు- ఎవరైనా ఇనాములు ఇవ్వకపోతే... వారింటి ముందు మన్నూ, దుమ్ము, పేడలాంటి అసహ్యకరమైన చెత్తపోసి- నానా తిట్లుతిట్టి- శాపనార్థాలు పెట్టి బాధించటం... ఎంత అనాగరీకమైనదో ఒక్కసారి ఆలోచించండి!

ఇలాంటి అనాగరీకులు- మోటువాళ్ళ దగ్గర పండగలు కూడా ప్రమాదకరంగానే పరిణమిస్తాయి!

కనుక- హోళీ అంటే... 'సంతోషపు కేరింతలతో సరదాగా జరుపుకోవలసిన రంగుల పండుగ' అని తెలుసుకుని- ఆ విధంగా జరుపుకుంటే- అంతా ఆనందమయం!



# ఊహాగానాలు- ఊపిరి కావు!!

నేడు చాలామంది పిన్నాపెద్దా కూడా అనావశ్యకమైన విషయాలకీ, అసందర్భమైనవాటికీ విలువనిచ్చి- నిజ జీవితంలో నిస్పృహ- నిరాశలకి లోనవుతున్నారు.

భ్రమ అనేది... యథార్థం కాదు!

కల్పన, ఊహ మనిషికి కొంత వినోదం- ఉల్లాసం కల్గిస్తాయి తప్ప- జీవితంలోని సమస్యల్ని పరిష్కరించవు!

ఉదాహరణకి- సినిమా కథ చూస్తూ- నిజజీవితంలో కూడా ఊహల్లో తేలిపోయే మహిళలు ఎందరో? ముఖ్యంగా యువత!!

మూడు గంటల వినోదం కోసం నిర్మించే చిత్రంలో- వ్యాపారదృష్ట్యా ఎన్ని హంగులు అమర్చగలరో- అన్నీ సమకూరుస్తారు నిర్మాతలు! మూడు గంటల్లో ముప్పై ఏళ్ల కథని చూపించగలరు.

అతి బీద పిల్లని- గొప్పింటి కోడలుగానూ..., పేద నిరుద్యోగికి లక్షల ఆస్తి కలిసిందనో- చూపిస్తారు.

ప్రేక్షకులు చూసి ఆనందించాలే తప్ప- మనకే అలాంటి అవకాశం రావాలని ఊహాగానాలు చేస్తూ- విలువైన కాలాన్ని వ్యర్థం చేసుకుంటే- జీవితం మళ్లీ వెనక్కి తిరగదు కదా?

జీవితం అంటే సినిమా రీలు కాదు. ఒక్క సినిమా- మనం ఎన్నోసార్లు చూస్తున్నాం! ఎన్నోరోజులు అటని చూపిస్తారు- ఆ హాలు యజమాన్లు! కానీ... మహిళలుగానీ, యువతగానీ- ఇది దృఢంగా ఆలోచించక ఊహాగానాలు చేస్తూ తమ జీవితంలో అలాంటి అవకాశం రావాలనీ- వస్తుందనీ ఊపిరి నింపుకుంటూ ఉంటారు!

టీ.వీ. సీరియల్స్‌లో చదువురాని అమ్మాయి- భర్తచేత అవమానించబడి, ఇంట్లో నుంచి బయటకి గెంటబడుతుంది! ఆ తర్వాత పట్టుదలగా చదివి పరీక్షలు ప్యాసై- ఉద్యోగస్తురాలవుతుంది.

ఇంతవరకు ప్రబోధాత్మకంగా- మహిళలకి ఆదర్శంగా వుంది కథ! అయితే- చదువుకున్న కాలం గబగబా రీలు తిరిగిపోవటం వల్ల- నిజ జీవితంలో మహిళలు చదువుకోసం పడాల్సిన శ్రమనీ, పట్టుదలనీ పాటలో 'పల్లవి'లాగ పక్కకి వుంచి- చివరి దృశ్యంలో చూపిన 'పేద్ద' బంగ్లా మీద దృష్టి నిలుపుకుంటారు!

ఆ మేడ- ఒక జమీందారు బంగ్లాలాగ- కిందా, పైనా అట్టహాసంగా అలంకారాలతో ఉంటుందనుకోండి! ఓహోఁ... చదువుకుని ఉద్యోగం చేసుకుని- అంత ఇల్లు కట్టుకోవచ్చు! కారు... నౌకర్లు... దర్జా... అబ్బో! ఎంత సుఖం... అనే ఊహాలు సాగిపోతూ- అవే ఊపిరిలాగ అయిపోతాయి!

అంతేకాని- ఇందులో యదార్థం ఎంత వుంది? ఎంతవరకు మన దృక్పథం సాగాలీ?... అన్న ఆలోచన కలగదు.

'ఒక ఉద్యోగం' అనగానే- ఎలాంటిది? ఎంతరాబడి వుంటుందీ? ఎంత హోదా వుండవచ్చును? ఒకవేళ ఇల్లు కట్టుకున్నా ఎంత వుండటానికి అస్కారం వుంటుంది? నీతిగా, నిజాయితీగా వుండే ఉద్యోగంలో ఎంత సంపాదించగలరు? (అలాంటి ఆదర్శమైన జీవితాలనే చూపిస్తారు గదా మరి!) ఈ రకమైన ఆలోచన చిత్ర నిర్మాతలకి ఉండదు! ఎందుకంటే- సినిమా ఒక వ్యాపారం కనుక- ప్రజల్ని ఆకర్షించటం కోసమే- ఆలోచిస్తారు.

కానీ, నిజ జీవితంలో ఇలాంటివి సాధ్యమా?... అన్నది మనం ఆలోచించాలి!

ఏది సాధించాలన్నా కర్తవ్యం- శ్రమ ముఖ్యం!

అవి చేయకుండా ఊహలలో అన్నీ సాధించేయాలనుకోవటం వెర్రితనం!

మనం కష్టించిన దానిమీద మనం అనుభవించబోయే ఫలితం వుంటుంది తప్ప- ఊహాగానాలతో ఏదీ కాదు! అవాస్తవమైనవీ, అసందర్భమైనవీ చూసి, చదివి, ఈనాటి మహిళలు, యువతరం- ప్రలోభాలకి గురి అయితే- విచారించాల్సిందే!

వివేకం- విమర్శనాత్మక దృష్టి వైపు పయనించాలని మగువలు, యువతా... సంకల్పించాలి! ఆ సంకల్పమే ప్రబోధగీతం అవుతుంది.



# భావం తెలియాలంటే-
# భాష బహు ముఖ్యం!

ఒక మహిళ విద్యావతి అయితే కుటుంబమంతా విద్యావంతమవుతుందన్నది సత్యమని అందరికీ తెలుసు!

చదువు గల్గి, ప్రపంచ జ్ఞానంతో ఇల్లు దిద్దుకోగలిగినప్పుడు అది సంతోషం. భర్త, బంధువులు సైతం తెలివితేటలు మెచ్చుకునే అవకాశం ఉంది. ఎందుచేత?

మహిళ తనకి తెలిసిన పరిజ్ఞానం తన వాళ్ళకి అర్థమయ్యే రీతిలో చెప్పుతుంది. మాతృభాషని మించిన జ్ఞానం మరే భాషలోనూ దొరకదు.

అందుకే ఉత్తమమైన సాహిత్యం ఏ భాషలో ఉన్నా మిగతా అన్ని భాషలలోకి అనువదిస్తారు... విజ్ఞులు! మాతృభాషలో చదివి అర్థంచేసుకోగలిగినట్టు- పరభాషానుభవం ఎంతవున్నా చాలదు.

ఎంతో ఉపయుక్తమయ్యే పురాణేతిహాసాలు, కావ్యాలు- సంస్కృత భాషనుంచి తెనిగించిన తర్వాతే చాలామంది సులభంగా చదువుకోగల్గుతున్నారు. విద్యావంతుల సంగతి వదిలి- అసలు అక్షరజ్ఞానము లేనివారికీ, మాతృభాష తప్ప మరొక భాష తెలియని అజ్ఞానులకీ... ఏదైనా తెలియచేయాలంటే- మనకి వచ్చిన భాష కాదు ఉపయోగించవలసింది- వాళ్ళకి తెలిసిన భాషలో చెప్పాలి!

మనం చాలాచోట్ల చూస్తుంటాం, వింటుంటాం! ఏవో సభలూ, సమావేశాలూ, ఉపన్యాసాలూ జరుగుతున్నప్పుడు- ఏమిటో విందామని వెళుతూ ఉంటారు కొందరు! తీరా వెళ్లాక, మధ్యలో లేచి వెళ్లిపోతారు.

ఏమైందని అడిగితే-

"ఏమిటో... ఒక్క ముక్క అర్థంకాలేదు. ఏమి వింటాం?" అని నిరుత్సాహ పడేవాళ్ళని మనం చూస్తూనే ఉంటాం. ఇలా సభలలోనే కాదు, పుస్తకం చదవాలన్నా, సినిమా చూడాలన్నా పరభాషా పరిజ్ఞానం లేక చాలామంది ఇబ్బంది పడుతూ ఉంటారు.

ఇక... అట్టడుగు శ్రామికజాతి స్త్రీలు మాతృభాషలోనైనా- విడమరచి చెప్తే తప్ప బుర్రలోకి ఎక్కించుకోలేని వారుంటారు. ఇప్పుడిప్పుడు- అక్షరాస్యులని చేయాలని ప్రభుత్వం సంకల్పించినా- రెండుమూడు భాషలు క్షుణ్ణంగా రావటం చాలా కష్టం! ఎప్పటికో అది సాధ్యం!!

కనుక, గ్రామీణ స్త్రీలుగానీ, నగరాలలోని నిరక్షరాస్యులుగానీ కొద్దోగొప్పో చదువుకున్న సగటు మహిళగానీ, మాతృభాషలో తెలుసుకోగలిగినంత విపులంగా ఏ విషయాన్నయినా ఇతర భాషలలో విని అర్థంచేసుకోలేదు.

ఈనాడు మహిళాభ్యుదయం కోసం అనేక కార్యక్రమాలు జరుగుతున్నాయి. అత్యాచారాలు, అన్యాయాలు ఎదుర్కొంటున్న స్త్రీలకి మేలు చేసే ఉద్దేశంతో ఎన్నో వేదికలు ఏర్పాటుచేస్తున్నారు... పెద్దలు, సంఘ శ్రేయోభిలాషులు! అయితే.., విద్యావంతులకి, ధనిక వర్గం వారికీ ప్రత్యేకించి చేయదగ్గ ఉపన్యాసం అంతగా అవసరం ఉండకపోవచ్చును.

ఎటొచ్చీ... సగటు మహిళలే అనేక చిక్కులు, సమస్యలు అనుభవిస్తున్నారు. ఇటువంటి మహిళలు అలాంటి వేదికలకి వెళ్లి వింటే- ఎంత అర్థమవుతుందీ? ఇంగ్లీషులో, హిందీలో ఉపన్యాసాలను ఎంతమంది వనితలు తలకి ఎక్కించుకోగల్లుతారూ? కనీసం- వాటిని తిరిగి తెలుగులో అనువదించకపోతే- ఏ ఉద్దేశంతో వేదికలు ఏర్పాటుచేస్తున్నారో వాటి లక్ష్యం నెరవేరదు.

ఏ బోధకానీ, ఉపన్యాసం కానీ, వేదిక లేక చర్చగానీ- ప్రదేశాన్ని బట్టి, మనుషులని బట్టి, వారి మాతృభాషని బట్టి నడిపంచడం..., అవసరమైతే- అనువాదం చేసి తెలియపరచటం ముఖ్యం! కానీ, చాలామంది పెద్దలు ఈ విషయాన్ని దృష్టిలో ఉంచుకోరు.

పెద్దపెద్ద కమిటీ హాల్స్‌లో మీటింగ్‌లు పెట్టి సమాజ శ్రేయస్సు కోసం ఉద్ఘోషిస్తే ఎవరు వింటారు?

కార్లలో, ఆటోల్లో వచ్చి పట్టభద్రులు, పెద్ద పదవుల్లో ఉన్నవారు వింటే- సామాన్యులకి ఏం మేలు జరుగుతుంది?

ఎవరు వినాలో, ఎవరు బాగుపడాలో... వారికి అనుకూలమైన పద్ధతిలో, వారి మధ్యకు వెళ్లి, వారి అభిప్రాయాలను కూడా క్రోఢీకరించుకుంటే- అప్పుడు సభలైనా, వేదికలైనా- వాటి లక్ష్యం నెరవేరుతుంది.

భావం తెలియాలంటే- భాష కదా ముఖ్యం?!



# ఆరోగ్యమా? అదెక్కడ?

గ్రామోద్ధరణ కార్యక్రమాలలో- ఆరోగ్యసూత్రాలు, పౌష్టిక ఆహారం, పిల్లల సంరక్షణ... అనే అంశాల్ని గురించి పదే పదే చెప్తున్నారు.

కానీ, అసలు ఆరోగ్య సూత్రాలు పాటించే విధానమే తెలియదు గదా- వాళ్ళకి?!

ఈనాటికీ మారుమూల పల్లెల్లో- పెరట్లో తడికచాటునో, చెట్టుకు చీర అడ్డం కట్టుకునో ఆడంగులు స్నానాలు చేస్తుంటారు.

అక్కడే చిన్నపిల్లలకి కూడా చేతులు, మూతులు కడిగి శుభ్రం చేస్తుంటారు!

ఆ మురికి నీరంతా ప్రవహించడానికి ఏ సిమెంటు కాలువా వుండదు! మట్టిలో కొంతదూరం ప్రవహించి అక్కడ ఏ చెట్టు మొదట్లోనో చేరుతుంది... ఆ నీరు!

నిల్వవున్న ఆ నీటి మీద దోమలు, చిన్నచిన్న పురుగులు చేరి జబ్బులూ, అంటువ్యాధులకీ ఆస్కారం కలిగిస్తాయి!

ఇరువయ్యో శతాబ్దపు చివరిదశలో వున్న మనం- ఎంతో సాధించామనీ, ఎన్నో అధునాతన పద్ధతుల్లో మనుగడ సాగిస్తున్నామనీ అనుకుంటున్నాం. కానీ, ఈనాటికీ- గ్రామీణ వాతావరణంలో ప్రజలు- మరుగుదొడ్లు లేక బహిర్భూమికి ఎంతో దూరం వెళ్లాల్సివస్తోందనీ, వెళ్తారనీ- మనలో చాలామందికి తెలియకపోవచ్చు.

ఇళ్లలో మీట నొక్కగానే వెలిగే విద్యుద్దీపాలు, పాలిష్ బండలతో బాత్‌రూములు, షవర్లూ, గీజర్ల సుఖాల్లో తేలే పట్నవాసులకు సగటు గ్రామీణ మహిళ నిత్యజీవన విధానం తెలియదు.

ఉదయం లేచిన దగ్గర్నుంచీ- రాత్రి పడుకోబోయేవరకు వారు ఎంత శ్రమపడి పనులు చేసుకుంటారో- ఆ పద్ధతుల్లో అనారోగ్యం ప్రబలడానికి ఎంత ఆస్కారముందో- అక్కడికి వెళ్లి చూస్తేగానీ తెలియదు.

ఆమధ్య అంతర్జాతీయ దశాబ్దంలో- కొందరు మేధావి వర్గం- అనేక విషయాలపైన అధ్యయనం చేసి వెలిబుచ్చిన అభిప్రాయాలు వింటే- మామూలు మనుషులకి ఆశ్చర్యం కలగక మానదు.

అసలు... ప్రతి మనిషి తిండీ, గుడ్డ, ఇల్లు- అంటారు గానీ, కొన్ని పల్లెల్లో ఉండేవారికి అసలు ఇల్లంటూ ప్రత్యేకించి లేదు అని తెల్సింది!

ఏదో తలదాచుకునేందుకు 'గూడు' అనాలిగానీ, అది ఇల్లులా వుండదు. ఆకలి తీరటానికి ఏదో ఒకటి అన్నట్టుంటారు వాళ్ళు. వాళ్ళకి పౌష్టికాహారం తినమని చెప్పటమంటే- హాస్యాస్పదంగా వుంటుంది!

నీళ్లకీ కరువై- ఎంతో దూరం వెళ్లి కడవలతో తెచ్చుకునేందుకు బోలెడంత సమయం పడ్తుంటే- స్నానం బాగా చెయ్యాలనీ, శరీరం శుభ్రంగా రుద్దుకోవాలనీ- ఎలా చెప్పటం?

ఒంటినిండా బట్టల్లేక- చిరిగిన నిక్కర్లతో- అమాయకంగా ఆడుకునే వాళ్ళ పిల్లలకి- "రండ్రా! చదువు చెప్తాం!" అని లాక్కెళ్లి- కూలేయటం కాదు- వాళ్ళు ముందు తిండితిని, ఒంటినిండా బట్ట కట్టుకోగలిగే ఉపాధి చూపెట్టాలి! తరువాతే ఏ విద్యలైనా- ఆరోగ్యసూత్రాలైనా!

రెక్కాడితేగానీ డొక్కాడని శ్రామికజాతికి విశ్రాంతిని గురించి, గర్భిణీ స్త్రీల జాగ్రత్తల గురించీ చెప్తే ఏం ప్రయోజం?

సినిమాల్లో, టీ.వీ. సీరియల్స్‌లో పల్లె వాతావరణం ఆహ్లాదంగా ఉన్నట్టు చూపిస్తారు. మనం చూసి సంతోషిస్తాం!

ఆధునిక ప్రపంచానికి ఆవల- ఆ గ్రామీణులు, పల్లెలు... అదొక ప్రపంచం!! వారి కసలు- ఈ నాగరిక ప్రపంచాన్ని గురించి తెలియదు!!! ఆరోగ్యం అంటే తెలియదు!! -చాలీచాలని బ్రతుకు ప్రత్యక్షంగా కనిపిస్తుంది! ఈ అమాయకులకు మొదట- కడుపు నిండా తిండి, శుభ్రమైన బట్ట- కనీస అవసరాలకి తగిన ఏర్పాట్లు- అంటే... మరుగుదొడ్లు, నీళ్ల గదులు, మురికి నీరు పారేందుకు వీలుగా కాలువలు, బావి గట్టు, బావిలో చెత్తా చెదారం పడకుండా జాగ్రత్తలు- ఇంటి పరిసరాల్లో చెత్తకుప్పలు పోగు చేసుకోకుండా దూరంగా పెద్ద గుంటలా ఏర్పాటుచేయటం... ఇలాంటి ప్రాథమిక దశలోని సౌకర్యాలని కలిగించాలి!!

ఈ పథకాలన్నిటికీ ప్రభుత్వం ఇస్తున్న నిధులు- మధ్యవాళ్ళ చేతుల్లో 'స్వాహా' అవకుండా- స్వయంగా వాళ్ళకే వినియోగించే విధంగా- సంఘ సంస్కర్తలు, సేవా సంస్థలు పూనుకుంటే హర్షణీయం!!



# విద్యార్థి దశ - ఓ సమస్య?

ఇప్పుడిప్పుడే చదువులు, ఉద్యోగాలు- మహిళా లోకానికి ఉత్తేజం, ఉత్సాహం కలిగించి- ఆర్థిక సమస్యల్ని కూడా ఎదుర్కొని ముందుకువచ్చేలా చేస్తున్నాయి.

ప్రతివారూ కొద్దోగొప్పో చదువుకుని- దానిని సద్వినియోగం చేసుకోవాలనే ప్రయత్నంలో వున్నారు!

ఊరుకాని ఊరైనా- కొంతమంది ధైర్యంగా ముందుకువచ్చి- పట్నాల్లో చదువుకుంటున్నారు.., ఉద్యోగాలు చేస్తున్నారు.

పట్నాల్లో- వీరికి హాస్టల్ సదుపాయాలు వున్నాయనీ, సురక్షితంగా ఉండవచ్చుననీ ఆశిస్తున్నారు. ఆ విధంగా ఉన్నవారు కూడా వున్నారు. ఉద్యోగినులకీ- విద్యార్థినులకీ ఎవరి వీలుకి తగినట్టు వారికి హాస్టల్స్ ఉంటున్నాయి!

ఇటీవల ఈ సదుపాయం మరింతగా పెరిగింది.

ఒక మోస్తరు ఊళ్లల్లో కూడా- హాస్టల్స్ ఉంటున్నాయి! దానివల్ల- ప్రతి చిన్నపల్లెనుంచి ఆసక్తిగలవారు వచ్చి చదువుకునేందుకు, ఉద్యోగాలు చేయటానికి వీలుగా ఉంటోంది!

ఇంటి దగ్గర పెద్దలు కూడా- మన పిల్లలు ఫలానాచోట హాస్టల్‌లో హాయిగా, సురక్షితంగా ఉన్నారన్న ధీమాతో- నిశ్చింతగా ఉండగలుగుతున్నారు (ఉంటున్నారు).

కానీ, దురదృష్టం అనేక విధాలుగా సమాజంలో వికటాట్టహాసం చేస్తోంది!

ఆడపిల్లలపాలిట 'కట్నం' ఒక పిశాచంలా ఉంటే- అత్తింటి ఆరళ్ళు మారణహోమానికి దారితీస్తే- అత్యాచారాలు ఆత్మహత్యలకి పీఠం వేస్తుంటే- ఇవన్నీ చాలక... హాస్టల్స్‌లో కూడా అమానుషత్వం విజృంభించింది!

ఆమధ్య ఒక సాంఘిక సంక్షేమ వసతి గృహంలో విద్యార్థినిపై అత్యాచారం జరిగిందనీ.., ఆమె ఆ కారణంగా మరణించిందనీ.., దాని మీద వాదోపవాదాలు - చర్చలు- ఈనాడు జరగటం కాదు! ఆనాడు ఏం చేశారు? ఆమె తిరిగి బ్రతికి వస్తుందా? అందుకు కారకులైన వారిపైన ఏ చర్య తీసుకున్నారు?... అన్న ప్రశ్నలు ఈనాడు వేసుకుంటే లాభం వుంటుంది?

మానవత రానురాను అడుగంటిపోతుంటే- అమానుషత్వం వీరవిహారం చేస్తుంటే- అమాయకులు బలి అయిపోతారని అందరికీ తెలుసు!

కానీ, భవిష్యత్తులో దీని ఫలితం ఎలా వుంటుంది?

చదువులకీ, ఉద్యోగాలకీ- పరాయి ఊళ్లకి వెళ్లాలంటే మళ్లీ భయం భయమే! 'చదివినంతవరకు చాలు! ఇంటిపట్టున పడివుండు' అనేమాట సభ్య కుటుంబాల్లో వినబడుతుంది!

అక్షరాస్యత కోసం- పెద్ద ఎత్తున ప్రచారాలు చేస్తున్న మనం అక్షరజ్యోతులు వెలిగించుకుంటున్న మనం- అజ్ఞానపుఊబిలో- స్వార్థపు నీడలో- కళ్లు మూసుకునిపోయి- అత్యాచారాలకీ, అక్రమాలకీ- పాల్పడుతున్నామా? అని ఎందుకు ఆలోచించగలరు?!

అటువంటి ఆలోచనే వుంటే- ఇన్నేసి దారుణాలు ఎలా జరుగుతాయి?!

సమాజంలో ఒకవైపు ప్రగతి సూత్రాలు వినిపిస్తూ మరోవైపు దౌర్జన్యాలు, దురాగతాలు చేస్తుంటే- దేశం ఏ రీతి బాగుపడుతుంది?

అమ్మాయిలు హాస్టల్‌లో ఉండాలంటే హడల్ పుట్టే ఇక సంక్షేమ వసతి గృహాలు దండగ! కొన్నాళ్లకి మూసివేయాల్సివస్తుంది!

భవిష్యత్తులోనైనా నైతిక విలువలు పటిష్టంగా వుండే తీరులో ప్రభుత్వం చర్యలు తీసుకుంటే మంచిది!

వట్టి అరుపులకన్నా గట్టి చర్యలు కావాలి!



# సదుపాయాలు- సాధక బాధకాలు

ఈ రోజుల్లో తెల్లవారిందంటే- ఎంత కంగారో, పరుగులో!

ఏదో సుముహూర్తానికి వెళుతున్నట్టు- రైలుకి వెళుతున్నట్టు పరుగులు, ఉరుకులు!

అన్నీ టైం ప్రకారం గబగబా చేసుకుంటే గానీ - ఆఫీసుకి అందుకోలేరు. భార్యాభర్తలు ఇద్దరికీ ఉద్యోగాలు కదా?

ఇంట్లో పెద్దవాళ్ళు - ఆదుకోకపోతే - ఇక అన్నీ చేసుకోవాల్సిందే! అందుచేత- ఈనాటి ఉద్యోగస్తులు అన్నిరకాల సదుపాయాలూ సమకూర్చుకుంటున్నారు.

తెల్లవారకుండా పనిమనిషి వచ్చేస్తుంది.

అంట్లు తోమడం, ఇళ్ళు తుడవడం, బట్టలు వాషింగ్ మిషన్‌లో వేసి ఉతికేయటం- గ్రైండర్‌లో మసాలాలు, చట్నీలు చేయటం- పసిపిల్లలకు స్నానాలూ, అవసరమైన పనులూ చూడటం- అమ్మగార్కి కూరలు తరగటం- ఆరిన బట్టలు ఇస్త్రీ చేయటం- ఆ భార్యాభర్తలు ఇద్దరూ- ఆఫీసుల కెళ్ళేంతవరకు ఆగివుండటం... ఇన్ని రకాల చేయూత వుండటంచేత 'హాయిగా' వెళ్తారు, స్కూటర్ ఎక్కి!

పైగా- సదుపాయాలు చేసుకోవటం తెలియక- వెనకటితరం మనుషులు (పెద్దవాళ్ళు) చాలా అవస్థలు పడేవారని జాలిపడటం కూడా జరుగుతుంది.

నిజమే! యంత్ర సదుపాయాలు పెరిగాక- ఆర్థికంగా మెరుగుపడ్డాక- సుఖాలు ఎక్కువయ్యాయి! కానీ- అనుకోని అవాంతరాలు వచ్చినప్పుడు ఈ సుఖాలు దక్కవని కూడా అనుభవంవల్ల తెలుస్తూనే వుంది.

పనిమనిషి రానిరోజు- ఇంటి ఇల్లాలికి ఇంట్లో పనంతా భరతనాట్య భంగిమలో సాగాల్సిందే!

దానికితోడు- కరెంట్ బంద్ అయితే గ్రైండర్ పనిచేయదు, బట్టలమిషన్ ఆగిపోతుంది. విసుగు, కోపం, కళ్ళనీళ్ల పర్యంతం అవటం సహజమే! ఇక, గ్యాసు అయిపోతే?? ఇక చెప్పక్కర్లేదు- ఆ ఇంటి భాగోతం!!

అప్పుడు మాత్రం- 'అబ్బ! అమ్మావాళ్ళూ, అత్తగారూ వాళ్ళూ- ఎలా రుబ్బుకునే వాళ్ళో? ఎలా విసురుకునే వాళ్ళో?' అని వాళ్ళ ఓపికని మెచ్చుకుంటారు.

పనులన్నీ పూర్తికాక సమయం చాలక- అవతల ఆఫీసుకి వేళ మించిపోతుండగా- ఆదరాబాదరాగా తయారైతే- తీరా- స్కూటర్ రిపేర్‌లో వుంటే- ఇక చెప్పక్కర్లేదు- ఉష్! అనుకుంటూ బస్సు కోసమో- ఆటో కోసమో- ఎదురుచూస్తూ- నిముష, నిముషానికి గుండెదడ హెచ్చుతూ- అవస్థ పడతారు.

స్కూటర్లు, ఆటోలు అలవాటైన ప్రాణాలకి- నాలుగు అడుగులు నడిచే ఓపికలేక- 'అబ్బో! మన పెద్దవాళ్ళు మైళ్ల కొలది నడిచేవాళ్ళట! ఎంత ఓపికో?' అని ఆశ్చర్యపోతూ వుంటారు... ఈనాటి యువతీ యువకులు!!

కరెంటు వుండి- పనిమనిషి, వంటమనిషి వుండి- స్వంత వాహనం ఉండి వుంటే- ఎంత సుఖమో- ఒక్కరోజు గనుక, అవి లేకపోతే- అంత కష్టం మరెక్కడా ఉండదని తెలుసుకుంటారు.

తీరా... ఇంత కష్టం అనుభవించి ఇంటి తాళం వేస్తున్నప్పుడు గనుక- కరెంట్ వచ్చిందంటే- మళ్లీ లోపలికి వచ్చి ఫ్యాన్లు- మిషన్లు- టీ.వీ.- రేడియో - అన్నీ కట్టేయకపోతే- సాయంత్రం ఇంటికి వచ్చేసరికి- బోలెడు బిల్లు అవుతుంది! కరెంట్ వల్ల ఐరన్‌బాక్స్‌లు అవీ పాడయ్యే ప్రమాదం.., ఏదైనా అంటుకునే ప్రమాదం కూడా ఉందని గృహిణి వణికిపోతుంది!

మరి.., సదుపాయాలు వున్నా- అందులో కూడా సాధక బాధకాలు కూడా వుంటాయి మరి?!



# నాటి సీతలోని సునీతే- నేటి వనితలో అనితరశక్తి!

హిందువులకున్న అనేక పండుగలలో- కొన్ని దైవ సంబంధమైనవి!

మరికొన్ని ప్రకృతి సంబంధమైనవి! ఇంకా కొన్ని విజయోత్సవాలు గుర్తులుగా మిగిలినవి!

ఇందులో- శ్రీరామనవమి... అత్యంత పవిత్రమయినది! చైత్రశుద్ధ నవమి- శ్రీరామనవమి! మహా సాధ్వి అయిన సీత, సాక్షాత్తూ లక్ష్మీదేవి- విష్ణుమూర్తితో, ఈ పృథ్వి మీద అవతరించి- అనేక కష్టాలు భరించింది! 'సీతమ్మవారి కష్టాలు' అంటే ఇక లెక్కలేనన్ని... అని అందరికీ తెలుసు!

సీతాదేవి సామాన్య మానవరూపంలో జన్మించింది లేదా అన్న సంశయం కాదు... మనం ఇక్కడ చెప్పుకోవలసింది- ఆమె ఒక స్త్రీ!! ఆమె చరిత్రలో యుగయుగాల వరకు సకల జనులు తలచుకునే- పునీత! సౌభాగ్యవతి!!

ఎందువలన సీతని మనం పవిత్రంగా పూజిస్తున్నాం? ఆమె శ్రీరామచంద్రునితో అడవులకి వెళ్లి కష్టాలు పడిందనా? అగ్ని ప్రవేశం చేసిందనా? ముని ఆశ్రమంలో- వికసించిందనా?!

వీటన్నిటి వెనుక ఓ గొప్ప సత్యం వుంది. అది యుగధర్మం!

కాలమాన పరిస్థితులని బట్టి- ధర్మం, నీతి- గ్రహించాలి! త్రేతాయుగంలో- సీతాదేవి అనుసరించిన ధర్మం- పతివ్రతా లక్షణం! తాను సర్వశక్తి సమర్థురాలైనా... భర్త యొక్క విజయానికే ప్రాధాన్యతనిచ్చింది. ఆమె తల్చుకుంటే రావణుని భస్మం చేయగలదు! కానీ, శ్రీరామచంద్రుని- బాధ్యత అది! పురుషుడు చెయ్యవలసిన కర్తవ్యం- తాను చెయ్యలేదు! ఆ భర్త వచ్చేవరకు తాను నిగ్రహంతో నిరీక్షించింది!

సీతలోని శక్తి- రావణుడికీ తెలుసు! ఆమె క్రోధించి తనను నాశనం చేయగలదని! కానీ, ఆమె తనంత తాను ఆ పని చేయదనీ, భర్తకే ఆ ధర్మకర్తవ్యాన్ని నిర్దేశించి వుంచిందనీ- రావణుడు గ్రహించగలడు!



అంటే... సీత- ఒక విధంగా రామచంద్రుడికి కర్తవ్యబోధ చేసింది.

అగ్నిప్రవేశం చేసేటప్పుడు కూడా ఆమె పవిత్రత రాముడికీ తెలుసు! అయినా... అందరి మనస్సులో 'శంక'పోగొట్టడం కోసమే అలా అజ్ఞాపించాడు.

సీతకీ తెలుసు... పరుల కోసమేననీ! తన సౌశీల్యం నిప్పుకంటే- నిఖార్సైందని నిరూపించుకుంది! ముని ఆశ్రమానికి వెళ్లినా సమాజంలోని 'చాకలాళ్ల' (మనస్సులో మురికి జేర్చుకునే ప్రజలు) మీద నిరసన చూపిందిగానీ- తనలోనే వున్న రాముడిమీద అలగలేదు!! చివరికి- భూదేవి ఒడిలోకి చేరుకునేటప్పుడు- రాముణ్ణి సంబోధించి పలికిన పలుకులన్నిటిలో- "ఈ ప్రజలు ఎంత మూర్ఖులో... వాళ్ళని పరిపాలించే రాజుగా నువ్వు నీ కర్తవ్యాన్ని నిర్వహిస్తున్నావు. కానీ, నేను ఇక భరించలేను వెళ్లిపోతున్నా"నని యుగధర్మానికి- చివరి ముగింపు పలికింది! స్త్రీ సహనానికి 'హద్దు' ముగిసిందని చెప్పినట్లే కదా?

ఆ ముగింపులోని స్త్రీ శక్తి ప్రేరణే- మనకి ఆమె పట్ల పవిత్రభావం, గౌరవం కలిగిస్తున్నాయని తెలుసుకోవాలి! ఆమెలోని 'సునీతి' అవసరమైనంతవరకు ఓర్మిగా వుండి- చివరకు 'శక్తి'గా ముగించింది!

ఇది కలియుగం! ఇరువయ్యో శతాబ్ది చివరలో వున్నాం! మహిళలు ఉద్యోగాలు చేసి- కుటుంబాలు నడిపించేస్థితిలో వున్నాం! భర్తని(వరుణ్ణి) డబ్బు ఇచ్చి కొనుక్కుంటున్నారు! 'భర్త' భరించేవాడు కాకుండా- పోషించబడేవాడుగా, ఆడదాని సొమ్ముకి ఆశపడేవాడుగా ఉన్నాడు. కనుక యుగధర్మం మారింది. మహిళ ఈనాడు 'శక్తి' చూపించాలి అన్నది- ఆనాడే సీత సూచనప్రాయంగా తెలియజేసిందన్నమాట!?

అందుకే- 'సీత'పూజ్యురాలై యుగయుగాలకీ నిలిచివుంటుంది! ఆనాటి 'సీత'లోని 'సునీతి' ఈనాటి వనితల్లో అనితర శక్తిగా రూపుదిద్దుకుని- అన్యాయాలనీ, అధర్మాలనీ ఎదుర్కోవాలి!

సంఘటిత శక్తిగా భావించి దుష్టశక్తుల్ని ఎదుర్కోవాలి! చట్టరీత్యా కానీ, సంఘాలన్నీ ఏకమై కానీ, ఎవరికి వారుగా కానీ- సమాజంలో స్త్రీలపై జరుగుతున్న అరాచకీయాల్ని అరికట్టాలి! 'గీత దాటిన సీత కష్టాల పాలవటం' కాదు- సీతని అపహరించిన రావణుడు సర్వనాశనమయ్యాడన్నది- లోకులు గ్రహించాలి!

అప్పుడే సీతారామ కళ్యాణం! మనిషి మహోన్నతుడయ్యే శుభసమయం!!



# అసందర్భ సన్నివేశాలు-
# అపశ్రుతి ప్రతిధ్వనులు

మనలో చాలామందికి- కొన్నిరకాల అలవాట్లు వుంటాయి.

అవి ఎంత విచిత్రమైనవంటే సమయం, సందర్భం కూడా గమనించకుండా ప్రవర్తిస్తుంటారు. దానివల్ల ఫలితాలు ఎలా వుంటాయన్నది గమనించరు.

పండుగ రోజుల్లో, పర్వదినాల్లో- ఇళ్లూ, వాకిళ్లూ కడిగి ముగ్గులు పెట్టుకుని- శుభమా... అని అంతా సంతోషించవలసిన సమయంలో- ఎప్పుడూ పెట్టుకునే అలవాటు చొప్పున టేప్‌రికార్డర్ పెట్టుకుంటే- దానిలో వచ్చే పాట ఏమిటీ- "ఎంతభార మీ బ్రతుకు? ఎన్నినాళ్లు ఈ వేదన"- అంటూ ఏ పాత సినిమాలోని పాటో వస్తుంది!

నిండుగా కళకళలాడుతున్న ఇంట్లో ఏడుపుగొట్టు పాట వింటుంటే- ఎలా వుంటుందీ?

శ్రీరామనవమి కదా... ఉదయం లేవగానే ఏ భక్తిరంజనో విందామనుకుంటే- మన ఇంట్లో రేడియో వినిపించకుండా హెచ్చుస్థాయిలో, పక్కింటివాళ్ళ టేపులో- 'తత్వం' వినబడుతూ వుంటుంది! బహుభారంగా- మనను అంతా నీరసించిపోయేలా వస్తుంటుంది... ఆ పాటరాగం!

తత్వాలు- మంచివే! అయితే వాటికి సందర్భం వుంటుంది! భక్తిశ్రద్ధలతో పూజించుకోవలసిన విచార సమయంలో- ఓదార్చి, జీవితసత్యాన్ని తెలియచేసే తత్వాలను వినిపించితే- భక్తిభావం సన్నిగిల్లిపోతుంది! సామాన్యులకైతే- ఉన్న భక్తీ పోతుంది!

కొందరు- పెళ్ళిళ్లలో- మంగళకరమైన సన్నాయివాయిద్యాలకి బదులు- గెంతులు, హోరుతో భీభత్సమైన పాశ్చాత్యసంగీతం రికార్డులు వేస్తుంటారు! అవి విని ఆనందించలేరు సరికదా... గుండెల్లో దడ.., అసలే పెళ్ళి హడావిడీ- అతిథుల రాక... ఇవన్నీ కలిసి ఏ బి.పి.యో (రక్తపోటు) పెరగగలదు.

మరికొందరు- ఎవరింటికైనా పరామర్శించటానికి వెళ్లాల్సివస్తుంది. ఆ సమయంలో- ఆ ఇంట్లో వాళ్లెవరైనా- అలవాటైన కూనిరాగం తీస్తూ- పాటని పాడుకుంటూ వుంటారనుకోండి- వెళ్లినవాళ్ళకి ఏమనిపిస్తుంది?

సత్యనారాయణ వ్రతాలు- నోములు- చేసుకునేవాళ్ళు ఆరోజు సంప్రదాయకమైన వంటలు చేసుకుంటే బాగుంటుంది కానీ.., బిర్యానీలు- ఉల్లిపాయ పచ్చళ్ళు మసాలా కూరలు- బఫే భోజనాలు- ఎబ్బెట్టుగా వుంటుంది! రుచులు ఎలావున్నా- ఒక సనాతనాచారాన్ని పాటిస్తున్నప్పుడు- దానికి సంబంధించిన పనులే చేయాలి! భోజనం, వస్త్రధారణ- అతిథి సత్కారం- ఇత్యాదివన్నమాట!

ఈనాడు వివాహాలకి వెళ్లేవారిలో చాలామంది (బాబ్డ్ హేరు) జుట్టు కత్తిరించుకుని- బొట్టూ గాజులు మానేసి- మాడ్రన్ డ్రస్సులో వెళ్తున్నారు!

ఇది చూడటానికే జుగుప్సగా ఉంటుంది! వధూవరులని దీవించి, పచ్చగా వర్ధిల్లమని చెప్పి అక్షింతలు చల్లవలసిన సమయంలో- శుభ్రంగా కనిపించాలి! అటువంటి పద్ధతి ఇష్టంలేనప్పుడు- ఆ కార్యక్రమాలకి వెళ్లడం మానేయాలి!

అలవాట్లన్నవి- అందరికీ వుంటాయి! కానీ- సమయాన్నీ, సందర్భాన్నీ గుర్తుంచుకుని ప్రవర్తించుకోవాలి!

మంగళకరమైన చోట- అమంగళకరమైన పాటలు- వస్త్రాలంకరణ చేసుకోవటం అపశ్రుతి పలుకుతుంది! అలాగే విచారించవలసిన సమయంలో నవ్వులూ- షోకులూ- శృంగార పరమైన పాటలూ... అసభ్యంగా వుంటాయి!

ఈనాడు ఏది తోస్తే అది చెయ్యటమే గొప్పగా భావిస్తున్నారు... పెద్దలూ, చిన్నలూ కూడా! కానీ... కంటికి కనిపించిన శాస్త్రంలో (అది విజ్ఞానమైనా- వేదాంతమైనా సరే!) అనేక పరిణామాలు జరుగుతూ వుంటాయి!

మన నుంచి బయటపడే ప్రతి కాంతిరేఖా, వాక్కు యొక్కా, లేదా ధ్వని యొక్కా 'ప్రతిధ్వని'- వాతావరణంలో సుళ్లు తిరిగి- ఫలితం ఇస్తుంది! ఇది విజ్ఞానశాస్త్రంలో తెలుస్తుంది! అదే వేదాల్లో- దేవతలు 'తథాస్తు' అంటారని చెప్తారు! రెండింటి అర్థం ఒక్కటే!

ఈ రెండూ కాక- బాహ్యానికి కూడా చూడటానికీ, వినడానికీ బాగుండని- అసందర్భ సన్నివేశాలు- అపశ్రుతులుగా వుంటాయి!

